
TANTEX

# ఉత్తరాలు

**జయప్రద**

ఆంధ్రుల అందాల నటి జయప్రద ముఖచిత్రం కళ్ళు జిగేల్ మనిపించేలా ఉంది.

కడియాల చంద్రుడు(మహబూబ్‌నగర్)

*　　*　　*

జయప్రద ముఖంతో వెలువడిన (మన) ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాల బాగుంది. విమర్శించడానికి అందులో నాకేమీ దొరకలేదు.

చింతకింద ప్రసాదరావు (నిడుబ్రోలు)

**ముచ్చటైన జంట**

"చిరంజీవి, గీత"ల జంట చూడముచ్చటగా వుండి మమ్మెంతగానో ఆకట్టుకొంది.

పి పాండురంగారెడ్డి (చిత్తూరు)

**కంటతడి**

అందాల నటి "శ్రీదేవి" ముఖచిత్రంతో వెలువడిన 13.8.82 నాటి ఆంధ్రపత్రిక చూడటానికి రెండు కళ్ళు వెయ్యి కళ్ళయినా చాలవనిపించేంత అందంగా ఉంది. సర్దుబాటు కథ చదివి కంట తడిపెట్టాను.

కందిగట్ల ప్రభాకర్ (జనగామ)

**వేశ్యావృత్తి**

విన్నకోట సుశీలాదేవి గారి "దేవదాసీ" అనే వ్యాసము నన్నెంతో ఆకర్షించింది. సుమారు 8వ శతాబ్దము నుండి ఇప్పటివరకు వేశ్యావృత్తి ఏవిధముగా మారుతూ వచ్చిందో ఉదాహరణలతో బాగా వ్రాయగలిగారు.

కె. గోపాల్‌రెడ్డి (నాగుల్‌పల్లి)

( 66వ పేజీ చూడండి )

# షేక్ అబ్దుల్లా అస్తమయం

జమ్మూకాశ్మీర్ రాజకీయాలలో గత అర్ధ శతాబ్దిగా అత్యంత ప్రముఖ పాత్ర నిర్వహించి తిరుగులేని నాయకుడిగా, కాశ్మీర్ సింహంగా, కాశ్మీర్ ప్రజల ఆశాజ్యోతిగా పేరుగాంచిన షేక్ మహమ్మద్ అబ్దుల్లా సెప్టెంబరు 8వ తేదీ రాత్రి హృద్రోగ కారణంగా శ్రీనగర్‌లో అస్తమించారు. ఆయన వయస్సు 77 సంవత్సరాలు.

ప్రధాని శ్రీమతి గాంధీ, ఆమె మంత్రివర్గ సహచరులు కొందరు, లోక్‌సభ స్పీకర్, ప్రతిపక్ష నాయకులు, కొన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులు, గవర్నర్‌లు, పార్లమెంటు సభ్యులు, తదితర ప్రముఖులెందరో షేక్ అబ్దుల్లా అంతిమ యాత్రలో పాల్గొని శ్రద్ధాంజలి ఘటించారు

అపూర్వమైన రీతిలో అశేష జనవాహిని షేక్ అంత్యక్రియలకి హాజరై అశ్రుతర్పణం విడిచింది.



భారత ఉపఖండంలో అగ్రశ్రేణి రాజకీయ నాయకుడుగా పేరు పొందిన షేక్ అబ్దుల్లా అస్తమయం ఎన్నో రకాలుగా లోటుని సృష్టించిందనటంలో అతిశయోక్తి ఏంతమాత్రం లేదు.

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభు ప్రసాద్

సంపాదకుడు

[1938 1972]

శుక్రవారం : 1-10-'82

దుందుభినామ సం. ఆశ్వయుజ శు. త్రయోదశి

సంపుటము 75 సంచిక 5

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

ఆరు మాసాల చందా రు. 42-90

పోస్టులో ఏడాది చందా రు. 85-80

విడి ప్రతి వెల రు 1-50

ఆంధ్ర పత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక



## అతడికి 3 నెలలు నిండాక, పాలు మాత్రమే ఇస్తే సరిపోదు

# మీ పాపాయికి కావలసినది ఫారెక్స్

## పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

**3 నెలల వయస్సు—ఘన ఆహారం ప్రారంభించవలసిన సమయం.**

3 నెలలు నిండాక, పాపాయి పెరిగే అవసరాలకు కేవలం పాలు మాత్రమే సరిపోవు. పాపాయి చురుకుగా, తొందరగా పెరుగుతూంటాడు. అంచేత కేవలం పాలు ఇవ్వగలిగే వాటికన్నా ఎక్కువ కాలరీలు అతడికి కావాలి. అంతేకాదు, పాలు తాగడాన్ని తగ్గించి హెచ్చు కాలరీలు ఇచ్చే ఘన ఆహారం అతడికి అవసరం. ఈ సమయంలోనే మీ పాపాయికి నమలడం అలవాటు కావాలి. అప్పుడే, తర్వాత "పెద్దలు తినే" ఆహారాలను చక్కగా నమిలి మింగగలుగుతాడు. పైగా, పాపాయికి ఇప్పుడు రుచి అనుభవం కూడా పెరుగుతూంటుంది. అంచేత, అతడికి కొత్త రుచుల్ని పరిచయం చెయ్యవలసిన సమయం ఇది.

**3 నెలల వయస్సు—మరింతగా ఐరన్ కావలసిన సమయం.**

"పాపాయికి ఘన ఆహారాలు ప్రారంభించేందుకు 2-4 నెలల మధ్య వయస్సు ఉత్తమమైనది. పాలు మంచి అహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందువల్ల అది సంపూర్ణ ఆహారంకాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఘన ఆహారాలు కావాలి."

డాక్టర్ సుభాష్ సి. ఆర్య:
"ఇన్‌ఫెంట్ అండ్ చైల్డ్ కేర్ ఫర్ ది ఇండియన్ మదర్."

**డాక్టర్లు ఫారెక్స్ ఎందుకు సిఫార్సు చేస్తారు?**

ఘన ఆహారాలు ప్రారంభించడం కోసం, ప్రత్యేకంగా తయారు చేయబడిన ఆహారం ఫారెక్స్. మీ పాపాయి సున్నితమైన జీర్ణశక్తికి అనువుగా వుండేటట్లు ముందే పచనం చేయబడింది. ఫారెక్స్‌లో ఉన్నాయి—సత్వర పెరుగుదలకు ప్రొటీన్లు; శక్తి కోసం కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు; దృఢమైన ఎముకలు, గట్టి పళ్ల కోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్లు; ఆరోగ్యవంతమైన రక్తం కోసం ఐరన్. వీటన్నిటి వల్లా ఫారెక్స్, పాపాయి సంపూర్ణమైన పెరుగుదలకు ఆదర్శవంతమైన ఘన ఆహారం.

**ఉచితం!** "పాపాయి మొదటి ఏడాది పుస్తకం" కొత్తగా తల్లులైన వారు పిల్లల పట్ల తీసుకోవలసిన శ్రద్ధ గురించి సులభ రీతిలో వివరిస్తుంది. మీ ప్రతి కోసం, 50 పైసల స్టాంపు జతపరుస్తూ ఈ క్రింది చిరునామాకు వ్రాయండి:
పి. ఒ. బాక్స్ నం. **19119,** (FAR 15 T),
బొంబాయి **400 025.**






## డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్

## సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

CASGLF-10-244 Tel

## న్యూఢిల్లీ లేఖ

డాక్టర్ జయ్ దుబాషి

# ఏ దేశమేగినా ఎందుకాలిడినా...

ఎక్కడయినా విమానం ఎక్కండి – అంటే భారతదేశం బయట అన్నమాట ! – అందులో కనీసం అరడజను మంది భారతీయులు కనపడతారు. కొన్ని సమయాలలో ఇంకా ఎక్కువమంది కనపడతారు. హాలాండులోని ఆమ్‌స్టర్‌డామ్ విమానాశ్రయంలో ( ఇది ప్రపంచంలో కెల్లా పెద్ద ఎయిర్‌పోర్టులలో ఒకటి ) నేను 150 మంది ప్రయాణీకులలో 18 మంది భారతీయులు ఉండటం గమనించాను. వారిలో ఎవరూ భారతదేశానికి వెళ్లటంలేదు. ఇది ఎలాగ ఊహించానంటే అప్పుడు అక్కడి నుంచి భారతదేశానికి వేరుగా ఒక విమానం వెడుతోంది. వీరేకనుక భారతదేశం పోవలసి వస్తే అందులో ఎక్కేవారు కదా ? అన్ని రకాల వేళలలోనూ నేను భారతీయులని ఎక్కడెక్కడో చూస్తూ ఉండేవాడిని – ఆస్ట్రేలియాలోని బ్రిస్‌బేన్, జపానులోని కయోటో, తయివాన్‌లోని తయిపెయి, ఇటలీలోని మిలాన్ వగయిరా. వారంతా అక్కడ ఏమి చేస్తున్నారో నాకు తెలీదు. (ఆ మాట కొస్తే నేనూ భారతీయుడినే కదా, అక్కడేమి చేస్తున్నాను ?) కాని వారు ప్రపంచమంతా కొట్టవచ్చినట్లు కనిపిస్తారు. ఈ విధంగా వారు యూదుల వంటి వారు. [ యూదులు ప్రపంచం అంతా చెల్లా చెదరయ్యారు. ఇలాగ చెల్లా చెదరు కావటాన్ని "డయాస్పొరా" అంటారు ]



ఇటీవల కోయంబత్తూరులో 'ది కోయంబత్తూర్ తెలుగు స్కూల్' ప్రారంభోత్సవ సందర్భంగా తీసిన ఫొటొ. మణి హైస్కూల్ కరస్పాండెంట్ శ్రీ ఎన్. చినస్వామి నాయుడు, క్లాసులు నిర్వహించిన కుమారి ముక్కామల అపర్ణ, విద్యార్థి, విద్యార్థినులని చిత్రంలో చూడవచ్చు.

వీరందరూ తమ హిందూ సంస్కృతిని కోలుపోయిన వారనీ, నామ మాత్రపు హిందువులనీ, అనుకుంటే తప్పు, అసలు సంస్కృతి అంటే ఏమిటి ? అందులోనూ హిందూ సంస్కృతి అంటే ఏమిటో ముందు చెబితేనే తర్వాత వీరు హిందువులో కాదో చెప్పవచ్చు. నేను లండన్‌లో ఒకసారి ఒక అమ్మాయిని కలుసుకున్నాను ఆమె ట్రినిడాడ్‌కి చెందినది. ఆమెకి ఆంగ్ల భాషలో రాసే సుప్రసిద్ధ రచయిత వి. ఎస్. నయిపాల్ తెలుసు నయిపాల్ అన్న పేరులో హిందూ శబ్దాలు ప్రతిధ్వనిస్తాయి. ఆమె చూడటానికి భారతీయ వనితలాగే ఉంటుంది –ఆమె ముఖ నిర్మాణంలో జాతి సంకరం కొంత కనిపించి నప్పటికీ ట్రినిడాడ్‌లో [భారతీయులూ, యూరోపు వారూ, ఆఫ్రికా వారూ ఉంటారు ] ఆమె హిందువంటే ఇంతవరకే. చూడటానికి ఈ దేశానికి చెందినట్టు కనిపించవచ్చు. కాని, ఆమెకి భారతీయ భాష ఏదీ రాదు ఆమె భారతీయ వస్త్రాలు వేసుకోదు, హిందూ మతానికి సంబంధించిన ప్రాచీన గ్రంథం దేనిని గురించీ ఆమె వినలేదు. అసలు ఆమె భారతదేశానికే రాలేదు అయినాసరే, "నేను హిందువు"ని అని ఆమె చెప్పుకునేది. నాకు అది చాలు. నా నిర్వచనం ప్రకారం ఎవరు తను హిందువు అనుకుంటే వారు ఒక హిందువు అతను లేదా ఆమె నిజానికి ఏమిటో అనవసరం – యూదులు, మహమ్మదీయులు, పార్శీలు, ఇంకా ఎవరయినాసరే శ్రీ చాగ్లా ఇదే అన్నారు–ఆయన తామొక హిందువని అన్నారు, ఆయన ఒక హిందువే

ట్రినిడాడ్ నుంచి వచ్చిన అమ్మాయి తానూ హిందువే అంటోంది తనది అసలు భారతదేశం అని ఆమె అభిప్రాయం అయి ఉంటుంది. ఏది ఏమయినా భారతీయ, హిందువుల మధ్య తేడా ఆమెకి కనిపించలేదన్నమాట నయిపాల్ "చీకటి ప్రాంతం" లేదా " ఏరియా ఆఫ్ డార్క్‌నెస్ " అనే పుస్తకాన్ని రాశాడు. ఆయన అభిప్రాయంలో "చీకటి" రాజకీయపు చీకటి కాదు, అది ఒక హిందువు తాలూకు చీకటి. నయిపాల్ భారతీయుడే. కాని, ఆ యదార్థాన్ని ఒప్పుకోవటం ఆయనకి మనస్కరించదు. ఆయన భారతీయుడు, అంటే ఆయన హిందువే అన్నమాట. ఎందుకంటే ప్రతి దేశానికీ ఒక

ఆత్మ ఉంటుంది ఆత్మలేని దేశం దేశమే కాదు నయిపాల్‌కి కనిపించిన 'చీకటి'' ఏమిటి ? భారతదేశం యొక్క మూల స్వభావం హిందూ స్వభావమే కదా ? అది కనిపించక ఆయనకి అంధకారం ఎదురయింది

విదేశాలలో ఉండే భారతీయులలో ఎక్కువ మంది తమలో ఈ హిందూ స్వభావాన్ని పదిలపరుచుకుంటూరు. వారికీ, భారతదేశానికీ మధ్య మిగిలిన సంబంధం ఇదొకటే కదా ? ఇదే లేదనుకోండి సంబంధాలు ఏ వ న్నా ఏర్పడితే అవి ప్రయోజనం లేనివీ, కేవలం ధన సంబంధ మయినవి అవుతాయి గాలధారీ సోదరులు ఈ దేశంలో పెటుబడి చేస్తారు, లేదా చేస్తామంటూరు; వారి లక్ష్యం ఏమిటి? లాభాలు చేసుకొనటమే కదా ? అది వాణిజ్య వినియోగం అవుతుంది. అయితే, అమెరికా నుంచి శాస్త్రజ్ఞులు లేదా ఇంజనీరులు భారతదేశానికి తిరిగి వచ్చేద్దామనుకుంటే వారిని భారతదేశం వినియోగిస్తోందనుకోవాలి కాని వారు భారతదేశాన్ని వినియోగిస్తున్నట్లు కాదు. ఇది పూర్తిగా వేరే విషయం.

భారతదేశాన్ని ఇతరులు వాణిజ్య దుర్విని యోగం చెయ్యరాదని మనం కోరుకుంటూము. ఇదే పద్ధతి మీద మనం భారతదేశం బయట ఉండే భారతీయులని వాణిజ్య దుర్వినియోగం చెయ్యాలని అనుకొనరాదు

విదేశాలలో ఉండే భారతీయులని మనం మన కుమార్తెల లాగ చూసుకొనాలి. అప్పుడప్పుడు మన అమ్మాయి పుట్టింటికి వస్తుంది. వచ్చినపుడు మనం ఆమెని "మా కేమి తెచ్చా'' వని అడుగుతామా ? అమ్మాయికి పుట్టింటితో సంబంధం సుఖమయంగా ఉండాలి. అప్పుడే ఇద్దరికీ బాగా ఉంటుంది. భారతదేశం బయట ఉండే భారతీయులు భారతదేశానికి అవసరం అయిన వారు. మారిషస్, మొజాంబిక్, ఫిజీ, సింగపూర్ ఇంకా కొన్ని దేశాలలో భారతదేశం నుంచి వలస వెళ్లిన వారి సంతతి వారు మంత్రివర్గంలో ఉన్నారు. ఇటువంటి వారు ముందు ముందు ఇంకా ఉంటూరు ఇది వారికీ మంచిది, భారతదేశానికీ మంచిది ఎందుచేతనంటే, ఒక భారతీయుడు తను భారతీయుడనన్న సంగతి మర్చిపోలేడు — ఎంత ప్రయత్నించినాసరే. నయిపాల్ లాంటి వారు ప్రయత్నించినా నెగ్గలేక చాలా బాధ పడుతూ ఉంటూరు ★

లోకంపోకడ












# మధురం మధురం అధరం మధురం!

ఆదివారం... అంటే హాయిగా తొమ్మిది గంటల వరకు నిదుర పోవాలని నా అభిప్రాయం. ఆరోజు స్వేచ్ఛగా హాయిగా ఉంటుంది. క్యాష్ బుక్కులు, బ్యాలెన్స్‌లు లేవు. అధరం మధురం అంటూ, అధరామృతం అందించే అర్ధాంగిని అలరించి, మళ్లీ ముసుగుతన్నాను కొత్త పెళ్లికూతురు కదా. నా స్వేచ్ఛను కాస్త ఖర్చు చేసినా ఫరవాలేదు అనుకున్నాను. మనకెలాగు లక్షాధికార్లమయ్యే యోగం లేదు. కలలయినా కందామని కళ్లు మూసుకున్నాను.

కర్మ. అందమైన కలలు రావు. కలలో కూడా కు టు ం బ ం, వారి కష్టాలేనా! విసుక్కొని గట్టిగా కళ్లు మూసుకున్నాను. ఈసారి ఏదో లోకంలోకి తేలిపోయాను... ఆ లోకంలో అందమైన అమ్మాయిలు ఆడుతున్నారు పాడుతున్నారు. ఛ... బొత్తిగా నీతి నియమాలు మరిచిపోయానేమిటి! పెళ్లయి ఆరు నెలలు కాలేదు అర్ధాంగి, బెటర్ హాఫ్ ఇంట్లో ఉండగా వర్ట్స్ కలలు కనటం ఛ... ఛ... అన్యాయం!

"అబ్బ లేవండి! టీ చల్లారిపోతుంది!" వచ్చి కల్పన లేపింది.

లేవక తప్పలేదు. రెండు మగ్గులలో టీ పట్టుకుని కూర్చుంది

వివాహం విద్యా నాశాయ! అన్నారు కాని నన్నడిగితే వివాహం స్వేచ్ఛ నాశాయ! అంటాను.

అదే గదిలో అదే మంచంపై ఆదివారం వస్తే అర్ధరాత్రి... కాదు... కాదు మిట్ట మధ్యాహ్నం వరకూ పడుకుని నిదురపోయే వాడిని. ప్రక్క వాటాలో ఉన్న ఇంటివారు, మా ఊరువారు చంద్రం అన్నయ్య, లలితొదిన ముద్దుగా నాకు నిదానేశ్వర్య చక్రవర్తి, నిదుర ప్రియా అంటూ బిరుదులిచ్చి పిలిచేవారు.

లేచి టీ తీసుకున్నాను. మౌనంగా అర్ధ మగ్గు టీ అవ్వచేసాను. కల్పన ముఖం చిన్నబోయింది.

మై గాడ్! నా డ్యూటీ మరచిపోయాను. మరువకండి సర్! మంచి భర్త కావాలంటే మంచి నటులు కండి.

"కల్పనా! అబ్బ, టీ అద్భుతం డియర్! మధురం... మధురం నీ టీయే మధురం" అన్నాను.

కల్పన ముఖం వికసించింది. బెట్టుగా 'చాల్లెండి' అన్నది.

"చాలదు డియర్! మరో కప్పు ముఖం కడిగి తాగాలి."

"వీల్లేదు. మరో పది నిముషాల్లో బయలు దేరాలి" అంటూ తలుపు తోసుకుంటూ వచ్చాడు సుధీర్.

వాడు నా కొల్లీగ్. పెళ్లి కాకముందు మా ఇద్దరికి ప్రేయసీ ప్రియులని ముద్దు పేరుండేది.

కల్పన లేచింది. సుధీర్ ఆ కుర్చీలో కూర్చున్నాడు.

"చూడు కల్పనా! నా ప్రియుడిని నీ కప్పగించాను కదా! ఎంత త్యాగం చేసానో నీకేం తెలుసు! ప్చ్... ప్చ్...! బొత్తిగా చేసిన సహాయం మరచిపోయే రోజులు—" అన్నాడు సుధీర్.

"మీకు కావల్సింది టీయేకదా. నిముషంలో తెస్తాను" కల్పన నవ్వుతూ లోపలికి వెళ్లింది.

"ఏమిటా నిదుర! మనమీరోజు తొమ్మిది గంటలకు ప్రగతి స్కూల్లో కలుసుకుంటున్నామని మరచపోయావా!"

"అవున్రా..." అన్నాను అదిరిపడి. బ్యాంక్ ఎంప్లాయీస్ తరఫున కాంపిటిషన్ డ్రామా వేస్తున్నాము.

"గ్లామర్ కింగ్‌ను, అందాల నటుడిని నన్ను వదిలి ఆ చలపతిగారు నీకు హీరో ఛాన్స్ ఇచ్చారు. ఆ థ్రిల్లింగ్ అయినా లేదా" అన్నాడు ఉడుక్కుంటూ.

గబ గబ వెళ్లి స్నానం, బ్రష్ చేసుకుని వచ్చేసరికి కల్పన, సుధీర్ కబుర్లు చెప్పుకుంటున్నారు.

"పదరా! ఆ చలపతిగారు అగ్గి బరాటా అవుతారు" అన్నాను.

"మాలాంటి వారిమీద అవుతారు. నిన్ను నెత్తిన పెట్టుకుంటారు."

"అబ్బా! ఆయన నెత్తి అంత విశాలంగా ఉందా!!'

త్వరగా బయటికి వచ్చాను చెప్పులేసుకుని. నా కోసం చూడకు అని కల్పనతో చెప్పి బయట పడ్డాను. మేము వెళ్లేసరికి చలపతిగారు గండు పిల్లిగా ముఖం పెట్టాడు.

"సారీ! చాలా రోజులయింది. అసలు నాటకం వుందని మరచిపోయాను" అన్నాను వినయంగా

"ఇంకా మాటలెందుకు!" అన్నాడు. ప్రక్కన క్యాంటీన్లో టిఫిన్ కానిచ్చి రిహార్సల్స్ చేసాం సాయంత్రం భయపడుతూ ఇల్లు చేరాను. లలిత ఒదిన, కల్పన సినిమా కెళ్లారు. 'అమ్మయ్య' అనుకున్నాను. మర్నాడు బ్యాంకు ఒదులుతూనే, పుస్తకాల షాపుకి వెళ్లి ఒక్క నిముషం నా భార్యామణి నోట్లో నానే రచయితల పేర్లు, రచయిత్రుల పేర్లు గుర్తుకు తెచ్చుకుని, ఓ వంద రూపాయల పుస్తకాలు కొన్నాను.

అవి తెచ్చి కల్పన కిచ్చాను.

"అబ్బ!... యెంత దయ... యెంత ఆప్యాయత! అద్దె పుస్తకం పట్టుకుంటే లాగి పారేసే మీరేనా!" అన్నది ఆశ్చర్యంగా.

"ఆహా! అక్షరాలా నేనే! కాని నా స్వార్ధం కూడా ఉంది డియర్. ప్రతి సంవత్సరం మేము బ్యాంకు తరఫున నాటికలు, నాటకాలు వేస్తాం. ఎప్పుడూ బెస్ట్ యాక్టింగ్ ప్రైజ్ మనదేననుకో ఈ సారి వేస్తున్నాం. పది రోజులు రిహార్సల్స్. అందుకే .."

"ఓహో! అదా సంగతి ఏమి నాటకం!"

"బంగారు నాటకం! ఏమిటా ప్రశ్న! 'భారత నారి' అని, స్త్రీ వివిధ రూపాలుతే కొత్త ప్రయోగం..."

# మధురం మధురం...

"మరి స్త్రీ పాత్ర యెవరు వేస్తారు!"

"మా బ్యాంక్ ఎంప్లాయ్ సుమతి వేస్తుంది" అన్నాను.

ఆ తరువాత కాలం ఎలా గడిచిందో తెలియదు. నాటకం రోజున లలిత వదిన, చంద్రం, కల్పన వచ్చారు. సుధీర్‌ది చిన్న వేషం కాబట్టి వారిని కూర్చోబెట్టి వచ్చాడు.

నాటకం ముగిసింది. ఇంకా రెండు నాటకాలున్నాయని రిజల్ట్ చెప్పలేదు. బయటికి వచ్చాక అందరూ నేను బాగా చేసానని, నాకే బెస్ట్ యాక్టింగ్ ప్రైజని, ప్రొడక్షన్‌కి రావాలని పట్టు పట్టారు.

"ఏదో చేసాం. ఆ తృప్తి ఉంటే చాలు. ప్రైజులు మనకే రావాలనుకోవటం అత్యాశ" అన్నాను.

"పెద్దపోజు..." సుధీర్ ఉడుక్కున్నాడు.

"కల్పన, లలితొదినా ఏ్రా!"

"చంద్రగారు తీసుకు వెళ్లారు" అన్నాడు సుధీర్.

బస్సు పట్టుకుని వచ్చేసరికి పదకొండున్నర అయింది తలుపుమీద నా చేయి పడకముందే తలుపులు తీసి, వెళ్లి పడుకుంది కల్పన. నేనే చెప్పాను. నాకు పది గంటలు అయితే భోజనం చేసి పడుకొమ్మని. అందుకే అనుకుని, నేను వెళ్ళి, చిరాకుగా ఉందని స్నానంచేసి, అన్నం పెట్టుకు తిన్నాను. అలసి వున్నానేమో నిదుర పట్టేసింది. మర్నాడు బయట పెద్ద శబ్దం అయితే లేచాను. బల్లమీది గడియారం నవ్వుతూ నన్ను వెక్కిరించింది. టైమ్ తొమ్మిదింబావు. "బాప్‌రే..." అనుకుని బాత్‌రూమ్‌లో దూరాను. కల్పనమీద గొంతు వరకు కోపం వచ్చింది. వెంటనే వెల్లువలా అభిమానం కల్గింది. పిచ్చిపిల్ల అలసిపోయా ననుకుందేమో!

బయటికి వచ్చి, బట్టలు వేసుకున్నాను. కల్పన కనిపించలేదు. క్యాంటీన్లో ఏదో ఒకటి తినచ్చుననుకుని పరుగులు తీశాను.

మా కొలీగ్స్ అంతా నా నటనను మెచ్చుకుంటూ, టీ ఇప్పించారు. టీ త్రాగాను. పని చేసుకుని,సాయంత్రం ప్రైజు డిస్ట్రిబ్యూషన్ ఉంటే అటుదటే వెళ్లాం.

మాకే బెస్ట్ ప్రొడక్షన్, నాకు బెస్ట్ యాక్టింగ్, సుమతికి ప్రైజులు వచ్చాయి. అందరి అభినందనలు అందుకుని పదిగంటలకు ఇల్లు చేరాను.

అశోకవనంలో సీతలా... కాదు... కాదు కారడవిలో సావిత్రిలాగా... ఊహుం అసహాయంగా చూచే ద్రౌపదిలా... అబ్బ అవేవీ కావు... అచ్చు ఆడదానికి నిర్వచనంలా కూర్చుంది కల్పన.

నాకిచ్చిన షీల్డు ఆమె చేతిలో పెట్టాను.

"కల్పనా !..."

"ఊఁ..." ఎంతో భారంగా తలమీద నూరు టన్నుల బరువు మోస్తున్నట్టు ముఖం పెట్టింది.

"ఏమిటలా ఉన్నావ్!"

"ఉన్నట్టే ఉన్నాను! ఎలా వున్నాను" ఎదురు పశ్న వేసింది.

"ఏమయింది?" అన్నాను భుజం పట్టి కుదుపుతూ.

"ఏం కావాలనుకున్నారు!"

"ఏమిటా ఎదురు ప్రశ్నలు! తిన్నగా జవాబులు చెప్పవూ!" ఈసారి చ్రున కోపం వచ్చింది నాకు.

"జవాబులు, జానతనం వ... మిమ్మల్ని నా కొంగు కట్టుకుని తిరిగేదాన్ని..." అని బావురు మంది. ఆడవారికి ఉన్న ఆఖరు అస్త్రం, తిరుగులేని అస్త్రం! నాకు కంపరం కలిగింది.

"వ్యవహారములందు, వైవాహికములందు..." అన్నారు. అందుకే కోపాన్ని అమృతంలా గుటక వేసాను. మంచి నటుడిని కదా, అని కల్పన పమిట నా చేయికి ముడి వేసుకున్నాను.

"చాలా !" అన్నాను.

"చాల్లెండి. నా బతుకింతే..."మరోసారి చీదేసింది.

"అసలు విషయం ఏమిటే కల్పనా ! నాకు ఈ ఏడ్పులకు అంగలార్పులకు అర్థం తెలియదు." అన్నాను.

"ఇలా...భర్త... అబ్బ..." అర్థంలేని నిట్టూర్పులు వదిలింది. నేను బట్టలు మార్చుకుని వచ్చి, అన్నం ముందు కూర్చున్నాను.

"మీకు ఆ సుమతికి పరిచయం యెప్పటి నుండి?"

ఒక్కసారి తలెత్తాను. అర్థం అయిపోయిందాపాయింటు.

"నేను, ఆమె ఒకేసారి ఉద్యోగంలో చేరాం. నాల్గు సంవత్సరాలు అయింది."

"మీరిద్దరూ ఒకరిని ఒకరు అంతగా ఇష్టపడితే పెళ్ళెందుకు చేసుకున్నారు ?..." మరోసారి రాగం తీసింది...ఒట్టి రాగం కాదు చక్రవాకం.

"ఛ...ఛ... నీ కసలు బుద్ధి ఉందా! ఆమె నా తోటి ఉద్యోగి, వివాహితురాలు. ఏదో కళ అనే గుల ఉంది కా బట్టి నటిస్తుంది" అన్నాను కోపంగా అన్నం మీద నుండి లేచి.

"లేదండీ...కూర్చోండి." బలవంతంగా కూర్చోబెట్టింది.

"మళ్ళీ అన్నం తింటుండగా నీ ఆవేదనలు, అభాండాలు ప్రక్కన బెట్టు." అన్నాను. ఏమనుకుందో మాట్లాడలేదు. భోజనాలు అయ్యాక అడిగింది–

"ఆవిడకు మీకు ఏ సంబంధం లేనిదే అంత క్లోజ్‌గా యెలా మూవ్ అయ్యారండీ" అన్నది అమాయకంగా.

ఈ సారి నవ్వు వచ్చింది.

"కల్పనా! మేము అంత క్లోజ్‌గా యాక్షన్ చేస్తున్నప్పుడు, మే మిద్దరమే ఉండము. మా చుట్టూ సహాయనటీ, నటు లుంటారు. డైరెక్టరుంటాడు. అ క్క డ ప్రేమికులుగా భ్రమ కల్గిస్తామేతప్ప క్లోజ్‌గా ఉండము అక్కడ ప్రత్యర్థులం. ఒకరిపై, ఒకరం పోటీపడి నటిస్తాము" అన్నాను.

అర్థం అయిందో లేదో గాని, మౌనంగా విన్నది.

"అదికాదండీ లలితక్క నన్ను చాతకాని దానవు, భర్తను అదుపులో పెట్టలేవా? అంటుంది" అన్నది కళ్ళు తుడుచుకుని.

"మనిషికి అదుపు పెట్టగలవేమో, మనసుకు పెట్టగలవా! ఆమె సిగరెట్టు త్రాగవద్దు, చీట్లపేక ఆడవద్దు అంటుంది. ఆయన ఆ రెండూ దొంగతనంగా చేస్తాడు" అన్నాను.

"అది కాదండీ! నన్ను ఇం కొ క రి కౌగిలిలో చూస్తే మీరూరుకుంటారా? నా కొక్క ప్రామీస్ చెయ్యండి. ఇక ముందు ఆడవాళ్ళతో నటించవద్దు. నటించినా భార్యా భర్తలుగా వద్దు" అన్నది.

ఒక్క క్షణం ఆలోచించి సరే అన్నాను. చిన్న పిల్ల. ఇంకా ముందు ముందు తెలుసు కుంటుంది అనుకున్నాను. ప్రామిస్ చేసాను. మళ్ళీ ఆ నాటకం వేసేనాటికి పరిస్థితులు అర్థం చేసుకుంటుంది అనుకున్నాను.

కోల్డ్‌వార్ ముగిసింది. వార్మ్ వెల్‌కమ్ అందుకున్నాను. ఆ విషయం మరిచిన నెల రోజులకు మా బావమరిదికి, అమ్మాయిని చూడాలి రమ్మని రాసారు మా మామగారు.

"చేసుకునేది మీ అన్న, నేను రావటం దేనికి?" అన్నాను.

"ఇద్దరం వెళ్లకపోతే అన్నయ్య బాధ పడతాడు. నేను వెళ్ళి వస్తాను" అన్నది కల్పన.

"అలాగే వెళ్ళు" అన్నాను. 'ఏమి ఆడ వాళ్ళో ఏమో, ఎప్పుడూ పుట్టింటిమీదే ధ్యాస' అనుకుని మళ్ళీ నవ్వుకున్నాను. పురుష ప్రపంచం చాలా విశాలమయింది. క్లబ్బులు, కబుర్లు, సినిమాలు, షికార్లు, నాటకాలు, అంటూ నానా రకాలుగా కాలక్షేపం చేస్తారు. స్త్రీలకు అవకాశం తక్కువ. అందుకే పుట్టింటి మీదకు ధ్యాస మళ్ళుతుంది. కల్పన వెళ్లాక మధ్యాహ్నము కాంటీన్‌లో పగలు భోజనం చేసినా, సాయంత్రం లలిత ఒదిన వదిలిపెట్టేది కాదు.

ఆ రోజు ఇంకా నిదుర లే వ లే దు. హడావుడిగా సుధీర్ వచ్చాడు. "ఒరేయ్!... నన్ను కాపాడాలి... నా పరువు కాపాడాలి" అన్నాడు.

"అభయం వత్సా! ఏం కావలయును!" అన్నాను.

"ఒరేయ్ నా పాలిటి దేవుడా! మా కాలనీలో ఎల్లుండి ఫంక్షన్ ఉందిరా. నాటికలు ప్రదర్శించే బాధ్యత నాదన్నారు. అది మరచి పోయాను. ఇప్పుడు వారు నాటకం అడ మంటున్నారు..."

"మిగతా మన స్టాఫ్ రడీగా ఉంటే నేను తయార్ వత్సా" అన్నాను.

"ధన్యవాదంబులు గురువుగారూ..." అంటూ పరుగెత్తాడు. అప్పుడు కల్పనకిచ్చిన మాటగాని, ఇంకోటి గుర్తులేదు. సుధీర్ వాడి అభ్యర్థన గుర్తుంది. నా పెళ్లికిముందు మమ్మల్ని పేయసీ, ప్రియులని ముద్దుగా పిలిచేవారు, అని చెప్పానా!

కాలనీలో నాటకం జోరుగా సాగుతోంది! అప్రయత్నంగా నా కళ్ళు ముందు వరుసలో కూర్చున్న వ్యక్తులపై పడ్డాయి. కల్పన, ఆమె అన్న రమేష్, చంద్రం అన్నయ్య, లలిత ఒదిన ఉన్నారు.

నా కాళ్లలో సన్నగా ఒణుకు ప్రారంభం అయింది. నాటకంలో పోలీసు స్టేషన్ తగల బెడుతూ పట్టుబడే దృశ్యం. అది పూర్తిచేసి లోపలికి రాగానే చలపతి తలపై ఒక్కటి మొట్టాడు.

"అద్భుతంగా చేసావ్ హర్షా! నిన్ను హర్షించలేను" అంటూ. అసలు విషయం చెబితే వాళ్ళు నవ్వుతారు. నేను గంభీరంగా మారిపోయాను. దానికి తగినట్టే వేదికమీద నా నటన గంభీరంగా ఉంటుంది. నాటకం పూర్తి అయింది.

"ఒరేయ్ నాయనా! ప్రక్క నటీనటు లను మింగేయటం నీకే చాతనయింది" అన్నాడు సుధీర్.

"అవునండీ! రొమాంటిక్ హీరోగా బాగా చేసారు లాస్ట్ టైమ్. ఈ రోజు



సీరియస్ సీన్లలో చాలా బాగా చేసారు" సుమతి అభినందించింది. నేను సత్యహరిశ్చంద్రుడిని కాకపోయినా, మొదటి సారే భార్య కిచ్చిన మాట నిలుపుకోలేని అధమాధముడిని...ఛ... నన్ను నేను తిట్టుకోవటానికి అంత భాష కావాలా!

బయటికి వచ్చేసరికి బావమరిది రమేష్ నిలబడ్డాడు. వావిలో బావ అయినా వయసులో చిన్నవాడు కాబట్టి బావమరిదిగానే ట్రీట్ చేస్తాను.

"హల్లో రమేష్!"

"హలో బావా! సింప్లీ సూపర్బ్. మీరింత మంచి యాక్టరని తెలియదు. సినిమాలో ప్రయత్నించు..."

"నువ్వే ఓ సినిమా తీసి, నాకు వేషం ఇవ్వు. అవును అమ్మాయి నచ్చిందా?"

"నచ్చటం ఏమిటి, ముహూర్తం కూడా పెట్టుకున్నాము. డిసెంబరు నాల్గో తారీఖున పెళ్ళి."

"గుడ్! కంగ్రాచ్యులేషన్స్" అతని చెయ్యి నొక్కి వదిలిపెట్టాను.

"థాంక్స్! ఉండవే తల్లీ! బావగార్ని నేను ఆహ్వానించి వస్తానంటే వినలేదు కల్పన. ఈ ఆడవారిని నమ్మిందెవరట..."

"చాల్లే...కల్పనేది?"

"మీ ఇంటి వాళ్ళతో వెళ్ళిపోయింది." అన్నాడు.

అంటే అర్ధాంగి గారు కోప గృహంలో దూరిందన్నమాట. ఆర్ట్ ఆఫ్ టాకింగ్, వాకింగ్ అంటూ వ్యాసాలు రాసారు గాని, భార్యను యెలా ప్రసన్నము చేసుకోవాలో ఒక్క హేండ్ బుక్ అయినా మగాడి కోసం రాయలేదు.

వెళ్తూ, వెళ్తూ చీర కొంటే...సమయం పదిగంటలు దాటింది.

## మధురం మధురం...

అలనాటి కృష్ణుడిలా కాళ్ళు పట్టుకుంటే ...ఛీ...అష్టభార్యలున్నారు కాబట్టి, తప్పు అని పట్టుకున్నాడు, నాకేం ఖర్మ పట్టింది.

"ఒరేయ్ నాయనా! బావమరిది అంతటి బంధువు లేడుగాని, కాస్త మేం పిలిస్తే పలుకు..." అన్నాడు సుధీర్

"ఆఁ...వెళ్దామా" అన్నాను.

"ట్రిపుల్ సవారికి అభ్యంతరం లేదా!"

"నో అభ్యంతరం! బస్సుకు నిరీక్షించే ఓపిక లేదు" అన్నాను.

ఇంటికి వచ్చేసరికి కల్పన రెండు మంచాలు విడంచేసి, ఉరిమిచూస్తూ కూర్చుంది. మోడర్న్ కోపగృహాలు అర్థంచేసుకోలేని అమాయకుడిని కాను.

మంచాలు ఎడం అవుతాయి. కంచాలు చప్పుడవుతాయి. భోజనంలో సారం తక్కువై ఖారం ఎక్కువ అవుతుంది మాటలు పోయి మౌనము వహిస్తారు. చిరునవ్వుకు బదులు రుసరుసలు ఎక్కువ అవుతాయి.

భోజనాలు అయినంతసేపు మే మిద్దరం ప్రత్యర్థుల్లా చూచుకుంటున్నాము. రమేష్ కబుర్లు చెబుతున్నాడు.

"కల్పనా! వరండాలో రమేష్‌కు పడక వెయ్యనా!" అన్నాను మెల్లగా అసలు అలక అన్న సంగతి అవాయిడ్ చేస్తూ.

"అక్కరలేదు. ఒక్క రోజు ఎడబాటుకు ఊరివారిని రాసుకుని, పూసుకుని తిరిగే యావ మీకుందేమో, నాకేం లేదు. నేను వంటింట్లో పడుకుంటాను."

"వంటింట్లో చీమలు, చిట్టెలుకలు..." భుజంపై చేయి వేసాను.

"మీకంటే చీమలు, చిట్టెలుకలు నన్నేం బాధించవు..." అన్నది విసురుగా చేయి త్రోసి వేస్తూ.

నాకు చిరెత్తుకొచ్చింది. ఆడతాను, పాడతానని, చదువులో ఫస్టని ఇంట్లో వారికి నేనంటే ప్రత్యేకమైన అభిమానం. అందరూ ఆదరంగా, అభిమానంగా చూసేవారు. అలాగే కాలేజీలో కూడా నాతో స్నేహం చేయాలని ఉవ్విళ్ళూరినట్టుండేవారు. ఉద్యోగంలో చేరాక అంతే. అలాంటిది భార్య అర్ధాంగి అవమానం చేయటమా–

వివాహం విద్య నాశనాయ! అన్నాను. కాని నన్ను అడిగితే వివాహం స్వేచ్ఛా నాశనాయ అంటాను. 'ఛీ ఏం భార్యలు! ఇంత చులకనగా చూడటమా!' వచ్చి అలసట పేరుతో ముసుగుతన్నాను.

అన్నా, చెల్లెలు అర్ధరాత్రి వరకు కబుర్లు చెప్పుకున్నారు.

మర్నాడు నేను లేచి బ్యాంకుకు తయారవుతున్నాను రమేష్ వచ్చాడు.

'నేను వెళ్ళి వస్తాను బావా! ఇక కార్డు పోస్టులో పంపుతాను. వారం రోజులుముందు రావాలి పెళ్ళికి" ఆహ్వానించాడు.

"వారం రోజు లెందుకు! ఒక్కరోజు ముందు వస్తాను మీ చెల్లి వస్తుంది" అని బ్యాంకుకు వెళ్ళిపోయాను.

సాయంత్రం వచ్చేసరికి రాజ్యాలు కోల్పోయిన మహారాణిలా కూర్చుంది కల్పన. ప్రపంచంలోని దిగులంతా కల్పన ముఖంలో గూడు కట్టుకుంది. నా కోపం, అభిమానం ప్రక్కకు నెట్టి, ప్రేమగా పిలిచాను. లేచి టీ ఇచ్చింది.

"జవాబు ఇవ్వలేనంతగా ఏం ఆలోచిస్తున్నావ్?"

"అదే... అన్నయ్య పెళ్ళికి వెళ్ళి అక్కడే

ఉండి ఉద్యోగం చేసుకోవాలా, లేక జీవితంతో రాజీపడి కాపురం చేయాలా అని.''

బాప్ రే. చాలా తీవ్రంగా ఉంది నచ్చ చెప్పటం నాతరం కాదు అనిపించింది ఆ... ఊహలతో మూడు రోజులు గడిచాయి. అలా బల్లమీద పడేస్తే భోజనం చేయాలనిపించక ఆ రోజు వెళ్లి పోయాను తను బాధపడనట్టు ముఖం కనిపించినా, బెట్టుగానే ఉన్నది. బ్యాంకుకు వెళ్తే నాకసలు ఏమీ గుర్తుండదు, ఆకలి కూడా మరచిపోయాను పన్నెండు గంటలకు చలపతిగారు పిలిచారు

''ఓ హీరోగారూ, ఫోన్... మీకు ఫోనండి'' అన్నాడు

''హీరో పని జీరో అవుతుంది. నాకు ఫోన్ చేసేవారెవరుంటారు'' అంటూ ఫోన్ ఎత్తాను

ఇంటి ఓనరు చంద్రమన్నయ్య.

''హర్షా! కంగారేం లేదు... మరదలు చీర కాల్చుకుంది.. కంగారులేదు అంతే'' ఫోన్ పెట్టేసాను నాకు మతి పోయింది. విరక్తితో కాల్చుకోలేదు కదా ఈ పిల్ల! ఏమో, తెగింపుకు పెట్టింది పేరీ ఆడవారు.

''మా మిసెస్‌కు ఒంటో బాపుండలేదట సర్, వెళ్లిరానా?''

''ఒంట్లో బావుండలేదా, నిన్ను చూడా లనిపించిందా!'' ఆయన నవ్వారు.

''వెళ్ళు... వెళ్లిరా లక్కీ ఫెలోవి'' అన్నారు

''మళ్లీ రమ్మంటున్నారా?'' ప్రక్కనే ఉన్న సుధీర్ అడిగాడు.

''నువ్వు ఒకడివి ఉండవయ్యా!'' అని విసుక్కున్నారు. నేను కంగారుగా బయటికి వచ్చాను నన్ను ఇంటిదగ్గర దింపమంటే సుధీర్ దింపేవాడే కాని, ముఖం చెల్లలేదు నేను ఇంటికి వెళ్లేసరికి ఎలాంటి దృశ్యం ఎదురవుతుందో తెలియదు.

'నా భార్య ఆత్మహత్యకు ప్రయత్నించిం దంటే ఎంత అవమానం! చెప్పొద్దూ! నా కయితే విరక్తి లాంటిది కల్గింది. ఆటో చేసుకుని నేను వచ్చాను మంచం మీద కూర్చుని కల్పన కాఫీ తాగుతోంది.

''అమ్మయ్య'' అనుకున్నాను.

''వచ్చావా హర్షా! మీ ఆవిడ ఏడ్పు చూచి కంగారుపడి, కంగుతిని ఫోన్ చేసాను'' అన్నాడు చంద్రం.

''అసలేమయింది?'' కంగారును కప్పి పుచ్చుకుంటూ అడిగాను

''నేనే కాస్త టీ పెట్టమ్మా అన్నాను. తను బయటికి వెళ్లటానికి తయారయి నట్టుంది మీ వదిన ప్రొద్దుటే ఎక్కడో సత్యనారాయణ వ్రతం అని వెళ్లింది. పాపం నీళ్లు పడేసి వెనక్కు తిరిగింది. అంతే పమిట వెళ్ళి మంటలో పడింది'' అన్నాడు.

అమ్మయ్య ఆత్మహత్యా ప్రయత్నం కాదు. అదే పెద్ద రిలీఫ్!

''టీకి నీళ్ళు పెట్టగానే నామీద కోపం వచ్చి ఉంటుంది. అందుకే ఆ విసురు!''

''వాల్లేరా అబ్బాయ్! మీ ఆవిడ వస్త్రా పహరణం చేసాను చీర కాలిపోయిందనుకో. అయినా, అనుమానం తీరక, పరికిణా అంటు కుందేమోనని, ఎత్తుకు వచ్చి, మంచంలో అటు, యిటు దొర్లించాను. అమ్మో! ఈ నెరజాణ కాస్త ఏడ్పు లంకించుకుంది'' అన్నాడాయన నవ్వుతూ.

''పొండి! భయం వెయ్యదేమిటి?'' అన్నది కల్పన.

చంద్రంగారు మా ఊరతను. అందుకే చనువు, వరస.

''మీ ఆవిడకు కాఫీ కాచి ఇచ్చాన్రా అబ్బాయ్, నాకు భోజనం పెట్టాలి'' అన్నాడు

### కుటుంబ నియంత్రణ కొత్తపద్ధతి!

పశ్చిమ జర్మలోని కీల్ విశ్వ విద్యాలయంలోని డాక్టర్లు కుటుంబ నియంత్రణకు ఒక కొత్త పద్ధతిని రూపొందిస్తున్నారు. దీనిని 'ఇమ్యూన్ రెస్పాన్స్' అని అంటారు ఈపద్ధతిలో అండాలు, వీర్యకణాల మధ్య ప్రతిఘటన ఏర్పడుతుంది సంతానం లేని స్త్రీలలో అండాలు వీర్యకణాలను ప్రతిఘటిస్తున్నట్లు తేలింది ఇటువంటి ప్రతి ఘటనను ఎర్పరిచే యాంటిజెన్ను పశ్చిమ జర్మనీ డాక్టర్లు తెలియచేశారు. దీనిని ఎలుకలపై ప్రయోగించిచూడగా వాటిలో సంతానోత్పత్తి తగ్గింది ఈ ప్రయోగాలపట్ల డాక్టర్లు ఆశాభావాన్ని వ్యక్తంచేశారు.

''నా వంట తినే ధైర్యం ఉంటే, మడి కట్టుకుంటాను'' అన్నాను

''అదేమిట్రోయ్! మీ ఆవిడకు వంట రాదా!''

''వంట వచ్చు కాని ఆమె కోపగృహం ప్రవేశించింది'' అన్నాను.

''ఆయన మాటలు నమ్మొద్దు రండి వడ్డిస్తాను'' అన్నది

''అసలు చీరే కాలిందా...'' ఇంకెక్కడయినా కాలిందా అని అడగలేక పోయాను. ఇంకా మా మధ్య కోల్డ్‌వార్ జరుగుతున్నట్టే ఉంది ఆ వెక్కిళ్ళు, ఆ నిట్టూర్పులు, ఆ మూతి తిప్పడు, రుస, రుసలు ఇంకా నన్ను వెంటాడి, చిరాకును కలిగిస్తున్నాయి.

నాకే గనుక దేవుడు ప్రత్యక్షమయి ఏం కోరుకుంటావో కోరుకో అంటే, 'దేవుడూ! ప్రాణం పొయ్యేవరకు నవ్వుతూ ఉండాలని కోరుకుంటాను''

''కొంచెం పొట్ట దగ్గర సెగ తగిలిందండీ! సమయానికి బావగారు రాకపోతే...'' అన్నది

''థాంక్స్...'' అతనితో అన్నాను లేచి కల్పన పొట్ట దగ్గర చూచాను కాస్త ఎర్రబడింది దానిపై బర్నాల్ రాసింది.

కల్పన వడ్డించటానికి అవతలి గదిలోకి వెళ్ళింది.

''ఏమిట్రా అబ్బాయ్ ఏమిటి కథ! మీ వదిన ఓ మాటంది, 'ఈ సారి కల్పన పుట్టింటికి వెళ్తే ఇప్పుడప్పుడే రాదట...' అని...''ఆయన నా వంక చూచారు

''ఇదంతా మీ ఆవిడ నిర్వాహకం! నేను మొన్న నాటకంలో వేషం వేసి, ఎఫెక్ట్ కోసం సుమతితో చనువుగా, క్లోజ్ గా నటించాను...''

''ఓహో! అదా సంగతి...''

''రండి'' కల్పన వచ్చింది, ఇద్దరం వెళ్ళాం. మా బలవంతం మీద తనూవడ్డించు కున్నది. ముగ్గురం భోజనం చేసాము

''ఒరేయ్ అబ్బాయ్! మీ ప్రయివేటు అఫేర్స్‌లో ఎందుకురా నేను విశ్రాంతి తీసుకుంటాను'' చంద్రం వెళ్లిపోయాడు.

''చంద్రం బావగారు భోజనం చేస్తారని తెలియదండీ అన్నం సరిపోలేదు కదూ!'' అన్నది

''ఎంత తిన్నామన్నది కాదు ప్రశ్న...

## మధురం మధురం ...

ఏంత అభిమానంగా తిన్నాం అన్నది వస్తాను'' బయలుదేరాను.

''ఈ పూట పోకుంటేనేం ?'' అన్నది.

''పోకుండా ఇంట్లో కూర్చుని ఏం చేయాలి ? నీవు నవలా పఠనంలో లీనమవుతావు'' బయటికి వచ్చేసాను.

''ఏమ్మిటా ... ఏమయింది ?'' సుధీర్ ఎదురు వచ్చాడు.

''ఏంలేదు. చిన్న ప్రమాదం జరిగింది'' అని సుధీర్‌తో చెప్పాను

సాయంత్రం ఆఫీసు అయ్యాక, ప్రియదర్శిని అడిటోరియమ్‌లో బెంగాలి నాటకం ఉందంటే వెళ్ళి ఎనిమిదింటికి ఇల్లు చేరాను

అభిసారికలా గుమ్మంలో నిలబడింది కల్పన.

''ఏమిటింతాలస్యం చేసారు ?''

''అన్నం బల్ల మీద పడేసి పడుకోక పోయావా !'' అన్నాను.

అంతే లోపలి గుమ్మంలోకి రానివ్వి, నన్ను అల్లుకుపోయింది. వెక్కి, వెక్కి ఏడ్చింది.

''ఏమయింది ... అసలు ఏం జరిగింది.'' ఆమెను దూరం జరిపాను. కళ్ళు తుడుచుకుంది.

''ఏం లేదు...'' అన్నది. స్నానం చేసి, భోజనం చేసాను. సీన్‌ఫైర్‌కు చిహ్నంగా, మా ఆవిడ తలలో పూలు కనిపించాయి. ముఖంలో ఉత్సాహం కనిపించింది. పేపర్ తీసాను.

''ఏమండీ...''

''చెప్పండి...'' అన్నాను పేపరు పక్కన పడేసి.

''మధ్యాహ్నం నేను ఒంటరిగా ఉండగా చంద్రం బావ వచ్చారు. ప్రమాదం జరిగిందని చీరగట్టా...''

''ఆ సమయానికి సహాయపడ్డాడు. ఇప్పుడేమయింది!'' అన్నాను.

''అది కాదండీ. నువ్వు ఒంటరిగా ఉండగా వచ్చాను. నిన్ను ఎత్తుకు వెళ్తాను. వాడు అనుమానిస్తే అంటున్నాడు'' అన్నది దిగులుగా.

''నువేం ● ...కుంటున్నావు''

**చల్లార్చే శక్తి**

గుండె పగిలి
లావా—
చిమ్మినప్పుడు
చల్లార్చే శక్తి
నది—సాగర
జలాలకు లేదు
కళ్ళ వెనుక
కన్పించకుండా
ఉండే—కన్నీళ్ళకు తప్ప!

— అమ్జద్

''అవకాశం ఉంది కదా, నేను ఒంటరిగా ఉండగా వచ్చాడు...'' ఇంకా చెప్పబోయింది.

''చూడు కల్పనా ! మనిషికి మనసుకు మధ్య ఉండాల్సింది కాపలా కాదు విశ్వాసం. నాపై నీకు విశ్వాసం లేకపోయినా, నీపై నాకు విశ్వాసం ఉంది నే నుదయం వెళ్తే సాయంత్రం వస్తాను ఇంట్లోనే చెడిపోవాలని ఏముంది? నువ్వు చెడిపోవాలనుకుంటే ఎక్కడయినా చెడిపోవచ్చు కదా'' అన్నాను మెల్లగా.

''నిజమేనండీ...'' అన్నది ఇంకా అభిజాత్యం. నేనే దగ్గరకు తీసుకోవాలన్న తపనకు నవ్వు వచ్చింది.

''నిజంగా మీ పట్ల సంకుచితంగా ప్రవర్తించాను...'' అన్నది కన్నీటితో. మళ్ళీ ఇలాంటి అనుమానం రాదని బాసలు, ప్రమాణాలు చేసింది పాపం అనిపించింది. నా బింకం సడిలించాను. నా ఒడిలో ఒరిగి పోయిన కల్పన ముఖం చేతులతో ఎత్తి ఆమె అధరాలు చుంబించాను. సంసారం సాఫీగా సాగితే థ్రిల్ ఉండదేమో ! అప్పుడప్పుడు అలకలు, ప్రచ్ఛన్న యుద్ధాలు, కలయికలుండాలేమో ...

దూరాన ఒక గాయకుడిల్లుంది. ఆ ఇంటి నుండి 'అధరం మధురం...' అంటూ ఎమ్. ఎస్ కంఠం తేనెలూరిస్తోంది. ఆ నిశీధి నిశబ్ద సమయాన మరింత శ్రావ్యంగా వినిపించి,

''మధురం మధురం అధరం మధురం...'' అన్నాను.

''పోండి...'' దిండులో తల దూర్చుకుని సిగ్గుపడిపోయింది అర్ధాంగలక్ష్మి.

# పాకం కుదిరింది



హైమ బి హెచ్. ఎస్. సి. అందంగా ఉంటుంది కోపంవస్తే ఆమె ముఖం ఎర్రగా కంది పోతుంది ఆ రోజు ఆమె ముఖం అంతా కోపంతో బాగా కందిపోయింది సారీ! కుడి చెంపమీద రూపాయికాసంత మేర తప్పించి.

కోపం రావడానికి కారణం లేకపోలేదు హోం సైన్సులో డిగ్రీ పుచ్చుకున్న తమ అచ్చమ్మలా అంట్లు తోమవలసి వచ్చింది ఇంత చదువూ చదివింది వంటపని అంట్లపని చేయడానికా ? ఆడవాళ్ళు తమ ఇంటి పనులు చేసుకోరా ? ఇందులో నామర్దా ఏముంది అని సరిపుచ్చుకున్నా మసి గిన్నెలు తోముతూ ఉంటే బుగ్గమీద ఈగ వాలాలా? వాలింది పో, తను మసిచేయి అని మరచి తోలుకుంటే బుగ్గను మసి అంటుకోవాలా ? అంటుకున్న మాత్రాన మునుచుకుపోయేది ఏముంది ? ఆ పని కాగానే శుభ్రంగా ముఖం కడుక్కొని ముస్తాబు అయ్యేదే ! అలాంటిది సమయం కాని సమయంలో పొరుగింటి వనజాక్షి పిలవాలా ? పిలిచింది కదా అని తొందర తొందరగా కాళ్ళూ చేతులు కడుక్కొని వెళ్తే తన ముఖంమీద మసిని చూసి ఆమె కిసుక్కున నవ్వాలా ?

హైమ బి హెచ్ ఎస్ సి కి వనజాక్షిమీద కోపం వచ్చింది బుగ్గమీద వాలిన ఈగమీద కోపం వచ్చింది మసిబారిన గిన్నెలమీద కోపమొచ్చింది మసికి మూలమైన కర్రల పొయ్యిమీద కోపమొచ్చింది తనచేత అంట్లు తోమించే భర్తమీద కోపమొచ్చింది

ఆ కోపంతో కొత్త సబ్బుని పూర్తిగా అరగ దీసి ముఖం కడుక్కుంది అయినా కోపం చల్లారలేదు ఆ కోపం ఇంకా ఎంతసేపు ఉండేదో ? ఇంకా ఎవరి మీదకు మళ్ళేదో ?

వీధి తలుపు టకటక చప్పుడైంది

హైమ అద్దంలో ముఖం చూసుకుంది ఆ మచ్చ ఛాయలులేవు ఎందుకైనా మంచిదని మరింత పౌడర్ దట్టంగా అద్దుకుంది రోజ్ క్రీము రాసుకుంది ఆ తలుపు తడుతున్నది వనజాక్షి అయినాసరే తను సింగారించుకుంటేనేకాని తలుపు తీయదు అప్పుడు తన అందాన్నిచూసి వనజాక్షి ఓర్వలేక ఏడ్చుకోవాలి

'పోస్టు !' బయటునుంచి కేక

'వచ్చింది వనజాక్షి కాదు, పోస్టుమేను' అనుకుంది 'తన అందాన్ని చూసి వాడు మాత్రం కళ్ళింతచేసి చూడకుండా ఉంటాడా ? ఇలాంటి వేళ మగవాళ్ళుండరు — ఆడవాళ్ళను తనివితీరా చూడాలని తలంపు కాకపోతే, ఆ వచ్చిన ఉత్తరాన్ని తలుపు సందులోనుంచి పారేసి వెళ్ళిపోక — రాక కోసం ఆ ప్రతీక్ష ఎందుకు ? ఏమిటో ఈ మగవాళ్ళు ? పరాయి ఆడదంటే పడి చస్తారు వాళ్ళకు అక్కలూ చెళ్ళెళ్ళూ ఉండరా ? అందంగా ఉండడం ఆడదాని దోషమా ?'

ఆఖసారి అద్దంలో చూసుకొని బయటకొచ్చి తలుపు తీసింది ఇంతసేపు తలుపుతట్టిన పోస్టుమేను లేదు తను ఇంత అందంగా సింగారించుకొని వస్తే చూడడానికి కనీసం పోస్టుమేను అయినాలేడు! ఆమెకు కోపం వచ్చింది 'ఏమిటో వాడికంత రాచకార్యం ? రెండు నిమిషాలు నిల్చుంటే వాడి కాళ్ళు అరిగిపోతాయా ? పిలవగానే రావడానికి తనేం వాడి పెళ్ళాం అనుకొన్నాడా ? ఇంతకీ ఏమిటి తెచ్చాడు ? మనియార్డరా ? రిజిస్టరు లెటరా ? ఉత్తరమా ? ఎలా తెలుస్తుంది ? మళ్ళీ వస్తాడా ?' అని ఆలోచిస్తూ రోడ్డుమీద చూసింది పదిళ్ళు దాటి వెళ్ళిపోతున్నాడు

హైమ కోపంతో తలుపులు బడాలున మూసింది వెనక్కుతిరిగి లోనికి వెళ్తూవుంటే కాలుకేవో కాగితాలు తగిలేయి

'ఓహో ! ఈ పేకట్టు పడేసి వెళ్ళిపోయాడా ?' తీసింది

'ఏమిటి చెప్మా ?! పుస్తకంలాగుంది ఎక్కడ నుంచి ?'

రేపరు తీసింది ఆంధ్రసచిత్ర వార పత్రిక

'ఎవరింటిలోనో ఇవ్వవలసినది పొరపాటున ఇక్కడ పడేసాడు లేకపోతే చందా కట్టి తాము తెప్పించుకుంటున్నారా ? కాంప్లిమెంటరీ కాపీ రావడానికి తమ ఇంటిలో రచయితలు—రచయిత్రులూ లేరే ?' హైమ రేపరు తీసింది

హాశ్చర్యం !!! తన పేరు — తన హృదయ ఆశ్చర్యంతో పేజీలు తిరగేసింది ఒక పేజీమీద ఆమె కళ్ళు అయస్కాంతంలా అంటుకుపోయాయి

ప్రపంచంలో వున్నవి ఏడు వింతలే అయితే ఆ పేజీలో వున్నది ఎనిమిదవ వింత !

వంటా వార్పు శీర్షికలో ఆమె పేరు

గబగబా చదివింది

మైసూర్ హల్వా — తయారుచేసే విధానం

గతం గుర్తుకొచ్చింది

* * *

"హైమా ! ఈరోజు నా ఫ్రెండ్ మోహన్ వస్తున్నాడు మధ్యాహ్నం మంచి స్వీట్ చేయాలి" అన్నాడు గోపాలం

"బాగుందండీ ! వచ్చిపోయేవాళ్ళకు స్వీట్లు చేసిపెట్టడమే నా ఉద్యోగమా ?" అంది హైమ

"హైమా ! వాడు రాకరాక వస్తున్నాడు హోం సైన్సు చదివిన పిల్లలు మంచి వంట లొండుతారని, అలాంటి హోం సైన్సు పిల్లను నేను పెళ్ళాడినందుకు తెగ ఆనందం పడేవాడు "

"ఆనందం కాదండీ ! అది ఈర్ష్య !"

"ఏదో ఒకటి ! మీ హోం సైన్సు వాళ్ళంటే వాడికి అభిమానం — గౌరవం అన్నట్లు వాడికి మైసూర్‌పాక్ అంటే మహా ఇష్టం "

"మైసూర్‌పాకా ?!"

"పోని, అమ్మను చేయమంటాను వాడితో నీవే స్వయంగా చేసావని చెప్తాను ఏమంటావ్ ?"

"ఏమండోయ్ ! నాకు చేతకాదనుకుంటున్నారా? మా కాలేజీలో ఒక పర్యాయం చేసాను "

"కాలేజీలోనే చేసావా ? మీ ఇంటిలో ఎప్పుడూ చేయలేదు ?" అన్నాడు గోపాలం అనుమానంగా

"నేనెప్పుడు వంటింటి ముఖమైనా చూడలేదు మావాళ్ళు నన్ను అపురూపంగా చూసారు ఈ గొడ్డుచాకిరి మీ ఇంటికి వచ్చిన తరువాతే మొదలైంది" అంది హైమ

* * *

"తల్లీ ! నీకెందుకు శ్రమ ఆ టిఫిన్లేవో నేను చూసుకుంటాను నువ్వు ముస్తాబై వాళ్ళతో కబుర్లు చెప్తూ కూర్చో" అని అత్తగారు వారిస్తున్నా హైమ వినకుండా రాక్షసులమీదకు దండెత్తి వెళ్ళిన సత్యభామలా ఫలహారం చేయడానికి వంటింటిలోనికి దండెత్తింది భార్యకు పైపనులు చేయడానికి గోపాలం ఆమె వెనుకనే ఉన్నాడు పానకంలో పుడకలా తనెందుకని అత్తగారు చల్లగా పురాణానికి జారుకున్నారు

"ఏమండి ! మైసూర్‌పాక్ గట్టి పడడం లేదు ఇది పాకం చలిమిడిలా పరుగెడుతున్నాది" అంది దిగులుగా హైమ

గోపాలం చూసాడు తల్లి చేస్తే మైసూర్ పాక్ చక్కీలా వచ్చేది గుల్ల గుల్లగా కరకరలాడేది ఇది మాత్రం పలచగా జావలాగ ఉంది

"అత్తగార్ని ఒకమారు పిలుస్తారా ?" అంది హైమ

"అమ్మనా ?! ఆవిడ నేను చేస్తానని అంటున్నా నీవు చేతనైనదానిలా తయారయ్యావు ఆవిడ పురాణానికి వెళ్ళిపోయింది లేకపోయినా ఈ ముద్దను చక్కీలా తయారుచేయడానికి ఆమె వద్ద ఏమైనా మంత్రశక్తులున్నాయా ?" పాకం కుదరక పాకిపోతున్న వంటకాన్ని చూసి కోపంగా అన్నాడు గోపాలం

హైమకు తల కొట్టేసినట్లైంది

"అమ్మ అంటూనే ఉండేది చాకలి పద్దులు రాయగలిగే చదువుంటే చాలు శుభ్రంగా వంటలు, వార్పులు వచ్చిన పిల్లను చేసుకో సుఖపడతావు అని ఆమె మాటను లెఖ్ఖపెట్టక డిగ్రీ వున్నది కదా అని నిన్ను చేసుకున్నాను "

హైమకు ఏడుపొచ్చింది

'ఇప్పుడేం చెయ్యడం ? ఆ వచ్చే స్నేహితుడికి ఈ ముద్దనెలా పెట్టడం ? హోం సైన్సులో బి ఎస్ సి పాసైన పిల్లకు మైసూర్‌పాక్ కూడా చేయడం రాదని అతను అనుకుంటే ఎంత పరువు నష్టం !' హైమకు చివరకొక ఆలోచన వచ్చింది

"ఏమండి ! త్వరగా బజారుకెళ్ళి ఒక అరకిలో మైసూర్‌పాక్ తీసుకురండి" అంది

"ఇప్పుడా ? వాడే నిముషంలోనైనా రావచ్చును "

"మరి ఇప్పుడెలాగండి ?"

"హైమా ! నన్ను చూడనీయ్" అని గోపాలం ముందుకు వచ్చి మూకుడులోని పదార్థం వ్రేలితో ముట్టుకున్నాడు చెయ్యి చురుక్కున కాలింది "అమ్మా!" అంటూ ఆ వేలు నోట్లో పెట్టుకున్నాడు

అంత బాధలోనూ అతని కళ్ళలో ఒక వింత కాంతి !

"హైమా ! ఒక మంచి అయిడియా !"
అన్నాడు గోపాలం

ఏమిటి అన్నట్లు చూసిందామె

"ఒక ప్లేటూ చెంచా తీసుకురా !"

ఆమె తీసుకువచ్చి భర్తకిచ్చింది కొంత ముద్ద తీసి "తినిచూడు" అన్నాడు భార్యకిస్తూ

ఎందుకన్నట్లు భార్య చూసింది

"నా వేలు చురుకుతే నోట్లో పెట్టుకున్నానా! దీని రుచి బ్రహ్మాండంగా ఉంది నువ్వూ ఒకమారు రుచి చూడు "

"నిజమేనండి ! మీరు చెప్పినట్లు చాలా రుచిగా

ఉంది. అయినా ఇది మైసూర్‌పాక్ ఎలా గవుతుంది ?''

''ఏం మైసూర్‌పాకే పెట్టాలన్న రూలే మైనా ఉందా ? వాడికిదే పెడదాం'' అన్నాడు ఒక నిర్ణయానికి వచ్చి

గోపాలం స్నేహితుడి మోహన్ ఆ టిఫిన్ తిని హైమను చాలా మెచ్చుకున్నాడు ''ఏమైనా మీ హోంసైన్సువాళ్ళు బాగా వండుతారు'' అన్నాడు

''మైసూర్‌హల్వా చేయడంలో మా ఆవిడ సిద్ధహస్తురాలు'' అని స్నేహితుడితో అంటూ భార్య వంక చూసాడు గోపాలం

ఆ మైసూర్‌హల్వా గురించి ఇప్పుడు పత్రికలో వచ్చింది

* * *

హైమ ఆశ్చర్యానికి అవధుల్లేవు ఇది భర్త చేసిన పనే అయివుంటుంది లేకుంటే పత్రికకు వేరెవరు పంపిస్తారు ?

ఏడాది క్రితం జరిగిన సంగతి జ్ఞాపకం రాగానే హైమ కోపం చల్లారిపోయింది

* * *

''ఏమండీ ! వారపత్రిక వారం వారం ఎన్ని కాపీలు అమ్ముడుపోతుందంటారు ?'' అంది భర్తతో హైమ ''ఏభైవేలు వరకు అమ్ముడుపోతాయను కుంటాను'' అంది ఆమే సమాధానం ఇస్తూ

ఆ ప్రశ్న – జవాబు విని గోపాలం ఆశ్చర్య పోయాడు ''నాకేం తెలుసు ? అయినా ఆ వివరాలెందుకు ?'' అన్నాడు ఆశ్చర్యంగా

''ఊరికినే అడిగాను ఏభైవేలు కాపీలు అమ్ముడుపోతాయనుకోండి ఏభైవేల కుటుంబాలలో సగం కుటుంబాలైనా మైసూర్‌హల్వా చేసి వుంటారుగా ! అంటే పాతికవేలమంది మైసూర్ హల్వా చేసినట్లేగా ?!'' అంది

''ఏమిటి ? నీ మైసూర్‌హల్వా పత్రికలో పడ్డాదా ?'' ఆశ్చర్యంగా గోపాలం ప్రశ్నించాడు

''నంగనాచిలా అడుగుతున్నారు పంపినవారు మీరు'' అంటూ పుస్తకం భర్త చేతికిచ్చింది

''ఎప్పటి మాట ! సంవత్సరం క్రితం నువ్వు మైసూర్‌పాక్ చెయ్యబోయి ఇది తయారు చేసేవే అప్పుడు'' అన్నాడు ''నువ్వు చేసిన ఆ ముద్ద తిని మా వాడు తెగమెచ్చుకుంటే '' అంటూ భార్య పేరు అచ్చులో చూసి మురిసిపోయాడు

## పాకం కుదిరింది

''హైమా ! నువ్వు చేసిన హేమాగుల్లాం గురించి పత్రికకు పంపాను ''

''హేమాగుల్లాలేమిటండీ !?''

''అదేనోయ్ ! మీ బావగారొచ్చినప్పుడు రస గుల్లాలు చేయబోయి ఆదేదో చేస్తే అప్పుడు మా అమ్మ వాటికో రూపు ఇచ్చిందే ఆ రసగుల్లాల గురించి ''

''పొరపాటున మైదాపిండి కలపడం మరిచి పోయాను లేకపోతే నాకు రసగుల్లాలు చేయడం రాదనుకున్నారా ?''

''మరి పాకం ?''

''లేతపాకం రావాలని నాకు తెలుసు కుంపటి మీద పడేసి కలుపుతూనే వున్నాను ఇంతలో స్టీలు గిన్నెలవాడు వస్తే వాడితో బేరం ఆడుతూ ఆ మాట మరచిపోయాను పాకం చిక్కబడింది ''

''ఏమైతేనేం అమ్మ ఆ ముద్దను మైదా తోపులో వేయించి నీ పరువు నిలబెట్టింది ''

''మీరుమాత్రం తినలేదా ? రుచికి బాగాలేవా?''

''అందుకనే పంపించాను ''

''మరి హేమాగుల్లాలేమిటండీ ?''

''పత్రికలో రెండు రకాల వంటకాలు ప్రచురిత మౌతాయి పరాయి రాష్ట్రాలలో వాడుకలో ఉండి తెలుగువారికి తెలియనివి లేదా నీలాగ ఒకటి చేయబోయి మరొకటి తయారయ్యేవి కోవా, నెయ్యి, పంచదార, ఏలకులు, కిస్మిస్‌లు పడితే ఏ వంట మాత్రం రుచిగా ఉండదు ''

* * *

హైమ భర్త పంపిన హేమగుల్లాలు కూడా పత్రికలో చోటు చేసుకున్నాయి కాంప్లిమెంటరీ కాపీలే కాకుండా, కొంత కాలవ్యవధిలో చెరో పదిహేనేసి రూపాయల పారితోషికాన్ని కూడా హైమ అందుకుంది

''బాగుందండి ! పాకం కుదరక వంట పాడైనా మొత్తానికి ముప్పై రూపాయలు సంపాదించాను'' అంది ఆనందంతో ఒక రోజు హైమ ఆ ముందు రాత్రే అత్తగారు మరికొందరితో కలిసి కనకదుర్గ దర్శనానికి విజయవాడ వెళ్ళారు, వంటింటిని కొడుకును కోడలికి అప్పగించి

హైమ ఈమధ్య వంట బాగానే చేయడం అత్తగారి దగ్గర నేర్చుకుంది

''ఇవాళ ఏమిటి చేస్తున్నావ్ ?'' అన్నాడు గోపాలం

''నేనే ప్రయోగం చేయడంలేదు సింపుల్‌గా పప్పు, చారు, అన్నం, వంకాయకూరా వండుతాను'' అంది హైమ

భార్య అలాగన్నా గోపాలానికి నమ్మకం లేకపోయింది తల్లి కూడా సమయానికి లేదు ఈ సింపుల్ వంటైనా ఆఫీసు టైముకి అవుతుం దన్న గ్యారంటీ లేదు ఎందుకైనా మంచిదని ఆఫీసుకి సెలవు చీటి పంపించాడు

''హైమా ! ఏదైనా క్రొత్త పదార్థం సృష్టించబడితే నన్ను పిలువు సెలవు తీసు కున్నానులే'' అన్నాడు నవ్వుతు

''నేనేం కొత్తవి చేయడంలేదని చెప్పానుగా !'' అంది

హైమ వంటింటిలోనికి వెళ్ళింది గోపాలం వార్తాపత్రిక తిరగేస్తున్నాడు

వంటింటిలో గిన్నెల చప్పుళ్ళు, కళ్ళు మండే పొగ తప్పించి వాతావరణం బాగానే వుంది

''ఏమండోయ్ ! ఒకమారు ఇలా వస్తారా ?'' అంది హైమ వంటింటిలోనుంచి

గోపాలం అలాంటి పిలుపు కోసమే ఎదురు చూస్తున్నాడు వెంటనే కాగితం కలం పట్టుకొని వంటింటిలోనికి పరుగెత్తాడు

''బాగుందండి ! మీకు వేళాకోళంగా ఉంది ఇప్పుడు నేనేం చేయడంలేదన్నా ఆ కాగితాలూ కలం ఎందుకు ?'' అంది కోపంగా

''మరి పిలిచావుగా !''

''చారు పెడదామని ఈ సత్తుగిన్నె పొయ్యిమీద వుంచి నీళ్ళకోసం వెళ్ళాను తిరిగొచ్చేసరికి చూడండి'' అంటూ ఆమె చేతిగాజు సైజులో కన్నం పడిన సత్తుగిన్నె భర్త చేతికిచ్చింది హైమ

''నీళ్ళు పొయ్యకుండా సత్తుగిన్నె పొయ్యిమీద పెడితే కరిగిపోదా ?'' అన్నాడు

స్టీలు గిన్నెలు, ఇత్తడి గిన్నెలు, సిల్వరు గిన్నెలు కరగనివి ఈ సత్తువి ఎందుకు కరుగుతాయో అర్థంకాక హైమ బి హెచ్ ఎస్ సి విస్తు పోయింది



అప్పుడేమో వర్షం పడుతుంది! అమ్మాయి అబ్బాయి వర్షంలో తడుస్తూ పాటమొదలెడతారు! తర్వాత ఏమయిందో తెలీదురా!.



మా నాన్న నా కళ్ళు, మా అమ్మ నా చెవులు మూసారు అప్పుడు! తర్వాత సినిమాలో అమ్మాయి....






# ఆరోగ్యం, మజా; జోరూ తోడు జోడుగా!
# తాగండిక బోర్న్‌విటా.

మీ కుటుంబంలోని వారికి క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా యివ్వండి. దానిలోని రుచి అంటే వాళ్ళందరికీ మహాయిష్టం. బోర్న్‌విటాలో ప్రకృతిలోని మంచి లక్షణాలు గల కోకో, మాల్ట్, పాలు, పంచదార సమృద్ధిగా ఉన్నాయి. బోర్న్‌విటా మీ కుటుంబంలోని వారందరికీ ప్రతిరోజూ యివ్వండి-రోజుకు రెండుసార్లు.




OBM/8845 TEL

**క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా** దీన్లోని మంచిదనం పెరుగుతుంది మీపైనిక.

# దాంపత్యసంగీతం

సీరియల్

## శ్రీమతి కళ్యాణీ సోమరాజ్

(గత సంచిక తరువాయి)

లేడీ డాక్టర్ ఇచ్చిన డ్యూ డేట్‌కి వారం రోజులు ముందరగానే నన్ను కుమార్ ఫ్రెండ్స్ వచ్చి వాళ్ల కారులో తీసుకెళ్ళిపోయారు కుమార్ డిస్పెన్సరీ వుండటం మూలంగా అక్కడే వుండిపోయాడు

శ్యామల, సరోజ, రాధ నన్ను సొంతవాళ్ళకంటే ఎక్కువగా ఆదరంగా చూసుకొనేవారు వారి ఆదరణతో, వారి భర్తల ఆపేక్షా పూర్వకమైన కబుర్లతో, వాళ్ల పిల్లల సందడితో కాలం ఎటు పోతోందో తెలియనంత ముందుకు పోయేది రోజుకొకసారి కుమార్ వచ్చి నాతో కబుర్లు చెప్పి వెళ్ళిపోతున్నాడు లేడీ డాక్టర్ ఇచ్చిన గడువు పూర్తి అయి వారం దాటినా, నాకు పెయిన్స్ స్టార్టవక పోవటం నాకు ఆశ్చర్యపరచింది కాని శ్యామల 'మరేం ఫరవాలేదు, ఒక్కొక్కసారి లేట్ కావచ్చు' అంటూ ధైర్యం చెప్పేది

ఆ రోజు సాయంకాలం కుమార్‌తో కబుర్లు చెబుతూ యాపిల్ కోస్తున్నాను ఇంతలో వెన్నెముక ఒక్కసారి జల్లుమంది సరిగ్గా కూర్చున్నా మెల్లగా ఆ పెయిన్ ఎక్కువైంది కుమార్‌తో బాధతో చెప్పాను

నిముషాల్లో నన్ను స్ట్రెచర్‌మీద నర్సింగ్ హోమ్‌కి తీసుకెళ్ళారు శ్యామల, సరోజ, కుమార్ నా చుట్టూ నుంచుని ఏవో కబుర్లు చెబుతున్నారు. కాని ఆ బాధ అనంతం అయింది అది ఎవ్వరూ తీసివేయలేనిది

''నాకు సిజేరియన్ చేసేయి శ్యామలా!'' అన్నాను ఆ బాధ భరించలేక

''నీ కెంత ఆపరేషనంటే సరదావున్నా, నార్మల్ కేస్‌ని సిజేరియన్ వరకు తీసుకెళ్ళటం అనవసరం ఎన్నో డెలివరీలు చేసున్న దానిని నీకు నేను చెప్పాలా!'' అంటూ శ్యామల కబుర్లతో కాలం వెళ్ళబుచ్చాలని చూసేది

''స్వాతీ! నీకేం ఫరవాలేదు మరీ నువ్వు బాధ తట్టుకోలేకపోతే అప్పుడు చూద్దాం మేమంతా వున్నాంగా'' అంటూ కుమార్ ధైర్యం చెప్పినా నా మనసు వూరట చెందలేదు

అయితే వాళ్ళమాటే నెగ్గింది రాత్రి పది గంటలకు ఆడపిల్ల పుట్టింది

''మీ పాప చాలా హెల్దీగా వుంది అందుకే నిన్ను అంత బాధించింది'' అంటూ తెల్లని గుడ్డల్లో చుట్టిన పాపను నాకు చూపించింది శ్యామల శ్యామల చెప్పినట్లు పాప గులాబి రంగుతో చాలా బొద్దుగా కన్పించింది ఆ నీరసంలో ఒక్కసారి ఓపిక లేక కళ్ళు మూసుకున్నాను

మళ్ళీ కళ్ళు తెరిచేసరికి కుమార్ నా మంచం దగ్గర కూర్చుని వున్నాడు

''ఎలావుంది ?''

''ఏమిటి పాపా ?''

''కాదు నీ ఒంట్లో ?''

''ఫరవాలేదు ఇంతకీ పాపని చూసుకున్నారా!''

''ఆఁ చాలా థాంక్స్ స్వాతీ ఎంతో కష్టపడి నాకో అమూల్య రత్నాన్ని అందించావ్''

''థాంక్స్ చెబితే చాలా!''

''గట్టిగా బహుమతి ఇవ్వాలనే వుంది మన చుట్టు చాలా మంది వున్నారే!''

''ఛ నేను అలా అనలేదు''

''బాగా రెస్ట్ తీసుకో'' నా తలమీద చెయ్యి వేసి నిమురుతూ అన్నాడు

* * *

పాపకి 'దివ్య' అనిపేరు పెట్టుకున్నాడు కుమార్! దివ్యకి నెలనిండుతుందనగానే, వాళ్ళనంతా ఒప్పించి, మా ఇంటికొచ్చేసాం దివ్యని చూడటానికి 'ఆయ' దొరకగానే నేనువెళ్ళి జాబ్‌లో చేరాలని నిశ్చయించుకున్నాను దివ్యను చూడటానికి మామి వచ్చినప్పుడు శారద విషయం అడిగాను శారద పేరు వింటూనే మామి మొహం అసహ్యంగా పెట్టుకుంది ''ఛ శారద నిండా మోసం ఏంఁ చేసిందో తెలుసా భర్తకు చెప్పకుండా లేచిపోయింది'' అంటూ మామి చెపుతుంటే విని నేను నమ్మలేకపోయాను బహుశ నేను ఇచ్చిన ఉత్తరం తీసుకొని హైదరాబాద్ వెళ్ళిపోయిందేమో! అని వూహించుకున్నాను ఆ తరువాత వారంరోజులకే, శారదభర్త ఆ బంధువుల అమ్మాయిని పెళ్ళి చేసికున్నట్లు మామి చెప్పినప్పుడు నా అనుమానం నిజం అనిపించింది ఏది ఏమైనా శారద బ్రతుకు ఇకనైనా వెలుగు చూస్తే చాలనిపించింది

అనుకున్నంత త్వరగా ఆయా ఎవరు దొరకక పోవటం వలన నేను ఉద్యోగంలో చేరే సమయం రావటంలేదు నా కోసం ఇంకా ఆ పోస్ట్ ఖాళీగా వుందో లేదో అన్న బెంగ చివరకు కుమార్—

''పాపని నేను చూసుకుంటాను ఒకవేళ నర్సింగ్‌హోమ్‌కి వెళ్ళాల్సినప్పుడు మాత్రం మామి దగ్గర వదిలేసి పోదాం'' అని చెప్పాక కొంత మనసు స్థిమిత పడింది

మామి కూడా ఈ విషయంవిని చాలా ఆనంద పడింది ''ఎప్పుడో పసిపాపల్ని పెంచాను మళ్ళీ నాకా ముచ్చట రాలేదు'' అంటూ ఆమె ఉత్సాహం చూసాక, ఈ సమస్య అంతటితో తీరినందుకు నేను నా ఉద్యోగంలో చేరిపోయాను

* * *

పొద్దున వంటచేసి, దివ్యకి నీళ్ళుపోసి పాలు పట్టి వెళ్ళిపోతే మళ్ళీ నేను వచ్చేది సాయంకాలమే! పేరుకి తల్లినైనా కుమార్ నా కంటే అహర్నిశలు దివ్యని పెంచడంతో దివ్య నాకంటే కుమార్‌కే చేరిక అయింది

దివ్యంటే కుమార్‌కి పంచప్రాణాలు నేను హాస్పిటల్‌నుండి ఇంటికి రాగానే, దివ్య ముద్దు చేష్టలు, అల్లరి వర్ణించి చెబుతుంటే నేను మైమరచి వినేదాన్ని దివ్య పొరపాటున కింద పడినా ఎదైనా మీద వేసుకున్న, నా అలక్ష్యాన్ని అతను భరించలేక విసుక్కునేవాడు మనసు ఒక్క క్షణం చివుక్కుమన్నా దివ్య క్షేమం కోసమే కదా అతను అలా అంది! అనుకొని అన్నీ భరించేదాన్ని ఒక్కొక్కసారి కుమార్ హృదయాన్ని అంతగా ఆక్రమించుకున్న దివ్యను చూస్తే ఈర్ష్యలాంటిది కలిగేది మరో క్షణంలో నాలో నేనే నవ్వుకునేదాన్ని, అలా ఆలోచించినందుకు దివ్య నా కూతురు ఆ విషయం నేను మరిచిపోకూడదు

శారద, సురేంద్రతో స్టేట్స్‌కి వెళుతున్నట్లు ఉత్తరం వ్రాసింది దాన్ని వెళ్ళేలోగా కలుసుకోవాలనుకున్నాను ఆ వంకతో అయినా నాన్నగారిని ఒకసారి చూసినట్లౌతుందని కాని ప్రయాణం ఇంకా రెండు రోజులుందనగా, దివ్యకి వున్నట్లుండి జలుబు, జ్వరం ఆరంభించాయి నాలుగు రోజులైనా తగ్గలేదు ఆ విధంగా నావాళ్ళను చూడాలనుకున్న కోరిక తీరనేలేదు నాన్నగారిని తలుచుకున్నప్పుడల్లా బెంగతో నా మనసు మూలిగేది అంత పెద్దఇంట్లో ఒంటరిగా ఎలా వుంటున్నారో!

**జరిగిన కథ — 6 :** స్వాతి, కుమార్ వివాహం చేసుకొని విశాఖపట్నంలో కాపురం పెడ్తారు స్వాతి ఎం బి బి యస్ ఫస్ట్‌క్లాసులో పాసవుతుంది అక్కడే హౌస్ సర్జన్ చేస్తుంటుంది కుమార్ ఇంటి ఓ భాగంలో ప్రాక్టీస్ ప్రారంభిస్తాడు స్వాతికి మామితో పరిచయం కల్గుతుంది ఆ బిల్డింగ్‌లోనే అద్దెకుంటున్న శారదకి పెళ్లయి ఇంత కాలమయినా ఇంకా పుట్టింటనుంచి ఏవో తేలేదని ఆమెను పుట్టింటికి వెళ్లనీయకుండా ఎప్పుడూ దేనికో ఓదానికి హింసిస్తున్న భర్తనుండి రక్షించి ఆమెకు జీవనాధారం చూపించాలని ప్రయత్నిస్తుంటుంది స్వాతి భర్తతో తెగతెంపులు చేసుకొని స్వాతి సహకారంతో హైదరాబాద్ వెళ్లటానికే నిశ్చయించుకొంటుంది శారద

## 12

కళ్ళాలులేని కాల చక్రం జోరుగా పరుగెడుతోంది దివ్య మొదటి పుట్టినరోజు వున్నంతలో ఘనంగానే చేసాము ఒక రోజు హఠాత్తుగా శారద దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది ఆ ఉత్తరం చదివాక, శారద అజ్ఞాతవాసానికి అర్థం తెలిసింది రామ్మూర్తి నుండి విడిపోయాక ఆమె జీవితం ఒక సవ్యమైన మార్గంలో నడుస్తున్నందుకు మనసుకు తృప్తి కలిగింది

ఆమె వ్రాసిన ఉత్తరంలో వాక్యాలు ఆరోజు అంతా గుర్తు వస్తూనే వున్నాయి "అక్కా! నీ చేయూత లేకపోతే నేనింకా ఆ అంధకారంలో వుండి పోయేదాన్నో! లేక నా భర్త కర్కశత్వానికి బలైపోయేదాన్నో! నీవిచ్చిన ఉత్తరం తీసుకొని దిక్కుతోచక ఈ ఆశ్రమం చేరాను ఈమె చాలా దయామూర్తి మేమంతా 'అమ్మా' అని పిలుస్తాం ఔనుమరి అనాథలైన మా కందరికీ వెలుగు చూపించే ఆమె మరి తల్లికాక ఏమౌతుంది? ఇక్కడకొచ్చాక గాని తెలియలేదు, నాకంటే దురదృష్టవంతులు, పద విహీనులు చాలామంది వున్నారని, వారందరికంటే నా బ్రతుకు కొంత నయం అని

అప్పుడే ఆ వూరుని, మిమ్మల్ని వదిలి వచ్చేసి ఏడాది కావస్తోంది నన్ను అంతా లేచిపోయిందను కుంటున్నారేమో అనుకోని అక్కా! లోకం కోసం, సంఘం కోసం నేనా నరకాన్ని భరించినంత కాలం భరించాను ఇక భరించే శక్తి నాకు లేదు నా జీవితం ఈ మాత్రం సుఖ సంతోషానికి నోచుకుందంటే నీ మూలంగానే!

ఇక్కడ కొచ్చిన కొత్తల్లో ఈ వాతావరణాన్ని నా తోటి స్త్రీలతో అలవాటు పడటానికి చాలా అవస్థపడ్డాను ఏవో భేషజాలు మొదట నాలో అడ్డు నిలిచేవి! క్రమంగా వాటిని దూరం చేసుకున్నాను ఇప్పుడు నా కందరిలో నిర్మలత, స్వచ్ఛత గోచరిస్తోంది ప్రస్తుతం నన్ను నర్స్ ట్రైనింగ్‌కి పంపారు నువ్వు ఎప్పుడైనా ఈ వూరు వస్తే నీ కోసం ఆశగా ఎదురుచూసే ఒక చెల్లి వుందని మరిచిపోకుండా చూడటానికి వస్తావు కదూ!"

శారద అభ్యర్థన నన్ను కదిలించింది 'అక్కా' అని పిలిచే ఇద్దరు శారదలు నాకున్నారు అయితే వాళ్ళ జీవితాల్లో ఎంత వ్యత్యాసం? ఒక శారద కోరుకున్నవన్నీ అనుభవించగల అదృష్టవంతురాలు, మరొక శారద సంఘానికి దూరంగా, అనాథగా వెలుగుకోసం ఆరాటపడుతోంది

శారద వుత్తరంలో రామ్మూర్తిని తిడుతూకాని, దూషిస్తూకాని ఏమి వ్రాయలేదు అందుకామె సంస్కారానికి ముగ్ధురాలినయ్యాను నిజానికి రామ్మూర్తి కొత్తగా పెళ్ళి చేసుకున్నాక ఈ ఇల్లు ఖాళీచేసి వెళ్ళిపోయాడు ఆ తరువాత ఇంచుమించు అంతా వాళ్ళను గురించి మర్చిపోయారనే చెప్పచ్చు

* * *

ఎమ్ ఎస్ చేద్దామన్న ఆలోచన క్రియా రూపం పొందకుండానే వుండిపోయింది ఎలాగైనా ఎంట్రెన్స్ ఎగ్జామ్ వ్రాయాలని పుస్తకాలు సేకరించి చదవటం ఆరంభించాను పుస్తకాలు నా పాత నెచ్చెలులు వాటిని చూడగానే నాలో పాత రోజులు ఒక్కసారి గుర్తుకొచ్చేవి ఇప్పటిలా అప్పుడు బాధ్యతలనే సంకెళ్ళు లేవు కాబట్టి నా కాలాన్ని నా ఇష్టమొచ్చినంతసేపు చదువుకోసం ఉపయోగించుకొనేదాన్ని ఇప్పుడు పనంతా పూర్తి అయ్యాక ఏ పదిగంటల తరువాతో పుస్తకం ముందుంచుకునే సరికి ఎక్కడలేని నిద్ర ముంచుకొచ్చేది

ఆ రోజు దివ్య ఆడుకుంటుంటే చూస్తూ, చదువుకుంటున్నాను కుమార్ ఏదో సర్జికల్ కేసుందని సాయంకాలమే బయటకెళ్ళిపోయాడు

అలా ఎంతసేపు గడిచిందో కాలం నాకు తెలియలేదు కుమార్ వచ్చి చెప్పులు విడుస్తుంటే, వులిక్కిపడి చూసాను

"దివ్యఏది?" అంటూ అడిగాడు అప్పుడు గాని దానిగురించి గుర్తురాలేదు

"ఇంతకు ముందు ఇక్కడే ఆడుకుంటూ వుండాలే!" అన్నాను అతనుఖంగారుగా "దివ్యా!" అంటూ పిలిచాడు సమాధానం రాలేదు ఇద్దరం గబగబ బయటకు వచ్చి చూసాం

వరండాలో పేషెంట్స్ కూర్చునే బల్లమీద కాళ్ళు ముడుచుకొని నిద్రపోతోంది

"దివ్య ఇక్కడున్నట్లే నీకు తెలియదా?" అన్నాడు కుమార్ అతని గొంతులో అస్పష్టంగా వ్యక్తమౌతోంది చికాకు

"లేదు నేను చదువుకుంటున్నాను, గమనించ లేదు" అన్నాను ముభావంగా

"భోంచేసిందా?"

"లేదు నన్ను అడగలేదు"

"అడగందే పెట్టకూడదా! దానికా వయసు రాలేదు స్వాతి అన్నీ మనమే కనుక్కొని చూడాలి

అయినా నీకంత నిర్లక్ష్యం ఏమిటి ?" అంటూ అతను దివ్యను ఎత్తుకుని లోపలకు తీసుకెళ్ళాడు

కుమార్ దివ్యను లేపి, బుజ్జగించి పాలు పట్టడం అంతా చూస్తూ కూడ ఏమి కల్పించుకోలేదు నా మనసు అశాంతిగా తయారైంది

ఆ రోజు ఇద్దరం అన్యమనస్కంగా భోంచేసి లేచాము అతను ఏమి మాట్లాడలేదు బహుశ మనసులో నా మీద చాలా కోపంగా వుందనుకుంటాను

* * *

దివ్యను కూర్చోపెట్టి 'బాయిల్డ్ఎగ్' పెడుతున్నాను ఇంతలో ఇంటిముందు రిక్షా ఆగిన శబ్దం విన్పించి చూశాను కుమార్ వదిన సూట్‌కేస్ పుచ్చుకొని వస్తున్నారు

అంతకుముందే, ఆరునెలల క్రితం కుమార్ అన్నయ్యకి విజయనగరం ట్రాన్స్‌ఫర్ అయింది ఈ ఐదారునెలలో నాలుగైదు సార్లు కుమార్ వదిన రావటం సంభవించింది ఆమె దగ్గర దివ్యకు బాగా చనువేర్పడింది ఆమె వస్తే ఇల్లంతా సందడి, ఒక్క నిముషం కూర్చోకుండా గిలకలా తిరుగుతూ, దివ్య పనులు, ఇంటి పనులు చురుగ్గా చేసేస్తూ వుంటారు నేనెంత వారించినా వినకుండా !

"ఏమ్మా ! స్వాతీ అలా చిక్కిపోయావేం పని ఎక్కువైందా ?" అన్నారు ఆమె చేతిలో సూట్‌కేస్ అందుకుంటున్న నన్ను పరిశీలనగా చూస్తూ ! నేనేం జవాబివ్వకుండా నవ్వి వూరుకున్నాను ఈమధ్య ఇద్దరు ముగ్గురు అదే మాట అనటం గుర్తొచ్చింది

ఇంతలో కుమార్ అక్కడకి రావటం గమనించి, "ఏం కుమార్ ! స్వాతీ, ముందటిసారికంటే ఈసారి చాలా చిక్కిపోయింది నువ్వు గమనించలేదా !" అన్నారామె

"తనీ మధ్య ఎమ్ ఎస్ కోసం కష్టపడి చదువుతోంది చదువులో పడిందంటే తన ఆకలి దప్పులు తెలియవు అవతలవాళ్ళ ఆకలి దప్పులు తెలియవు" రాత్రి సంఘటన గుర్తుపెట్టుకొని అతనంటున్నాడని తెలిసింది నాకు ఒక్కసారి అతని వంక చికాగ్గా చూసాను కుమార్ అదేం పట్టించుకోకుండా –

"ఏం వదినా ! అన్నయ్య ఈసారికూడ రాలేదు శెలవ దొరకలేదా ?"

"లేదు కుమార్! మీ అన్నయ్య టూర్‌కెళ్ళారు అక్కడ ఒక్కతిని ఏం వుండనని వచ్చేసాను బహుశ ఆయన వస్తూ వస్తూ ఇక్కడ దిగుతారనుకుంటా!"

"మంచిపని చేసావ్ "

ఇద్దరూ ఏవో కబుర్లల్లో పడ్డారు నా చేతిలో నుంచి దివ్యను ఆమె తీసుకోవటంతో, నేను కాఫీ కలపటానికి వంటింట్లోకి వెళ్ళాను

"ఈ మర్యాదలన్నీ నాకు నువ్వేం చేయక్కర్లేదమ్మాయ్ నీ పని నువ్వు చూసుకొని నువ్వు రెడీ అవు వంట సంగతి నేను చూసుకుంటాను" అంటూ నా చేతిలో కాఫీ అందుకున్నారు

నేను అన్యమనస్కంగానే హాస్పటల్‌కి చేరాను. కుమార్ ప్రవర్తన నా మనసును నొప్పిస్తోంది ఎంత కాదనుకున్న అతనిలో వ్యక్తమయ్యే మార్పు, నన్ను వేదనకు గురిచేస్తోంది అంతకు ముందు అతను కనబరిచిన ప్రేమ, తీయని ఓదార్పు ఇప్పుడు మచ్చుకైనా కన్పించటంలేదు "ఇదివరకు అరగంట ఆలస్యంగా ఇంటికొస్తే కంగారుపడిపోయే తనకోసం హాస్పటల్ గేటు ముందు పడిగాపులు కాసే ఆ కుమారేనా, నేడు సీరియస్ కేసులేమైనా వుండి వూరి చివరనుంచి తను పొద్దుపోయి వచ్చినా "అయ్యో !" అని మాట మాత్రానికైన అనటం లేదు" అనుకొని చాలాసార్లు దిగులు పడేదాన్ని

అతనికి ఎప్పుడు దివ్యధ్యాసే !

తప్పితే హాస్పెటల్ పేషెంట్స్, ఆపరేషన్స్ !

ఇవన్నీ కలిసి అతన్ని కట్టేసి నా నుండి దూరంగా తీసుకెళుతున్నాయేమో! అనిపిస్తోంది అయితే అతను అది గ్రహించినట్లులేదు మా ఇద్దరి మధ్య ఏదో అడ్డుగోడకు పునాది వేసుకుంటున్నట్లుంది దీన్ని ఛేదించగలిగితే !

"ఏమిటి చాలా డల్‌గా వున్నారు" అంటూ తోటి లేడీ డాక్టరు పలకరించేసరికి వులిక్కిపడ్డాను

"ఏం లేదు ఏదో గుర్తు వచ్చింది అంతే !"

"సాయంకాలం మీకు మరేం ప్రోగ్రామ్ లేకపోతే మా ఇంటికి రాకూడదూ ఇలా మళ్ళీ మళ్ళీ మీ వెంట పడుతున్నానని నన్ను సిగ్గులేనిదాన్ని అనుకోకండి" నిజానికి శశికళ చాలా రోజులనుంచే, వాళ్ళింటికి రమ్మంటోంది ఆమె, భర్తతో సహా ఒకటి రెండుసార్లు మా ఇంటికి వచ్చి పోయినా, నేనింకా వాళ్ళింటికి వెళ్ళకపోవటం ఒక విధంగా సిగ్గుగానే వుంది కాని కుమార్ నాతో రావటానికి, అతనికి అనేకమైన పనులు ఒక్కదాన్నే వెళ్ళటానికి మొహమాటం ఆ విధంగా ఆమె కోర్కె నేను తీర్చలేకపోతున్నాను

"ఏమిటి ఆలోచిస్తున్నారు ఇబ్బంది అయితే వద్దులెండి"

"ఛ ఇబ్బందా ! మా వారికి ఈవినింగ్ రావటం వీలుపడదు ఎప్పుడు అయితే బాగుంటుందా అని ఆలోచిస్తున్నాను"

"ఆదివారం క్లినిక్ ఉండకపోతే ఆ రోజు రాకూడదు"

"సరే తప్పకుండాను" అంటూ ప్రామిస్ చేసాను

* * *

ఇంటికి వస్తుండగానే దివ్య నన్నుచూసి చేతులు ఊపుకుంటూ పరిగెత్తుకొచ్చింది ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నాను ఏదేదో వచ్చిరాని భాషలో తెగ మాట్లాడేస్తోంది

"దివ్య ఇక్కడుందా !" అంటూ దివ్యకోసం వెతుక్కుంటూ వచ్చింది కుమార్ వదిన

"చూసావా నిన్ను చూడగానే డ్రస్ చేయించుకునేదికూడా ఎలా పరిగెత్తుకొచ్చిందో ఎంతైనా తల్లి తల్లే !"

నా మనసు పులకరించింది దివ్యని గమనించలేదు నిజమే అది డ్రాయర్‌తో వుంది ఆమె చేతిలో ఫ్రాక్ తీసుకొని నేను వేసాను అయినా అది నా మెడ రెండు చేతులతో చుట్టి వదలలేదు

"పొద్దున్నుంచి నిన్ను చూడలేదు కదూ, అందుకని నిన్నెలా పట్టేసుకుందో దాన్ని నా కిచ్చి నువ్వెళ్ళి కాఫీ ఫ్లాస్క్‌లో వుంది తాగేసిరా !"

"ఫరవాలేదు లెండి కొంచెంసేపు వున్నాకే వెళతాను"

దివ్యతో చాలాసేపు ఆడుకొని మెల్లగా దాన్ని ఆమెకు అప్పగించి టవల్ తీసుకుని స్నానానికి వెళ్ళాను దివ్య పలకరింపుతో సేద తీరిన నా మనసు, చన్నీళ్ళ స్నానంతో పొద్దున్నుంచి నేను పడ్డ బాధ కడుక్కున్నట్లనిపించింది

ఇదివరకులా కుమార్ ఇప్పుడు నాకు చీర

సెలెక్ట్‌చేసి చేతి కందివ్వటంలేదు ఒకసారి నోరు తెరిచి అడిగితే –

''ఏదో కట్టేసుకుందూ నువ్వేది కట్టుకున్నా అందంగానే వుంటావ్ !'' అన్నాడు

ఆ విషయం మనసులో మెదిలి దిగులుపడ్డా ''ఛ! ప్రతిది నేను భూతద్దం నుండి చూస్తున్నానేమో !'' అనుకుంటూ నాకు నచ్చిన టమోటో రంగు వెంకటగిరి జరీచీర దానికి మాచ్ బ్లౌజ్ తీసుకొని కట్టుకున్నాను

''ఇదిగో స్వాతి! వాకిట్లోకి పూలొస్తే తీసుకున్నాను'' అంటూ తెల్లని మల్లెపూలు నాకు అందించింది కుమార్ వదిన

దివ్య ఆ రోజు ఆమెతో ముందు గదిలో పడుకొంది

''దివ్య వదిన దగ్గర పడుకుంటుందా ! పక్కన అది లేకపోతే ఎలాగో వుంది కదూ ?'' అన్నాడు ఆ రాత్రి కుమార్

''ఔను బాగా తడిసిన పక్కలమీద పడుకోవటం అలవాటైంది కదూ!'' అన్నాను పక్కమీద రబ్బర్‌షీట్ తీసివేస్తూ

''ఊ అది తడపకపోతే నువ్వు తడుపుతావా!'' కుమార్ నా నడుం చుట్టూ చేతులు వేస్తూ అన్నాడు

''ఛ పో!''

''ఈ రోజు పాత స్వాతిలా వున్నావ్ !''

''నేనెప్పుడు పాత స్వాతినే నువ్వే మారావ్!'' అన్నాను అతన్నుండి విడిపించుకొని బెడ్‌షీట్ వేస్తూ

''తండ్రి నయ్యాను అంతేగా !'' అన్నాడు తేలిగ్గా

''నేను తల్లినయ్యాను అయితే ఈ తండ్రినేం మరిచిపోలేదు నువ్వే దివ్య పుట్టాక నన్ను పూర్తిగా విస్మరిస్తున్నావు నీకెంత సేపు దాని ధ్యాసే '' నా మాట పూర్తి కాకుండానే ఫక్కున నవ్వాడు కుమార్

''ఏమిటి, నీకు దివ్యమీద జలసీయా అంటూ నవ్వుతూ అబ్బ ఈ జోక్ వదినకి చెప్పాలి'' అంటూ కదలబోయాడు అతని చేయి గట్టిగా పట్టుకొని గిల్లాను

''మనిద్దరి విషయాలు అందరికీ చెబుతావా'' అంటూ విసుక్కున్నాను

కుమార్ అలాగే చాలాసేపు వరకు తలుచుకొని తలుచుకొని నవ్వుతూనే వున్నాడు ''స్వాతి ! నిజంగానే అన్నావా ఆ మాట'' అన్నాడు

''ఛ నీతో మాట్లాడను'' అన్నాను మరో వైపుకి తిరుగుతూ

''నీ కోపం ఎలా పోగొట్టాలో నాకు తెలుసు లేవోయ్ !'' అంటూ బలవంతాన తనవైపు తిప్పుకున్నాడు

నిద్రపోయేముందు శశికళ వాళ్లింటికి ఆహ్వానించిన విషయం చెప్పాను

''ఓ యస్ అలాగే ఆదివారం అన్నావుగా తప్పకుండా వెళదాం'' అంటూ చెప్పి నిద్రలోకి జారిపోయాడు కుమార్ !

* * *





కుమార్ అన్నయ్యవచ్చి రెండు రోజులుండి భార్యని తీసుకొని వెళ్ళిపోయారు ఇల్లు మళ్ళీ బోసి పోయింది కుమార్, నేను ఇద్దరం ఎవరి డ్యూటీలో వాళ్ళు మునిగిపోయాం

ఆ రోజే శశికళ వాళ్ళింటికి వెళదామనుకున్న రోజు కుమార్ ''చిన్న ఆపరేషన్ వుంది, ఇప్పుడే వచ్చేస్తాను'' అంటూ నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళాడు దివ్యని రెడీచేసి, నేను రెడీఅయి అతనికోసం చూస్తూ కూర్చున్నాము అతను వస్తానన్న టైమ్‌దాటి గంట గడిచినా అతను రాలేదు చేసేదిలేక దివ్యను తీసికొని ఒక్కదాన్నే వాళ్ళింటికి వెళ్ళాను

ఆలశ్యంగా వచ్చినందుకు, కుమార్‌ని కూడా తీసుకురానందునూ చనువుగా కోప్పడింది నిజానికి అతను లేకుండ ఒక్కదాన్నే వెళ్ళటం నాకు వెలితిగానే వుంది

అయినా ఏ మూలో అతను ఇక్కడకు వస్తాడేమో అని ఆశగా వుంది ఆ ఆశతోనే ఇంటి దగ్గర అతన్ని వచ్చి రాగానే, ఇక్కడకు రమ్మని చీటి వ్రాసి మరీ వచ్చాను ఆ విషయం శశికళతో చెప్పాను అంతా అతని కోసం చాలాసేపు నిరీక్షిస్తూ కూర్చున్నాం శశికళ దివ్యని, వాళ్ళ బాబుని కూర్చోపెట్టి అన్నం తినిపించింది

శశికళ వాళ్ళిల్లు చిన్నదైన చూడ ముచ్చటగా వుంది భర్త లాయర్ ఇద్దరి సంపాదన వెనకవేసి కట్టుకున్నామని మాటల మధ్యలో చెప్పింది ఇంట్లో అన్ని పనులకి ఒక పనిమనిషిని పెట్టుకుంది డ్రాయింగ్ రూమ్, ఖరీదైన స్టీరియోలతో, టేప్ రికార్డర్, సోఫా సెట్లతో ఆడంబరంగా వుంది ఒక ప్రక్కగా శశికళ భర్త ఆఫీసు రూమ్, మరోవైపు వాళ్ళ బెడ్‌రూమ్! పదిమందికైనా నిండుగా భోజనం పెట్టగల పెద్ద డైనింగ్ హాల్ దానిలో రోజ్‌వుడ్ డైనింగ్ టేబుల్ సెట్ ఓ పక్కన కెల్వినేటర్

''ఇక మీవారు రారేమో మనం కూడ భోజనం చేద్దామా!'' అని శశికళ అడగటంతో, నేను వాళ్ళింటిని పరిశీలించటం ఆపి ''అలాగే'' అన్నాను, మనసులో కుమార్‌మీద కుతకుతలాడుతూ

భోజనాలు అయ్యాక వాళ్ళ కారులో నన్ను ఇంటి దగ్గర డ్రాప్ చేసారు ఆ దంపతులు

కుమార్ నేను వచ్చేసరికి ఏదో వ్రాసుకుంటు న్నాడు

''సారీ, స్వాతీ అనుకోకుండా ఆ పేషెంట్‌కి కాంప్లికేషన్స్ రావటంతో నేను రాలేకపోయాను'' అంటూ నా వెనక వచ్చి అతను సంజాయిషీ చెబుతుంటే నేనేం మాట్లాడలేదు దివ్యను బెడ్ మీద పడుకోబెట్టి బెడ్‌షీట్ కప్పాను

''రాలేదని నీకు కోపం వచ్చిందనుకుంటాను వృత్తిధర్మం నన్ను కదల్నివ్వలేదు''

చివ్వున వెనక్కు తిరిగాను ''వృత్తిధర్మంతో పాటు మీకు ఇంకా కొన్ని ధర్మాలున్నాయి వాటిని విస్మరించకండి ఏనాడు నన్ను బయటకు తిరుగుదాం రండి అంటూ బలవంతపెట్టలేదు ఒక్కరోజు ఇలా నోరు తెరిచి అడిగినందుకు, బాగానే బుద్ధి చెప్పావు'' అన్నాను విసురుగా

## దాంపత్య సంగీతం

''స్వాతి వైడోంట్‌యు అండర్‌స్టాండ్ మి నువ్వు ఒక డాక్టర్‌వే! చావుబతుకుల్లో పేషెంట్ వుంటే నాకేం అని పట్టనట్లు వచ్చేస్తావా?''

''నేనలా రమ్మనటంలేదు ఏ వృత్తి అయినా బ్రతుకుతెరువు కోసమే కాని బ్రతుకును నాశనం చేసేందుకు కాదు అయినా చాలారోజులనుంచి చూస్తున్నాను మీకు బాగా ధనకాంక్ష పెరుగు తోంది ఇల్లు, వాకిలి, భార్య వీటన్నిటి కంటే ఆ వృత్తే ముఖ్య మనిపించింది''

''సారీ స్వాతీ! నువ్వేం చెప్పినా విన్పించుకునే స్థితిలో లేవు ఆ విషయం అంతటితో వదిలేద్దాం'' అంటూ మరోమాట విన్పించుకోకుండా అతను ముందు గదిలోకి వెళ్ళిపోయాడు

నేను అలాగే కూర్చున్నాను, ముందు ముందు మా మధ్య రాబోయే చికాకుల గురించి ఆలోచిస్తూ

* * *

కుమార్ ఆ మర్నాడు ఏమి జరగనట్లు మామూలుగా మాట్లాడినా, నేను నా ముభావాన్ని వదల్లేదు ఏదో అశాంతి, అసంతృప్తి నాలో క్రమేణ

### ముందు చూపు

ఆకలిమంట లార్పుకోవటానికి
బొటనవేలు నోట్లో పెట్టుకుని
గుటకలు మ్రింగుతున్నాడు పిల్లవాడు
ఎటూ పెద్దయ్యాక
ఐదు వేళ్ళు నోట్లోకి వెళ్ళవని
ముందే తెలిసిపోయినట్లు

—"ప్రభాతం"

చోటుచేసుకున్నాయి హాస్పిటల్ వున్నంతసేపు రోగులతో, ఫ్రెండ్స్‌తో కాలం తెలియకుండా గడిచి పోయేది ఇంటికి రాగానే తెలియని ఒంటరితనం

''స్వాతీ! ఎందుకలా వున్నావని'' ఆపేక్షగా ప్రేమగా కుమార్ అడుగుతాడేమో నా బాధనంతా కడిగేసుకుందా మనుకునేదాన్ని కాని అతనెప్పుడు అంత ఆపేక్షను నా కోసం వృధా చేసుకొనేవాడుకాదు మా ఇద్దరి మధ్య దూరం రానురాను పెరిగి పోతున్నట్లు నా కనిపించేది నేను ఛేదించాలనుకున్న అడ్డుగోడ, పటిష్టంగా రోజు రోజు వృద్ధి చెందు తున్నట్లనిపించేది

ఆ రోజు శశికళ దగ్గరనుంచి నేను తెచ్చుకున్న మెడికల్ బుక్ తిరగేస్తున్నాను చదువుతున్న కొద్దీ ఎన్నో తెలియని విషయాలు తెలుస్తున్నట్లుంది మధ్యలో దివ్యకి అన్నం పెట్టలేదన్న విషయం గుర్తువచ్చి, ఒకసారి మా ఇద్దరి మధ్య జరిగిన రభస జ్ఞాపకం చేసుకుంటూ లేచి అన్నం కలిపి తీసుకొచ్చాను కాని దివ్య ఎక్కడా కన్పించలేదు బొమ్మలు చెల్లాచెదురుగా పడివున్నాయి ముందు కుమార్ పేషెంట్స్‌ని చూస్తున్నాడు అతను సహజంగా పేషెంట్స్ దగ్గరున్నప్పుడు దివ్యని రానివ్వడు అక్కడ కొచ్చేవాళ్ళంతా రకరకాల జబ్బులతో వస్తారని, చిన్న పిల్లలు ఈజీగా కాచ్ చేస్తారని అతని భయం ఆ విషయం నేను కాదనను కాని దివ్యకి కుమార్ దగ్గరున్న చనువువల్ల బొమ్మల కంటే, అతని దగ్గరకు వెళ్ళటానికే ఎక్కువ ఇష్ట పడుతుంది

దివ్యకోసం ముందు గదిలోకి తొంగిచూసిన నాకు కుమార్ దగ్గర దివ్య కనిపించలేదు బహుశ మామి ఇంటికి వెళ్ళిందేమో అనుకుంటూ వాళ్ళింటికి వెళ్ళాను

మామి అప్పుడే భోంచేసి, ఇల్లు కడుక్కుంటు న్నది దివ్య గురించి అడగగానే ''లేదే ఇక్కడకు రాలేదు'' అంది మామి

ఆ తరువాత మామి ఏదో అడుగుతున్నా విన్పించు కోకుండా పరిగెత్తుకుంటూ వచ్చాను మిగిలిన ఇళ్ళకు దివ్యకు వెళ్ళే అలవాటు అంతగాలేదు నేను కంగారుగా కుమార్‌కి విషయం చెప్పాను

పది నిముషాల్లో ఇల్లుహడావిడిగా తయారైంది మామి కృష్ణని పంపింది, దివ్య సంగతి కనుక్కు రమ్మని పేషెంట్స్ కొందరు మెల్లగా జారు కున్నారు మరి కొందరు వేడుక చూస్తూ అలాగే నిలబడిపోయారు అక్కడ చేరినప్రతివాళ్ళు తమకు తెలిసిన ఏవో సంఘటనలు చెబుతూ భయపడుతున్న నన్ను మరీ భయపెట్టసాగారు కుమార్ ఒకవైపు, కృష్ణ మరోవైపు, అయ్యంగారు పోలీస్‌స్టేషన్‌కి, ఇలా అందరూ తలోదిక్కు దిక్కు తోచక పరిగెత్తారు మామి ఈ విషయం తెలిసి పరిగెత్తు కుంటూ వచ్చింది

దివ్యని మళ్ళీ నేను చూడగలనా! అన్నభయం గుండె పిడచకట్టింది మామి ఎన్ని ధైర్యవచనాలు చెప్పినా మనసు నెమ్మదించటం లేదు

గంటసేపటికి కృష్ణ, అయ్యంగారు తిరిగి వచ్చారు కృష్ణని కొంచెంసేపు కూడ కూర్చోనివ్వ లేదు నేను కుమార్ ఏమైయ్యాడో, ఎక్కడ కెళ్ళాడో వెతకమని పంపాను అయ్యంగారిని అతని స్నేహితులకు ఫోన్ చేయమని టెలిఫోన్ నెంబరిచ్చాను

నిముషం, నిముషం కూడబెట్టుకున్నట్లు గంటలు లెక్కబెట్టుకుంటూ తెల్లవార్లు గడిపాము అందరం నాకు తోడు మామి ఈ విషయం తెలుసుకొని వెంటనే వచ్చిన రాధ, శ్యామల, సరోజ అంతా మేల్కొనేవున్నారు అతని స్నేహితులు తలో చోటు గాలించటానికి వెళ్ళారు కుమార్ వాళ్ళతో పాటే తిరుగుతున్నాడు ఆ రాత్రి ఎలా తెల్లవారిందో గమనించలేదు

రెండురోజులు రెండు యుగాల్లా గడిచాయి స్నేహితుల ఓదార్పులుగాని, పోలీసు వాళ్ళు చూపిస్తున్న ఆశలుగాని మమ్మల్ని మనుషుల్ని చేయలేకపోయాయి కుమార్ సంగతి చెప్పక్కర్లేదు ఇంచుమించు పిచ్చివాడైయ్యాడు ఎప్పుడూ దివ్య ఫోటో వంక చూస్తు కాలం గడుపుతున్నాడు

ఆ రోజు మధ్యాహ్నం కుమార్ కోసం కాఫీ కలుపుతున్నాను ఈ రెండు రోజుల్లో అందరి బలవంతంమీద ఒకసారో, రెండుసార్లో భోజనం చేసాడు

**(ఇంకా వుంది)**




## జి. ఎస్. కె. — విశాఖపట్నం

నా వయస్సు 24 సంవత్సరములు నేను పుష్పవతి అయినప్పటినుండీ ఇప్పటివరకూ మెన్సెస్ సమయంలో కడుపునెప్పి, కాళ్ళనెప్పి, నడుమునెప్పితో బాధపడుతున్నాను నెల వస్తుందంటేనే భయముగా వుంటోంది ఆ నెప్పి ఎలా వుంటుందంటే మొదటి రోజంతా ఏ పనీ చేయలేను గిలగిలా తన్నుకోవలసి వస్తుంది నాలుగోరోజు కాళ్ళునెప్పి విపరీతంగా వుంటుంది ?

★ ఇలా రావటాన్ని స్పాస్‌మోడిక్ డిస్మెనోరియా అని అంటారు పిల్లలు కలుగనివారి గర్భసంచీలోని ముఖద్వారం అయిన సెర్వైకల్ కెనాల్ చాలా చిన్నదిగా ఉండటం సహజం అందువల్ల మెన్సెస్ అయినప్పుడు జరిగే రక్తస్రావం బహిర్గతం అవటంలో అవరోధం ఏర్పడి గర్భసంచీ ఈ రక్తాన్ని బహిర్గతం చేయటానికి ముకిళించుకోవటంవల్ల నెప్పి ఏర్పడుతుంది గర్భసంచీలో నెత్తురు చేరి వ్యాకోచించి కాళ్ళకి వెళ్ళే నరాలకి వత్తిడి కలిగించటం వల్ల కాళ్ళనెప్పి ఏర్పడుతుంది ఇటువంటి సందర్భాలలో ఆస్పిరిన్, బెరాల్గాన్ వంటి మాత్రలు తాత్కాలిక ఉపశమనాన్ని కలిగిస్తాయి ఈ లక్షణం మొదటికాన్పు తర్వాత పూర్తిగాపోయే అవకాశంఉంది

## డి. ఆర్. — శ్రీరంగపురం

నాకు విరోచనంలో నులిపురుగులు పడుచున్నవి కొన్ని బిళ్ళలు డాక్టరు సలహాపై వాడినా మరల నెలకు పురుగులు కన్పించుచున్నవి

★ పైపరజీన్ సిట్రేట్ లేక అడిపేట్ వంటి మందులను ఒక వారంపాటు క్రమబద్ధంగా వాడవలసి ఉంటుంది వీటిని ద్రవరూపంలో వాడటం మంచిదని కొందరి అభిప్రాయం ద్రవరూపంలో వాడినప్పుడు రోజుకి రెండు టీ స్పూనుల వంతున వారం రోజులపాటు తీసుకోవటం మంచిది ఒక నెల తర్వాత మరలా మల పరీక్ష చేయించుకొని పురుగుల గ్రుడ్లు కనబడితే మళ్ళీ ఈ మందు వాడాలి కుటుంబంలోని వారందరూ ఒకేసారి మందు వాడటం, మల విసర్జన సమయంలో పాదరక్షలు ధరించటం, కూరగాయలను బాగా కడిగి వాడటం చాలా అవసరం ఇలా చేయుటంవల్ల మళ్ళీ వచ్చే అవకాశం ఉండదు

## కె. ఆర్. కె. — ఏలూరు

'ఎపెండిసైటిస్' ఎందువలన వస్తుంది ? 'ఎపెండిసైటిస్' ఆపరేషన్ చేసిన తర్వాత గూడా మరలా కడుపునెప్పి వస్తుందా ?

★ పెద్దప్రేవు ప్రారంభం అయ్యేచోట చిటికెన వ్రేలుకన్నా సన్నగా ఉండే ఈ అపెండిక్స్‌లో చిన్న చిన్న "రాళ్ళ" వల్ల అవరోధం ఏర్పడి, సూక్ష్మక్రిముల ప్రాబల్యం వల్ల వాయటం జరిగినప్పుడు ఆ రోగాన్ని అపెండిసైటిస్ అంటారు అపెండిసైటిస్ వచ్చిన తర్వాత ఆపరేషన్‌చేసి అపెండిక్స్ తీసివేయటం జరిగితే మ్మరలా అపెండిసైటిస్ రాదు—అందువల్ల వచ్చే కడుపునెప్పి రాదు ఇతర కారణాల వల్ల వచ్చే కడుపునెప్పికీ అపెండిసైటిస్ ఆపరేషన్‌కి సంబంధంలేదు

## సీరియల్

# కాలంకరిగాక

## వలివేటి నాగచంద్రావతి

**జరిగిన కథ—17 :** వయసు తాకిడికి తట్టుకోలేక నర్స్‌గా పనిచేస్తున్న సోఫియాతో కోర్కెలు తీర్చుకుందామనే దురుద్దేశంతో పొత్తు పెట్టుకొంటాడు డా మురళి సోఫియా మరో ఉద్దేశ్యంతో అతనికి తన సర్వస్వాన్ని అర్పించడమే కాకుండా ప్రచారం కూడా చేస్తుంది సోఫియాని వదిలించుకొనే వీలులేక అమ్మ దగ్గరకు పారిపోతున్న మురళిని అడ్డుకొని జరుగవలసిన తతంగమంతా జరిపిస్తాడు థామస్ ఇక చేసేదిలేక ఓ మారుమూల ప్రాంతానికి బదిలీ చేయించు కొంటాడు మురళి విషయాలన్నీ కేశవరావ్‌గారి ద్వారా విన్న కామేశ్వరమ్మ లోలోపలే మధన పడుతుంది మురళి చెల్లెలు వసంతలక్ష్మి పెళ్లి ఏర్పాట్లు జరుగుతుంటాయి సుబ్బాయమ్మ మురళి వ్యవహారాన్ని కూపీ లాగటానికి ప్రయత్నిస్తుంటుంది మామూలుగా జరిగినదానికి కొంత కల్పితం చేసి చెప్పి ఆమెను తాత్కాలికంగా శాంతపరుస్తుంది కామేశ్వరమ్మ మురళిపై వున్న కేసును పోగొట్టుకోవడాన్కి కొంత డబ్బు ఇచ్చి, మిగతాది యం ఓ చేస్తానని చెప్పివస్తాడు కేశవరావ్ ఎంత డబ్బు ఖర్చుపెట్టినా మురళి ఉద్యోగం పోతుంది ఆ తరువాత అతను మరో గ్రామంలో స్వతంగా ప్రాక్టీసు పెడతాడు కేశవరావ్, చిదంబరం ఇద్దరూ కలిసి 'ప్లాస్టిక్ అండ్ కేన్' ఫ్యాక్టరీ పెట్టి బాగా అభివృద్ధి చేస్తారు చిదంబరంగారి అబ్బాయి గోపీకృష్ణకి తమ అమ్మాయి వసంతని ఇచ్చి పెళ్లి చేయాలన్న ఆశ కామేశ్వరమ్మ పడగా కేశవరావ్ తమలో వున్న మచ్చను గుర్తుచేస్తాడు అదీగాక చిదంబరం తండ్రి పరమ చాదస్తుడు కానీ చిదంబరం గారింట్లోని వాళ్లే వసంతని కోడలిని చేసుకోవటానికి సుముఖత చూపటంతో పెళ్లి ఖాయమవుతుంది అసలే తమ గుట్టు ఎక్కడ రట్టు అవుతుందోనని లోలోపల మధనపడుతున్న కామేశ్వరమ్మ మురళి భార్యాపిల్లలతో రావడంతో షాక్ తింటుంది

(గత సంచిక తరువాయి)

పెనుగాలిలా వెళ్లిన కామేశ్వరమ్మకి కొడుకుని చూస్తే ఎప్పటిమోస్తరు ఎన్నాళ్లయిందో బిడ్డని చూసి అనే మమత పొంగలేదు

కుమార్తె జీవితం ధ్వంసం అయిపోతుందేమో అన్న తీవ్ర వ్యాకులంతో, అందుకు కారణభూతు డవుతున్న మురళి అసలు కొడుకనే అనిపించలేదా సమయంలో

"సర్వనాశనం తలపెట్టావా మురళీ ? నీకిది న్యాయమేనా—ధర్మమేనా?" అంటో పొడుస్తున్నట్టు చేతులు బారలు చాస్తూ తిన్నగా కొడుకు ముందుకు వచ్చేసింది "ఆ అమాయకురాలు నీకేమపకారం చేసిందనిరా — తోడబుట్టిందన్న కనికరమన్నాలేకుండా కక్ష సాధించినట్టు చేశేవ్" అన్నది రెచ్చిన ఆవేశం వూపేస్తుండగా

పాలిపోతున్న కొడుకు వదనం చూస్తే జాలేసింది కేశవరావుగారికి భార్యని వారించబోయేరు కానీ ఆమె వినుపించుకోలేదు

"కుక్క ముట్టిన కుండని చేసేవ్ వంశాన్ని ఆ పాపాన్ని మూసిపెట్టే దానికి పెళ్లి కుదర్చటమే బ్రహ్మప్రళయమయిపోయింది ఇప్పుడా కళంకాన్ని వూరేగింపుగా ఎదర బెట్టుకుని మరీ వచ్చేవే — చేతులారా చెల్లెలి జీవితాన్ని కూల్చడానికి నీకెలా మనసొప్పిందిరా ?" అన్నది మండిపడే కళ్లతో కాల్చేలా చూస్తూ

మురళి నోరు మెదపలేదు కళ్లు దించుకున్నాడు

"తీసుకురావద్దూ అని స్పష్టంగా రాయించేక గూడా ఇలా చేయడంలో నీ ఉద్దేశమేమిటసలు ? చెప్పు — చెప్పవేం ?" అంటూ గద్దించింది దోషిలా తల వంచుకుంటున్న మురళిని

ఆమె మనసు మరుగుతున్న నీళ్లలా కుతకుతలాడతోంది మరి

ఆమెకు సమాధానం వచ్చింది అడిగిన దగ్గర్నించికాదు

అత్త వెనకాలే పిల్లిలా మేడెక్కి మెట్ల గది గుమ్మంలోనే నుంచుని వింటున్న సోఫియానించి

ఒక చెయ్యి గుమ్మాని కానించి, ఒక చెయ్యి నడ్డికి చేర్చి, వాక్ పోరాటానికి సన్నద్ధురాలయింది

"అసలు అలా నిలేయటంలో మీ ఉద్దేశ్యమేమిటో ముందు చెప్పండి" అన్నది పొగరుగా

కేశవరావుగారూ, మురళీ టక్కున తలెత్తి చూశారు

గిరుక్కున వెనక్కితిరిగిన కామేశ్వరమ్మ సోఫియాని చూసి నివ్వెరపోయింది

అంతలోనే తోకతొక్కిన తాచయి, "నువ్వెవరవే నన్ను ఎదురడగడానికి ? ఈ గడప తొక్కే హక్కూ నా ఎదురుగా నిలిచే అర్హతా నీకు లేవు అదే నా ఉద్దేశ్యం వెంటనే వొచ్చిం త్రోవంటే వెళ్లు" అన్నది వెర్రికోపంతో ఉరిమిచూస్తూ

పిడుగు పడినా చలించనిదానిలా నిబ్బరంగా నుంచుంది సోఫియా

"ఎందుకు లేవో తేల్చుకుందామనే వచ్చేను మీరు గొంతు పెంచితే పారిపోతాననుకుంటున్నారేమో — అంత పిరికిదాన్నని మీ రపోహ పడుతూంటే మాత్రం ఆ తర్వాత నాలుక్కరుచుకోవాల్సొస్తుంది' అన్నది తొణక్కుండా

ఈ మాట ఉడుకుబోతుని వెక్కిరించినట్టుగా అయింది

కాళికావతార మెత్తబోతున్న భార్య వాలకాన్ని చూసి వ్యవహారం శృతిమించుతోందని తోచి గాభరాగా లేచేరు కేశవరావుగారు

తన ఉనికినీ, పరిసరాలనీ, యుక్తాయుక్తాలనీ మరిచిపోయి, "ఏమిటే నువ్వు తేల్చేదీ" అని అరుస్తూ ముందుకు అడుగేయబోతున్న కామేశ్వరమ్మ భుజం పట్టి ఆపి నోటికి చెయ్యి అడ్డం పెట్టేరు

స్తబ్దుడై చూస్తున్న మురళిని, "ఆ అమ్మాయిని క్రిందికి తీసుకువెళ్లు" అని హెచ్చరించారు

తట్టి లేపినట్టు చరాలున లేచేడు మురళి

అతనితో చెప్పించుకోకుండానే అందరికేసీ ఒక చూపు తృణీకారంగా చూసి, 'హు'మ్మని హుంకరించి క్రిందికి దిగిపోయింది సోఫియా

మురళి కూడా సోఫియా వెనకాతలే వెళ్లాక భార్యని వదిలి కేశవరావుగారు తిరిగి కుర్చీలో కూర్చున్నారు

"వాడిని ఊరేగింపుగా తీసుకొచ్చేడన్నావ్‌గానీ నువ్విప్పుడు చేస్తోందేవిటో తెలుసునా ? ఆ ఊరేగింపుకి బాజా భజంత్రీలు లేని కొరత తీరుస్తున్నావ్" అన్నారు మందలింపుగా

అప్పటికి ఒంటిమీద స్పృహ తెలిసింది కామేశ్వరమ్మకి

భర్త ఎదురుగా కూలబడి రెండు చేతులు మధ్యనా తల ఇరికించుకున్నది దుఃఖంతో ఆమె డొక్కలు ఎగిసి ఎగిసి పడ్డాయి

తన సంతానాన్ని అందలాలెక్కించాలనే తపనలో కుతంత్రానికైనా, మర్మ గోపనానికైనా వెనుదీయని ఆ తల్లి విధి ఎదురు తిరిగి వేసిన ఎత్తులన్నీ తిప్పికొట్టి చిత్తుచేస్తే నిస్సహాయంగా ఒరిగిపోయి విలపిస్తోంది

ఇంకోరూ ఇంకోరూ అయితే, "పాపం బద్దలయింది ఈనాటికి"అని సంతోషించేవారే కాని ముప్పయిఏళ్ళు ఆమెతో బ్రతుకును పంచుకున్న కేశవరావుగారికి మాత్రం ఆమెనాస్థితిలో చూసి హృదయం కదిలిపోయింది

అయినా ఓదార్చే ప్రయత్నం చేయలేదు

తనంతట తానే తెప్పరిల్లుకున్నది కామేశ్వరమ్మ కొంతసేపటికి

తల పైకెత్తి, "— ఇలాగయిందేమిటండీ ?" అని అడిగింది భర్తని ఆ కంఠంలో దుఃఖపు జీర కరగలేదింకా

"స్వయంకృతం" అనే మాట కేశవరావుగారి నోటి వెంబడి అప్రయత్నంగా జారబోయింది గానీ తమాయించుకున్నారు

"నాకు మాత్రమేమి ఎరుక!" అన్నట్టుగా ఓ నిట్టూర్పు మాత్రం వెలువరించి వూరుకొన్నారు

"నేనిలా అతలాకుతల మవుతున్నా — నిమ్మకు నీరెత్తినట్టుంటాడేం ఈయన?" కినుకుగా అనుకుంటూ, "మాటాడరేమండీ? అసలు మీరుండీ వాళ్ళని గుమ్మమెలా ఎక్కనిచ్చారు?" అన్నది కోపం తెచ్చుకుంటూ

సాలోచనగా చూశారు భార్యవంక కేశవరావుగారు!

"సోఫియాని చూశావ్‌గా కామేశ్వరీ! ఆవిడ తలుచుకున్న ఏ పనయినా సరే ఆపుచెయ్యడం ఎవరికైనా సాధ్య పడుతుందనే అనిపించిందా నీకు? అలాగయితే అసలిక్కడకావిడ బయలుదేరకుండానే మురళి ఆపి వుండేవాడుకాదా?" అన్నారు

నిజమే సోఫియాని బయలుదేరనీకుండా మురళి తన సాయశక్తులా అడ్డగించాడు కానీ ఏమీ ప్రయోజనం లేకపోయింది సోఫియా వినలేదు.

"అమ్మ పెట్టా పెట్టదు అడుక్కు తినా నివ్వదనీ — మీకు సంపాయించి పెట్టే సత్తావాలేదు మెడమీద చెయ్యేసి వసూలు చేసుకోవాల్సిన చోట మొహమాట పడమంటారేమిటి? మీకు బిడియమయితే మీరిక్కడే వుండండి నేను వెడతాను" అన్నది మొండిగా

సౌఖ్యాన్ని జుర్రుకోవటమే సోఫియా జీవిత లక్ష్యం స్వసుఖాన్వేషణే ఆమె ప్రథమ కర్తవ్యం ఆమె దృష్టిలో అందిన జీవితంతో తృప్తిపడి, పని చెయ్యడానికో, తిండి నిద్రలకో అంకితమయిపోయి యంత్రవతుగా బతికేసే మనుషులు అసలు మనుషులు కారు, గాను గెద్దులు

ఈ ఆర్నెల్లబట్టీ 'గాజుల బేరం భోజనానికి సరి' అన్నట్టున్న మురళి సంపాదనతో ఏ మాత్రపు ఉత్సాహంలేక నత్తనడకలు నడుస్తోన్న తమ ఈ దైనందిన జీవితానికీ, గంతలు కట్టుకుని ఆలోచననేది లేకుండా గిరగిర తిరిగే ఆ ఎద్దు బ్రతుక్కూ పోలిక కడితే ఆట్టే తేడా కనిపించలేదామెకు

ఒకసారి సుఖాన్ని చవి చూసిన ఆమె ప్రాణం తిరిగీ ప్రాప్తించిన ఈ చప్పని నిస్సార జీవితాన్ని భరించలేకపోయింది

'పోనీ రేపూ మాపట్లో పరిస్థితులు ఇంతకన్న మెరుగు పడకపోతాయా' అన్న ఆశ వుండేది మొదట్లో

కానీ చేయించుకున్న వైద్యానికి పావుబస్తా ధాన్యంతోనో, కుంచెడు కందుల్తోనో విలువకట్టి చూసే ఆ పల్లెప్రజల పేదరికమూ, ఏ పెద్ద కామందు నించో కాస్త గడ్డు కేసు తగిలి ప్రతిఫలం బాగా ముట్టుతుందనుకోటానికి లేకుండా ఆ జబ్బు తాలూకు పరీక్షకో, ఆపరేషన్‌కో తగిన ఇన్‌స్ట్రుమెంట్లులేక పట్నానికి వెళ్లమని చెప్పాలిసొస్తున్న దౌర్భాగ్యపు ప్రాక్టీస్ తీరుతెన్నులు ఆ ఆశను అంతకంతకూ క్షీణింపచేసేయి

దీనికిమించి, "అయ్యో — ఎన్నాళ్లయినా ఈ గొర్రెతోక బతుకేనా — మరోవిధాన ఉన్నతికి కృషి చేద్దాం" అన్న యోచనేలేక నిరాసక్త యోగంలో ఉండిపోతున్న మురళి ఉదాసీన వైఖరి ఆమెలో అసహనాన్ని, అశాంతినీ మరింతగా పెంచేయి

తనసలు అంత కష్టపడి మురళిని సాధించుకున్నదెందుకు? ఖరీదయిన జీవితాన్ని పైలా పచ్చీసుగా అనుభవించొచ్చని అంతేగానీ ఇలా వున్నపాటునే కుదేలయిపోయి జీవచ్ఛవంలా బ్రతుకీడ్వడానిక్కాదు

ఇంకా నస్తాయించితే ఈ స్తబ్దత తన సహజ చురుకుతనాన్నీ బ్రతుకుమీద ఆసక్తినీ గూడా హరించేస్తుందనే భయం కలుగుతోంది కూడానూ

ఆ వెంటనే ఈ మూడీ వాతావరణం నించి బయటపడాలనే నిశ్చయానికొచ్చింది సోఫియా

అది మొదటి మెట్టుగా ఆ తరవాత మంచి భవిష్యత్తుకి సోపానాలు వేసుకోవాలి అంచెలంచెలుగా అంతస్తుల కెగబాకిపోవాలి, అనే పట్టుదల ప్రబలింది

కానీ ఇక్కణ్ణించి ఎక్కడికని వెళ్లేటట్టు? ఏమిచేసేటట్టు?

"అన్న దగ్గరకా?" అనుకున్నది మొదట

కానీ అతనికే నిలకడయిన నివాసమూ నౌకరీ లేవే — జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలిందనీ ఇక తమకేం ఆశ్రయమిస్తాడు ఏం దారి చూపుతాడు?

ఇకపోతే అత్తవారిల్లు వుంది అక్కడ తమను ఆదుకోగల ఆర్థిక స్తోమతు వున్నది పోతే



బలత్కారంగానైనా తినగలిగే హక్కు తమకీ, పెట్టాలిసిన అగత్యం వారికీ కూడా ఉన్నాయి

ఇంకెందుకు తటపటాయించడం ? తక్షణం ప్రయాణం కట్టింది సోఫియా

మురళి నెత్తీ నోరూ కొట్టుకు చెప్పాడు, ''ముందు ఉత్తరాల ద్వారా సంప్రదించి చూద్దాం'' అని

''వచ్చే సమాధానం మనకు తెలియందా — అదివరకు అనుభవమే కదా మనకి'' అన్నది సోఫియా

''కనీసం వసంత పెళ్లి అయ్యేవరకన్నా వాయిదా వేయమని'' ప్రాధేయపడ్డాడు ఎంతగానో

''మంచివారే — తగిన సమయమిదే'' అన్నది సోఫియా

అసలు ఇప్పటికే కాలహరణ మయిపోయిందని సోఫియా ఆదుర్దా ఇప్పుడిక మెత్తబడితే ఈ ప్రయాణం ఆగిపోతుంది

వసంత పెళ్లయాక మాత్రం వెళ్లనిస్తాడా ఈయన ?

అయ్యేదాకా ''అవనీ చూద్దాం'' అంటున్నాడు అయ్యేక ''అమ్మమ్మో నా చెల్లెలి కాపురం కూలిపోదా'' అని మొర్రెత్తుతాడు

ఇక ఉత్తరాలు — పత్తరాలు ఈ కొడుకు కుండ బద్దలుకొట్టినట్టడగలేదు ఆ తండ్రి పక్షపాతబుద్ధి వదిలి పంచబోడు

ఇహనేముంది ఆస్తిపాస్తులు ఆడపిల్ల హస్తగతమవుతాయి తమ చేతికి చిప్పకర్ర మిగులుతుంది

ఇప్పటికయినా మేలుకోకపోతే లాభంలేదు వెంటనే వెళ్లిపోయి అక్కడ పీఠం వెయ్యాలిసిందే

కాకపోతే అక్కడ కాస్త రాద్ధాంతం రేగే మాట నిజమే నాలుగు రోజులు పోతే వాళ్లే సరిపుచ్చుకుంటారు

ఇక తాము వెళ్లటం మూలంగా వసంత పెళ్లి ఆగిపోతుందన్న శంక వున్నది

ఆగనీ — మరీ మంచిది

నిప్పుని గుడ్డతో మూసివుంచాలన్నా, నిజాన్ని ఎన్నాళ్లో మరుగున వుంచాలన్నా అసాధ్యమే!

ఇవ్వాళ కాకపోతే రేపయినా తమది ఇంటర్‌కాస్ట్ మారేజన్న వయినం వెలుగులోకి వచ్చేతీరుతుంది

అప్పుడు మాత్రం ఏమవుతుంది ?

అందుకున్న ఆ నియ్యం కాస్తా కయ్యమవుతుంది

పగిలి బీటలువారినా బలమయిన ఫ్రేములో బిగించినందువల్ల వూడిపోకపోయినా ప్రతిబింబాన్ని అందవికారం చేస్తున్న అద్దంలా, వసంత జీవితం వాద్యాలు మ్రోగించి మంత్రాలు వల్లించి బిగించిన వివాహబంధంలోంచి విడివడనూలేక, విరిగిన మనసులతో కాపురం వెలిగించనూలేక వికృతమవుతుంది

దానికన్న అంత్యనిష్ఠూరంకన్నా ఆదినిష్ఠూరం మేలనీ — ''అయ్యా ఇదండీ సంగతి'' అని అంతా చెప్పేసి, అందుకు ఇష్టపడ్డవారికే ఇచ్చి చెయ్యడం భేషయిన పని

అయినా ఈ రోజుల్లో కూడా కులం మతం

## కాలం కరిచాక

అంటూ పట్టుకునివేలాడితే నవ్విపోతారు ఎవ్వరో బీ సీనాడు వూరుకూడా దాటలేని పరిస్థితుల్లో వున్న వారి మాటలవి ఓ పక్కన వూరుకాదు— రాష్ట్రం కాదు — దేశంకాదు మళ్ళీ మాట్లాడితే గ్రహాలు దాటుతూ, పరిధిని విశాలం చేసుకుంటూ కొందరు మున్ముందుకు పురోగమిస్తుంటే, ఇంకా జాతి, కులం, మతం అంటూ కుంచించుకుని కుంచించుకుని వాళ్లశాఖ, వాళ్ల రక్తంలోనే సంబంధాలు కలుపుకోవాలనుకునే వాళ్లని ఏం చెయ్యాలి ? అక్కడెక్కడో ఏ దేశంలోనో ఇంకా ఆకులు చుట్టుకుంటూ పచ్చి మాంసం తింటున్న తెగలున్నయ్యట — వాళ్ల దగ్గరికి తరిమెయ్యాలి

అసలు నీ మతం నీకు గొప్పది నా మతం నాకు గొప్పది నీ తక్కువా నా ఎక్కువా అనే అహంకారం ఏమిటసలు వీళ్లకి ?

'ఏది ఏమయినా, ఎవరు ఏ గంగలో దూకినా తను వెళ్లేమాట ఖాయం' సోఫియా గట్టిగా నిర్ణయించుకుంది


**సారూప్యం**

మహాత్ములు
మహానదుల వంటివారు
నిరంతరం చలిస్తున్నా
నిశ్చలంగానే కన్పిస్తారు !

—''సింహం''

సామానుకి లొంగకపోతే సోఫియా మరింక దేనికి లొంగని ఘటమని తెలుసును మురళికి

అప్పటికీ ఆఖరి ప్రయత్నంగా ''ఎలాగ వెడతావో చూస్తాను'' అని చూశాడు బెదిరింపుగా

ఇలాంటి తాటాకు చప్పుళ్లకి చెదురుతుందా సోఫియా ? ఒక నవ్వునవ్వి సూట్‌కేస్ సర్దుకుంది

''ఎడ్రసుంది నోట్లో నాలికా వుంది మీరు తోడులేకపోయినా వెళ్లగల ధైర్యమూ వుంది నేను వెడుతున్నాను మీరు చేసేది చెయ్యండి'' అని పిల్లల్ని వెంటబెట్టుకుని మెట్లుదిగింది

'మొండికెత్తిందాన్ని మొగుడేం చేస్తాడ'న్న సామెత వుండనే వుందికదా !

ఆమె ధాటికి ఒదిగి వుండటం ఎప్పుడూ అలవాటే గనక, వంటరిగా వెళ్లి అక్కడేం యాగీ చేస్తుందో అని దడుస్తూ వెంట పడడం ఇప్పుడూ తప్పని సరే అయింది మురళికి

కామేశ్వరమ్మ వచ్చేముందు అతడు తండ్రితో చెప్పి వాపోతున్న విషయమదే

కోడలు అన్నిటికీ తెగించిన బాపతు అనే అనిపించింది, కామేశ్వరమ్మకీని

అయితేమటుకు గొంతుకు అడ్డంపడ్డ సమస్యని గాలికొదిలేసి, ఈ విషమ పరిస్థితిని దాటడమెలాగ అన్న చింతనే లేక భర్త అలా చేతులు దులుపుకు కూర్చున్నట్టుండటం ఆమెకేమీ బాగాలేదు

''పోనీ వచ్చేశారే అనుకోండి ఆ తరువాత నయినా వెంటనే సాగనంపే ప్రయత్నం చెయ్యొద్దూ ? అవతల కొంపలంటుకుంటాయని తెలిసీ తీరిగా కొడుకు చెప్పే బులిబుచ్చికాలు వింటున్నారా !'' అన్నది నిష్ఠురమేస్తూ

పెదవి విరిచారు కేశవరావుగారు ''అదీ అంత సులభంకాదు గట్టి వ్యూహంమీదనే వచ్చింది నీ కోడలు ఈ ఇంట్లో తన స్థానం నిరూపించుకుని, ఇక్కడే స్థిరపడే ఆలోచనలో వున్నట్టుందామె''

''ఏమిటీ ?'' కామేశ్వరమ్మ నొసలు పైకి వెళ్లేయి కళ్లు పెద్దవయ్యాయి

''ఇక్కడే వుండిపోతుందా ? ఏం ధైర్యం ఎంత సాహసం ? ఇక్కడ తన సొమ్మేమన్నా దాచి పెట్టిందనా వుండనివ్వటానికి ? ఆ ఆటలు మన దగ్గరేమీ సాగవని చెప్పండి వెంటనే బయటకు నడవకపోతే మర్యాద దక్కదని చెప్పండి'' ఉద్రేకంతో ఎదటలేని కోడలిమీద పళ్లు నూరింది ఆమె

ఎంతసేపూ తననుకున్నట్టు జరిగిపోవాలనే పంతమేకానీ సాధ్యాసాధ్యాలూ, న్యాయాన్యాయాలూ ఆలోచించాలని తట్టదేం ? ఎన్ని ఎదురుదెబ్బలు తిన్నా ఈమె అహంకార ప్రవృత్తిలో మార్పు రాదేం ?

సహనవంతుడయిన కేశవరావుగారికి కూడా ఈ మాటు ఓర్పు అడుగంటింది కోపాన్ని పైకగుపడనీకుండా గంభీరంగా అన్నారు

''అదే చూస్తున్నాను మనం [illegible]దుపొమ్మంటే ప్రాణాలే పోగొట్టుకోడానికి మీనాక్షి వంటిదీ, మా ఎత్తుకు తూగలేరంటే కాన్గా తప్పుకోడానికి హిమబిందు వంటిదీ కాదయ్యో — ఈ సోఫియా నీ కన్న నాలుగాకులు ఎక్కువే చదివింది తలచట మొక్కటే కాదు అది ఫలింపచేసుకోగల సమర్థురాలు కూడాను నేను వెళ్లిపొమ్మని చెబితే మాత్రం వచ్చిన పని నెరవేర్చుకోకుండా వెనక్కి మళ్లుతుందా అని''

''అది వ్యంగ్యమా ? వెక్కిరింతా ?'' మనస్సున ముల్లు గుచ్చుకున్నట్టు కసుక్కుమన్నది కామేశ్వరమ్మకి

అంతలోనే పౌరుషం పొడుచుకు వచ్చింది ''దెప్పుతున్నారా ?'' ఉక్రోషంగా అడిగింది

''అబ్బెబ్బే — ఉన్న సంగతి చెబుతున్నానంతే'' సర్దుకున్నారు

''మీకు సంశయమయితే నేనే చెప్తానులెండి మీరేమీ ప్రయాస పడకండి'' రోషంతో ఆమె ముక్కుపుటాలు ఎర్రబడిపోయేయి

వాదన పెంచే ఇష్టంలేక మౌనంగా ఉండిపోయేరు కేశవరావుగారు

చీకటి నిశ్శబ్దంగా తన నీలి పరదాలు దింపుతోంది వారిద్దరి చుట్టూరా ఆ తెరల మరుగునించీ ప్రకృతి చిత్రకారుడి రేఖా చిత్రంలా లీలా మాత్రంగా గోచరిస్తోంది

చికాకయిన మనసులతో ఆలోచనల ప్రవాహంలో కొట్టుకుపోతూ, సుబ్బాయమ్మ ఆగమనాన్ని గమనించలేకపోయారిద్దరూ

'టిక్' మని లైట్ స్విచ్ నొక్కి, ''చీకట్లో ఏమి రాచకార్యాల్రా ?'' అన్నది సుబ్బాయమ్మ

ఉలిక్కిపడి చూవారేతప్ప బదులివ్వాలనిపించలేదిద్దరికీ

## కా లం క రి చా క

సుబ్బాయమ్మ కామేశ్వరమ్మకి అతి సమీపంగా వచ్చింది ఏదో ముఖ్య సమాచారం అందించవచ్చిన దానిలా సీరియస్‌గా మొహంపెట్టి కామేశ్వరమ్మ చెవి దగ్గర వంగింది

"ఆ అమ్మాయి పిల్లలు అన్నాలకి ఏడుస్తున్నారంటూవుందే" అని వినిపించీ వినిపించకుండా గుసగుసలాడింది

కామేశ్వరమ్మ నుదుటి చిట్లింపులో అయిష్టాన్ని కనిపెట్టి, "సరే – తప్పతుందా" అని దీర్ఘంతీసి, "ఎక్కడ పెట్టమంటావో ఏమిటో వెళ్లి చూడుమరి కోకిల నీకోసం చూస్తోంది" అని తొందరించింది

కామేశ్వరమ్మ నిట్టూర్చి లేచింది

ఆవిణ్ణి దిగి వెళ్లనిచ్చి తను మాత్రం ఏదో పని ఉన్నదానల్లే అక్కడే దిగబడిపోయింది సుబ్బాయమ్మ

చెదిరిన కుర్చీ లటూ ఇటూ లాగి సరిచేసింది టీపాయ్‌మీది అగరువత్తుల స్టాండులో కాలిన పుల్లలు తీసేసి దులిపి మళ్ళా తీసినచోట పెట్టింది కిందపడి దొర్లుతున్న మంచినీళ్ల గ్లాసులు తీసి గ్లాసులో గ్లాసుగా పెట్టు వేసి గోరవారంటగా నిలబెట్టింది ఇంకా చేసేందుకేమున్నదా అని చుట్టూరా వెతుక్కుంది

మొత్తానికి 'ఈవిడ మనింటి మనిషిలా కష్టపడుతోంది సుమా!' అన్న భావం ఎదటివాళ్లకి తోపించేలాగ అటుది ఇటు ఇటుది అటూ కదిపి కాస్సేపు అభినయం చేసింది

ఇంతకీ కేశవరావుగారిని ఏదో అడగాలని ఆవిడ ఆరాటం కానీ కాస్తంత సంకోచం ఆ సంకోచం చెబుతాడా లేదా అనేగానీ అడుగుదామా వద్దా అనికాదు

కాస్తసేపు పస్తాయించి అడిగేసింది "అయితే కేశవా! మురళి ఏమంటాడూ – పెళ్లి పెళ్లామే అంటున్నాడా?" ఎప్పుడూ సప్తమంలో మ్రోగే కంఠాన్ని మందరంలోకి దించింది ఈమాటు

గతుక్కుమన్నారు కేశవరావుగారు

'ఓహ్'

ఇంతవరకూ బాహిర్ ముఖ ప్రమాదాలనే శంకించాడుగానీ ఇంట్లోనే తన పుట్టి ముంచగల ప్రబుద్ధులున్న సంగతే ఏమారిన తన మందబుద్ధికి తన్నితాను నిందించుకున్నారు వారి నోరు కట్టగల ఆవశ్యకత ఎంత వున్నదో ఆయనకు ఆ క్షణమే స్ఫురించింది

లేచివెళ్లి సుబ్బాయమ్మ చేతులు పట్టుకున్నారు

"అక్కయ్యా ఇదంతా కడుపులో పెట్టుకోవాలి సుమా!" అర్థించారు

ఉబ్బితబ్బిబ్బయింది సుబ్బాయమ్మ బంధు బలగంలో లక్షలార్జించిన కేశవరావుగారి ఫామిలీది పెద్ద పేట అంతటివాడు దిగజారిపోయి తన చేతులు పుచ్చుకుని 'నీవే దిక్క'న్నట్టయిపోడం ఆవిడకు ఎనలేని తృప్తి నిచ్చింది

"అయ్యో చెప్పాలిటయ్యా – నీ బిడ్డ ఒకటీ నా బిడ్డ ఒకటీనా?" అన్నది ప్రసన్నంగా

ఆ వెంటనే, "ఇంతకూ పెళ్లాడిన బాపతే అంటావా?" అంటూ మళ్లీ అసలు విషయంలోకి దిగిపోయింది (ఇంకా వుంది)



# సుదర్శనం

[ప్రముఖ రచయిత్రి శ్రీమతి లక్ష్మీరమణ బ్రిటన్, అమెరికాలలో పర్యటించి యిటీవల హైదరాబాదు వచ్చారు ఆ దేశాలలోని వివిధ విషయాలను గురించి శ్రీమతి అరుంధతీరావు అడిగిన ప్రశ్నలకి శ్రీమతి లక్ష్మీరమణ చెప్పిన సమాధానాలని ఇక్కడ యిస్తున్నాము — సం॥]

ప్రశ్న — ఇంగ్లండు, అమెరికా దేశాలలో ముఖ్యంగా మిమ్మల్ని ఆకర్షించిన విషయాలు ?

సమాధానం — పారిశ్రామికాభివృద్ధి, పరిశుభ్రత, యాచకులు లేకపోవటం, నిరుద్యోగ సమస్య లేకపోవటం

ప్ర — మీరు దర్శించిన ఇంగ్లండు, అమెరికా దేశాలలో భారతదేశానికి సన్నిహితంగా అగుపించిన దేశం ?

స — ప్రాచీన సంస్కృతి సంబంధించినంత వరకు కొంతవరకు ఇంగ్లండుకు మన భారతదేశానికి పోలికలు అగుపిస్తవి అక్కడ నేషనల్ మ్యూజియం చూసినప్పుడు మన అజంతా, ఎల్లోరా, మైసూర్ మ్యూజియం తలపుకు వచ్చినవి ఆధ్యాత్మికంగా చూస్తే ఇంగ్లండు దేశమేకాదు మరే ఇతర దేశాలూ మనదేశంతో పోటీ పడలేవనిపిస్తుంది శాంతి దూత గాంధీజీని ఆ దేశాలవారు ఆదర్శప్రాయంగా ఈనాటికీ జ్ఞాపకం చేసుకుంటున్నారు వైశాల్యంలో ఇంగ్లండు మనదేశంకన్నా ఎంతో చిన్నది, అయినా ఆ పరిధిలో ఎంతో అభివృద్ధిని సాధించింది దానికి ముఖ్య కారణం క్రమశిక్షణ అనుకుంటాను ఇంక అమెరికా దేశం సామాన్య మానవుని పట్ల ఆశయాలతో మన దేశం ఏకీభవిస్తుంది

ప్ర — అమెరికా అభివృద్ధికి కారణం క్రమశిక్షణ కాదంటారా ?

స — అమెరికా ఆర్థిక పరిస్థితి రెండువందల సంవత్సరాల స్వల్పకాలంలో అద్భుతంగా పెంపొందటానికి కారణం ముఖ్యంగా వారి నిర్విరామ కృషి అనిపిస్తుంది అయితే అమెరికా అభ్యున్నతికి కారకులు మన భారతీయులు కూడాను హాస్పటల్సులోను, కర్మాగారాలలోను, ఇతర రంగాలలోను శ్రమకోర్చి ఎక్కువ పాటుపడేవారు ఎక్కువగా భారతీయులు

ప్ర — మరి స్వదేశంలో మనవారు అంతగా కృషి చేయరనా మీ అభిప్రాయం ?

స — సన్నిహితులకు స్వదేశానికి దూరంగా వచ్చామనే-భావం, ధనార్జన ఎక్కువగా చేయాలనే తాపత్రయం అక్కడ నివసించే మన వారిని ఎక్కువ శాయశక్తుల పని చేయిస్తుందేమో ననిపిస్తుంది తమ శక్తి సామర్థ్యాలను పూర్తిగా అక్కడ వినియోగించే అంతగా ఇక్కడ వినియోగించటంలేదేమో ననికూడా నాకు తోస్తుంది మనవారు అక్కడ కృషి చేసినంతగా ఇక్కడకూడా కృషిచేసినట్లయితే మన దేశంకూడా త్వరలో అభివృద్ధి చెందగలదనిపిస్తుంది మేధాశక్తిలో, కార్యదీక్షలో మనడాక్టర్లకు, ఇంజనీర్లకు, ఇతర రంగాలలో ఉద్యోగస్తులకు మంచి గుర్తింపు రావటానికి కారణం వారు శక్తివంచన లేకుండా కృషి చెయ్యటమే మేధాశక్తిలో, కృషిలో ఏ దేశస్తులకు తీసిపోరని నిరూపించుకుంటున్నారు. ఇక్కడ మనవారు డిగ్నిటి ఆఫ్ లేబర్ గుర్తించినా గుర్తించకపోయినా ఆ దేశాలు వెళ్ళిన తరువాత గుర్తిస్తున్నారు అక్కడ పెద్ద కార్ కంపెనీ వోక్సువాగన్ దర్శించినప్పుడు యీ విషయం నేను గుర్తించాను ఏ రంగంలోనైనా గొప్ప నైపుణ్యం సంపాదించిన వ్యక్తికూడా చిన్న ఉద్యోగం ముందుగా చేపట్టటానికి సంశయించరు లైన్‌మాన్‌గా పనిచెయ్యటానికిగాని, నర్సుగా చేరటానికిగాని మనవాళ్ళుకూడా వెనుకాడరు ఆ విధంగా ముందుగానే పెద్ద ఉద్యోగం కొరకు ఎదురు తెన్నులు చూస్తూ కాలయాపన చెయ్యకుండా చిన్నఉద్యోగంలో ప్రవేశించి, స్వయంకృషి వల్ల పై స్థానాలను అందుకోగలుగుతున్నారు

ప్ర :— మీరు సెంట్‌లూయిస్‌లో ఎత్తైన స్టీలు ఆర్చి, న్యూయార్కులో స్టాచ్యూ ఆఫ్ లిబర్టి



ఇంగ్లాండ్‌లో షేక్స్పియర్ పుట్టిన చోటుని సందర్శిస్తున్న రచయిత్రి శ్రీమతి లక్ష్మీరమణ

చూసి వుంటారనుకుంటూ, వాటి ప్రత్యేకత ఏమైనా అగుపించిందా ?

స — 630 అడుగుల స్టేన్‌లెస్ స్టీల్ ద్వారం నిర్మాణం ఇంజనీర్ల అద్భుత శక్తికి ఒక నిదర్శనం లిఫ్టులో పైవరకూ వెళ్ళి చూడటం ఒక చిత్రమైన అనుభూతి ఆ ఆర్చి నిర్మాణంలో ప్రయోజనం మాత్రం నాకు గోచరించలేదు అదే శ్రమ మరేదైనా ప్రయోజనాత్మకమైన దానికి చేసి వుంటే బాగుండుననిపించింది స్టాట్యూ ఆఫ్ లిబర్టి స్వాతంత్ర్యానికి ప్రతిరూపంగా నిలిచిన ప్రతిమ 305 అడుగుల ఎత్తున వున్న ఆ 'మదర్ ఆఫ్ ఎక్సైల్' ఓ చేత కాగడా, మరో చేత పుస్తకం పట్టి చదువుల సరస్వతిని తలపిస్తుంది ఆ వెలుగు మాతను చూడటానికి స్టీమ్ లాంచిలో వెళ్ళాలి కన్యాకుమారి వద్ద వివేకానంద్ రాక్ చూడబోయి నప్పటి జ్ఞాపకాలే మనసులో మెదిలాయి అయితే వివేకానంద్ నిజంగా జీవించిన మహావ్యక్తి, అమెరికా కూడా సందర్శించి భారతదేశ ప్రతిభ చాటిన మహనీయుడు స్టాట్యూ ఆఫ్ లిబర్టి ఒక ఆదర్శ ఊహా స్వరూపం అయితే నేను వాషింగ్‌టన్ వెళ్ళి నపుడు, లింకన్ విగ్రహం ముందు నిలిచినపుడు కూడావివేకానంద్ రాక్‌పైన నిలిచిన అపూర్వానుభూతి కలిగింది లింకన్ మహాశయుడంటే కూడా నాకు ఎంతో గౌరవం అందువల్ల స్టాట్యూ ఆఫ్ లిబర్టి చూసినప్పటికన్నా లింకన్ మెమోరియల్ సందర్శించి నప్పుడు నేను ఎక్కువగా తృప్తిచెందాను

ప్ర — మిమ్మల్ని ఆనందపరచిన దర్శనీయ స్థలాలు ఏమిటి ?

స — ఇంగ్లండులో మహాకవి షేక్స్‌పియర్, విలియం వర్డ్స్ వర్త్, బ్రానటీ సోదరీమణులు నివసించిన స్థలాలు దర్శించి వారి రచనలకు, వారు నివసించిన వాతావరణానికి సంబంధ బాంధవ్యాలు ఎంతవరకు వున్నదీ తెలుసుకోడానికి ప్రయత్నించాను వారి రచనలు వ్రాతప్రతులు, వారికి సంబంధించిన వస్తువులు అన్నీ జాగ్రత్త పరచబడి వున్నవి మనకూ కాళిదాసు, నన్నయ, తిక్కన, ఎర్రాప్రగడ మొల్ల మొదలైన పూర్వ రచయితలు, ఈ కాలంలో మహా రచయిత(త్రు)లు లేకపోలేదు పూర్వం వారి జ్ఞాపకార్థం మిగిలిన చిహ్నాలు చాలా అరుదు మనకు ఎక్కువ భాగం మిగిలినవి శిల్పకళ మాత్రమే

# సుదర్శనం

భావికాలంలో నయినా మన మేధావుల, రచయితల సంబంధించిన జ్ఞాపక చిహ్నాలను ఎదిల పరచటం వాంఛనీయంగా తోస్తుంది

ప్ర — అమెరికాలో, ఇంగ్లండువలె మన దేశంలోవలె పూరతన వస్తుప్రదర్శనశాలలు ఏమైనా చూసారా ?

స — అమెరికా ముఖ్యంగా ఇటీవల అభివృద్ధి చెందిన దేశమే కాబట్టి, చెప్పకోదగ్గ పూర్వ ఔన్నత్యం అగుపించదు 1758లో ఫ్రెంచి రెడ్ ఇండియన్సుకు మధ్య జరిగిన యుద్ధ సమయం జ్ఞాపకార్థంగా ఫోర్ట్ లెగనీర్ పదిల పరిచారు ఆనాటి పరిస్థితులన్నీ కళ్ళకు కట్టినట్లుగా నిలు వెత్తున విగ్రహాలతో చూపబడుతుంది అనాటి చరిత్ర అంతా మనకు ప్రత్యక్షమౌతుంది మన ఢిల్లీ ఎర్రకోట, హైదరాబాదులో గోల్కొండ ఫోర్టులలో ఎన్నోవంతో కూడా కాని ఆ ఫోర్టు విశేషాలు అద్భుతంగా చూపబడ్డాయి చికాగో హిస్టరీ మ్యూజియంలో కూడా పూర్వం అమెరికాదేశం, రెడ్ ఇండియన్సు జీవిత విధానం ఎంత వెనకబడి వుండేదో చూడవచ్చును దానికి వ్యతిరేకంగా ప్రక్కనే అభివృద్ధి చెందిన నాగరికత విజ్ఞానం అభివృద్ధికి నిదర్శనాలుగా ఆకాశాన్నంటే భవనాలు, ఆడిటోరియం కొట్టవచ్చినట్లు పుట్టుకొచ్చినవి

ప్ర — అక్కడ ప్రకృతి రచయిత్రిగా ?

స — అక్కడి స్నో ఫాల్ చూడముచ్చటగా ఉంది బయట చలిమాత్రం రాకాసిలా పీకేస్తుంది అక్టోబరు నెలలో ఫాల్ సీజన్ ఎంతో కనుల పండువగా వుంది ఆకు ఆకునా అనేక రంగులు ప్రతి ఆకూ ఒక అందాల పూవులా మెరిసిపోతుంది కొండలన్నీ రంగురంగుల చెట్లతో కాశ్మీరు శాలువాలు పరచుకున్నట్లుగా నయనానందంగా గోచరిస్తాయి ఇంక నయాగరా ఫాల్సు చూచి తీరవలసిన సుందర దృశ్యం అమెరికా వారికి, కెనడావారికి ఇరువురికీ ప్రకృతి పక్షపాతం లేకుండా పంచి ఇచ్చిన అద్భుత వరం అది కోటి చిన్నారుల దరహాసాలులా, పట్ట పగ్గాలులేని తెల్లని అశ్వాల పరుగుల్లా వుంది ఆ నీటి దూకుడు

ప్ర — సుందర ప్రదేశాలు అంటే డిస్నీ లాండ్, డిస్నీవర్ల్డ్ గుర్తుకు వస్తున్నవి వాటి గురించి మీ అభిప్రాయం ?

స — పిల్లలకు డిస్నీలాండ్ ఒక అద్భుత మైనదనే విన్నాను వాటిని నేను ప్రత్యక్షంగా చూడలేదు కానీ చూచినట్లే అనుభూతి కలిగింది జనవరి 81 నేను అక్కడే వుండటం వల్ల టి వి లో రోజ్ బౌల్ షో రెండు రోజులపాటు చూసాను ఆ పూల ప్రదర్శనలు అతినేర్పుగా కూర్చబడినవి అందులో ముఖ్యంగా నా హృదయానికి హత్తుకొన్నది కనులు లేని ఒక అంధుడు స్పర్శ ఆధారంగా కూర్చిన పూల కూర్పు అక్కడ వికలాంగులకు ఆదరణ చూపబడుతుంది వారు కార్లు పార్కుచేసే స్థలం కూడా ముందుగా నిర్ణయించబడుతుంది చెవిటి వారికి టి వి లో ప్రత్యేక ప్రదర్శనలు ఏర్పాటు చేయబడుతున్నవి ముఖ్యంగా బాలబాలికలకు ప్రతిభా పాటవ పోటీలు నిర్వహించబడుతూ వుంటాయి

ప్ర — అయితే ఇతరదేశాల నుండి మనం నేర్చుకోదగ్గ విషయాలే ఎక్కువంటారా ?

స — అలాగని నేననను మననుండి వారు తెలుసుకోవలసిన విషయాలు ఎన్నో వున్నవి మన యువతరంకన్నా అక్కడి యువతరంలో అశాంతి రెస్ట్‌లెస్‌నెస్ ఫ్రస్ట్రేషన్ ఎక్కువ అనిపించింది చెడు అలవాట్లకు వారు మరింత సులభంగా లొంగిపోయే ప్రమాదం కని పిస్తుంది ఇక్కడ లభించేంతగా తల్లిదండ్రుల ఆదరణ, అనురాగం అక్కడ కొదువగా గోచరిస్తవి మరీ లేత వయసులోనే వారు వారి కాళ్ళపై నిలబడవలసిన అగత్యం ఏర్పడుతుంది అది ఒకింత మంచికి దారితీసినా మరీ లేబ్రాయంతో బాధ్యతలు బరువులూ వారిపైన పడటం సంభవిస్తుంది ఎంత ప్రగతి సాధించినా మనస్సులో అశాంతి, ఆరాటం అలుముకోవటం శ్రేయస్సుకాదనిపిస్తుంది అలాగని అక్కడ జరిగే ప్రగతి మార్గం మనం దర్శించక పోవటం వివేకం కాదేమో ! మన ప్రజల జీవన ప్రమాణాలు ఉన్నత స్థాయినందుకోవాలంటే అభి వృద్ధిని సాధించిన దేశాల మంచి మార్గాలను మాత్రం మనం అవలంభించటంలో అవివేకంలేదేమో ?

— ఎ. లక్ష్మీరమణ ★



'త్రిశూలంలో' కృష్ణంరాజు, జయసుధ

## ప్రేమ జ్వాలలో ద్వేషపు జ్వాలలు

డేనియల్ ఇంట్లోంచి డేనియల్ (గోకిన రామారావు), చెన్నయ్య (సాక్షి రంగారావు) బయటకు వచ్చారు. పక్కింట్లోంచి రామశాస్త్రి (హేమ సుందర్), కన్నయ్య (రాళ్ళపల్లి) బయటకు వచ్చారు. డేనియల్ కోపంగా "దమ్ముంటే ఎదుటపడి సాధించాలిగాని, ఇలా మాయచేసి నా కూతురిమీద నీ తెలివితేటలు ప్రదర్శించటం కాదురా, పంతులూ!" అన్నాడు.

"ఆ మాట అన్నావంటే చెప్పుతీసుక్కొడతాను, పింజారీ వెధవా !" అని రామశాస్త్రి మండిపడ్డాడు. మరో వంక కన్నయ్య, చెన్నయ్య గొడవ పడసాగారు: "ఏవండీ, ఏటా టాకింగూ ? దేవుళ్ళాటి రామశాస్త్రిగోర్ని అంతటి మాటలంటారా ? సిగ్గు లేదూ ?" అని కన్నయ్య అంటే, "నోర్ముయ్యరా ! ఆ పంతులొక దేవుడూ, నువ్వొక పూజారివీ !" అన్నాడు చెన్నయ్య.

రోడ్డుమీద జరుగుతూన్న ఈ గొడవ చూసి, దాదా (నూతన్‌ప్రసాద్) వచ్చాడు. "శాస్త్రిగారూ, డేనియల్‌గారూ ! మీరిద్దరూ ఈ వీధికంతటికీ పెద్దలు. మీరే ఇలా నడివీధిలో నిలబడి ఇంత అసహ్యంగా తిట్టుకుంటూంటే, ఇక మీరు రేపు ఇతరులకు ఏం బుద్ధి చెప్తారు !" అని సలహా ఇచ్చిన దాదామీద డేనియల్, రామశాస్త్రి ఒక్కసారిగా విరుచుకుపడ్డారు.

"మా కడుపు మండి అఘోరిస్తూంటే — మధ్య నువ్వేమిటయ్యా ? అసలీ దారుణం జరగడానికి కారణం నువ్వు కదూ ?" అని రామశాస్త్రి —

"నీ కొడుకుచేత నాటకం ఆడించి, మధ్యవ ఆయన్ని తప్పుపడతావేం ?" అని డేనియల్ —

గర్జించేసరికి దాదా "ఎవరు ఏ నాటకం ఆడినా — ఆ నాటకం ఆడించేది ఆ భగవంతుడే నండి," అంటూ వెళ్లిపోయాడు.

డేనియల్, రామశాస్త్రులు కూడా తమతమ ఇళ్ళల్లోకి జారుకున్నారు.

పి. వి. రాజా కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తలాటం వెంకటేశ్వరరావు నిర్మించిన భీమేశ్వర ఆర్ట్ మూవీస్ "ప్రేమ జ్వాల" చిత్రం సెప్టెంబర్ మూడోవారంలో విడుదలవుతుంది. చక్రవర్తి సంగీతం, పాము ఛాయ, ఎస్. కృష్ణాజీ నిర్వహణలో తలాటం మాణిక్యాంబ సమర్పించే చిత్రమిది.

## సెన్సార్ తమాషా !

"దైవత్" మరాఠీ చిత్రానికి క్లీన్ సర్టిఫికేట్ ఇచ్చిన బొంబాయివారు ఆ చిత్రం తాలూకు ట్రెయిలర్‌లో ఓ 'కట్' పెట్టారు.

## నాలుగు స్తంభాలాట మ్యారోజుల వేడుక !

ఏటా దాదాపు వందా యాభై చిత్రాలు విడుదలై, వాటిలో ఎక్కువభాగం అపజయం పొందుతూన్న తరుణంలో కొత్తతారలను అనుభవజ్ఞులకుమల్లే అత్యద్భుతంగా నటింపజేసిన జంధ్యాల రచన, దర్శకత్వంలో చక్కని సాహితీపరుడు, ఉత్తమాభిరుచిగల నిర్మాత నవతా కృష్ణంరాజుకు ద్వితీయ శతదినోత్సవ చిత్రం "నాలుగుస్తంభాలాట". ఈ చిత్రం ఎనిమిది కేంద్రాలలో శతదినోత్సవం జరుపుకున్న సందర్భాన వక్తలు డి. వి. ఎస్. రాజా, ఎల్. వి. ప్రసాద్, కృష్ణ, విజయనిర్మల దర్శకుని, నిర్మాతను ఎంతగానో అభినందించారు.

## "కుంకుమ తిలకం"

"మురళీమోహన్, జయసుధ హీరో, హీరోయిన్‌లు," అన్నారు డాక్టర్ ప్రభాకరరెడ్డి. ఈయన కథ, సమర్పణలో యడవల్లి విజయేంద్ర రెడ్డి నిర్మించే శ్రీ విఘ్నేశ్వర ఆర్ట్స్‌వారి పై చిత్రానికి ఆగస్ట్ 23న తొలిగీతం ధ్వని ముద్రితమైంది. సురేష్, తులసి మరోజంట. మద్దిపట్ల సూరి మాటలు, గోపీ గీతాలు రాశారు. సత్యం



# సినిమా

సంగీత దర్శకుడు. సత్తిబాబు ఛాయ, మార్తాండ్ కూర్పు నిర్వహిస్తారు. "సెప్టెంబర్, అక్టోబర్ నెలల్లో 1–10, నవంబర్‌లో 11–20 తేదీల మధ్య షూటింగ్ ముగుస్తుంది." అన్నారు డైరెక్టర్ భాస్కరరావు.

'మగాళ్ళకో నమస్కారం'లో మురళీమోహన్, ప్రభ





'యమకింకరుడు'లో జయమాలిని, చిరంజీవి

# విశేషాలు

-జి. వి. జి.

## మనిషికో చరిత్ర లో మనిషికో న్యాయం

ప్రిన్సిపాల్ టెలిఫోన్‌లో మాట్లాడుతున్నాడు "హల్లో! శ్రీ విద్యాట్యుటోరియల్ కాలేజ్ ఆఁ ప్రిన్సిపాల్‌నే మాట్లాడుతున్నాను అయ్యా! నమస్కారమండీ ఈ ఉదయమే ఇంటర్వ్యూలు అయిపోయాయండి రాంబాబు అనేఅతన్ని అపాయింట్ చేశామండి అయ్యా! తమ బంధువుల అబ్బాయి ఉన్నారా? అబ్బే ఫర్వాలేదండి అతన్ని నిమిషాలమీద తీసేద్దామండి," అంటూ రిసీవర్ పెట్టేసరికి రాంబాబు (మురళీమోహన్) ప్రవేశించాడు ప్రిన్సిపాల్ అదోలా ముఖంపెట్టి, "ఓ రాంబాబూ, రావయ్యా! నువ్వింక రావేమో అనుకున్నాను ఇంత ఆలస్యంగా వచ్చావేం? జీతం అడ్వాన్సు పుచ్చుకోడానికే ఇంత ఆలస్యంగా వచ్చిన వాడివి — నువ్వింక క్లాసులకేం వస్తావయ్యా?" అన్నాడు

రాంబాబు "ఆగండాగండి మీరనవసరంగా ఆయాస పడుతున్నట్టున్నారు ఐదు నిమిషాలు ముందుగావస్తే, ఆలస్యంగా వచ్చానంటున్నారు మీరేదో కంగారులో ఉన్నట్టున్నారు ముందు కాసిని మంచినీళ్ళు తాగండి," అన్నాడు మంచినీళ్ళ గ్లాసును అందిస్తూ

ఖంగుతిన్న ప్రిన్సిపాల్ "అదికాదు రాంబాబూ! ఆయన ఎం పి గారి బంధువు," అంటూ నీళ్ళు నమిలాడు

"సార్! మీరేమీ శంజాయిషీ ఇవ్వక్కర్లేదు మీ పరిస్థితి ఏమిటో నాకు తెలుసు కాని, ఒక విషయం మాత్రం మీరు తెలుసుకోవాలి ఇప్పుడు మీరు అపాయింట్ చేసే ఎం పి గారి బంధువెవరో నాకు తెలియదుగాని, డిసపాయింట్ అయిన నేను మాత్రం ఆ ఎం పి గారి బంధువునండి"

ప్రిన్సిపాల్ అవాక్కయిపోయాడు

రాంబాబు ఇంకా ఇలా చెప్పసాగాడు "ఎన్నికల్లో గెలిచిన వెంటనే హారసన్మానం చేసి, జనబంధు—అని బిరుదిచ్చారు గుర్తుందా? ఆ జనంలో నేనూ ఒకణ్ణికాదా? ఆయనకు బంధువుని కాదా నేను? ఆయన్ని గెలిపించిన ఓట్లలో నాదీ ఒకటి లేదా? ఇట్స్ ఆల్‌రైట్! వచ్చేజన్మలో ఆయన్నినా కడుపున పుట్టి ఋణం తీర్చుకోమని చెప్పండి గుడ్ బై!" అంటూ విసురుగా వెళ్ళిపోయాడు.

ప్రిన్సిపాల్ అలాగే గుడ్లప్పగించి చూస్తుండిపోయాడు

తాతినేని ప్రసాద్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో చింతపల్లి ప్రసాద్, టి నారాయణరెడ్డి నిర్మించిన భార్గవ ఆర్ట్ ప్రొడక్షన్స్ "మనిషికో చరిత్ర" చిత్రంలో చంద్రమోహన్, ప్రభ, మురళీమోహన్, సుహాసిని, గొల్లపూడి మారుతీరావు, అన్నపూర్ణ, పూర్ణిమ, విజ్జిబాబు, రాంజీ, కమలాకామేష్, మాస్టర్ రాము పాల్గొన్నారు గణేష్‌పాత్రో సంభాషణలు, చక్రవర్తి సంగీతం, మునీర్ ఛాయ, కె రామలింగేశ్వరరావు శిల్పం, కె సత్యం కూర్పు, గూనా సహదర్శకత్వంతో ఎస్ గోపాలరెడ్డి నిర్మాణతలో తయారైన ఈ చిత్రానికి "కుటుంబం ఒరు కదంబం" అనే తమిళ హిట్ చిత్రం మాతృక

## "నా దేశం" విజయదశమి కానుక!

ఎన్ టి ఆర్‌తో కె బాపయ్య దర్శకత్వంలో ఎస్ వెంకటరత్నం, కె దేవీవరప్రసాద్ నిర్మించిన వల్లివిదేవీ ప్రొడక్షన్స్ "నా దేశం" చిత్రం విజయదశమి కానుక పరుచూరి సోదరుల రచన, చక్రవర్తి సంగీతం, ఎస్ వెంకటరత్నం ఛాయ, భాస్కరరాజు శిల్పం, కోటగిరి గోపాలరావు కూర్పు తెరవెనుక హంగులు

## శ్రీ పి. పుల్లయ్య పుష్పాభిషేకం!

తెలుగు చలన చిత్ర రంగంతో ఆదినుంచి సన్నిహిత సంబంధంగల ప్రముఖ దర్శక నిర్మాత శ్రీ పి పుల్లయ్య ఈ ఏడు 'రఘుపతి వెంకయ్య అవార్డు' అందుకోబోయే సందర్భంలో మద్రాసులోని ప్రముఖ తెలుగు సాంస్కృతిక సమితి 'కళాసాగర్' పుష్పాభిషేకంతో ఇటీవల ఘనంగా గౌరవించింది ఆ తర్వాత బి నాగేశ్వరరావు మిమిక్రీ, పి బి శ్రీనివాస్ మ్యూజికల్ క్విజ్, రావి కొండలరావు బృందంచే "మొగుడొచ్చాడు" నాటిక సభికులను రంజింపజేసాయి.

'గాజుబొమ్మలు'లో శరత్‌బాబు, సంగీత, గుమ్మడి, నూతన్‌ప్రసాద్





'మనిషికో చరిత్ర'లో సుహాసిని

### "శ్రీవారి శుభలేఖ"

"చీరాల, నర్సరావుపేట పరిసర ప్రాంతాలలో నవంబర్ 12 నుంచి ఒకే షెడ్యూల్‌లో పూర్తి చేయాలనుకుంటున్నాం," అన్నారు గత ఇరవై ఏళ్ళుగా పలు సంస్థలలో ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌గా పనిచేసిన దాసరి పార్థసారథిరావు ఈయన, షేక్ సర్దార్‌తో కలిసి జనప్రియ ఆర్ట్ క్రియేషన్స్ పతాకంలో నిర్మించే పై చిత్రానికి అక్టోబర్ 27న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరుగుతుంది సాయిచంద్, సుమన్, తులసి, కాకినాడ శ్యామల, రోహిణి, రాజనాల, జయశీల వగైరా నటవర్గం షెరీఫుద్దీన్ కథకు కాశీ విశ్వనాథ్ సంభాషణలకర్త చక్రవర్తి సంగీతం, సుఖదేవ్ ఛాయ, డి వెంకట రత్నం కూర్పు నిర్వహిస్తారు

### హిందీలో రెండు తెలుగు చిత్రాలు

అక్టోబర్ 20 నుంచి నవంబర్ 16 వరకు విశాఖ పరిసరాలలో ఒకే షెడ్యూల్లో "శుభలేఖ" హిందీ చిత్రాన్ని కె విశ్వనాథ్ దర్శకత్వంలో పి వి శాస్త్రి నిర్మిస్తారు రాకేష్ రోషన్ (చిరంజీవి), రతీ అగ్నిహోత్రి (సుమలత), ఉత్పల్‌దత్ (సత్యనారాయణ), అశోక్‌కుమార్ (అల్లురామలింగయ్య), అస్రాని (రాళ్ళపల్లి), కిరణ్ విరాళె (తులసి), సుజిత్ కుమార్ (రమణమూర్తి) పాత్రలను ధరిస్తారు జైనేంద్ర జైన్ రచన, ఆర్ డి బర్మన్ సంగీతం, పి ఎల్ రాయి ఛాయ నిర్వహిస్తారు

జంధ్యాల దర్శకత్వంలో డిసెంబర్‌లో మొదలై జనవరిలో షూటింగ్ ముగిసే "ముద్దమందారం" హిందీ చిత్రంలో పద్మినీ కొల్హాపురి నాయిక

## సినిమా

### ప్రేమ పిచ్చోళ్ళు

"తొలి షెడ్యూల్ ఆగస్ట్ 25 నుంచి సెప్టెంబర్ 5 వరకు జరిగింది. సెప్టెంబర్ 16 నుంచి 30 వరకు జరిగే రెండవ షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయిపోతుంది," అన్నారు ఎస్. పి. వెంకన్నబాబు. ఈయన నిర్మాణ పర్యవేక్షణలో ఎం. రమేష్, ఎస్. జయరామారావు నిర్మించే సత్యదేవి కంబైన్స్ "ప్రేమ పిచ్చోళ్ళు" చిత్రంలో చిరంజీవి, రాధిక, గుమ్మడి, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, సుధాకర్, గీత, జయమాలిని, సూర్యకాంతం, పుష్పలత, పి. ఆర్. వరలక్ష్మి, నిర్మల, మాలి పాల్గొంటున్నారు. సత్యానంద్, చక్రవర్తి, వేటూరి, సాయికుమార్, డి. వెంకట రత్నం, ఎస్. నవకాంత్, తార, రవి, ఎస్. బి. చక్రవర్తి, అనిల్‌కుమార్, సత్యం, రాజు తెరవెనుక కృషి చేస్తున్నారు.

### జంధ్యాల దర్శకత్వంలో కొత్త చిత్రాలు

జయకృష్ణ ఆధ్వర్యంలో శాయికృష్ణ కేశవరావు నిర్మించే చిత్రం సెప్టెంబర్‌లో, 'శుభోదయం' నరసింహారావు చిత్రం అక్టోబర్‌లో, "ముద్దమందారం" హిందీ చిత్రం డిసెంబర్‌లో, జ్యోతి ఆర్ట్ క్రియేషన్స్, రవి కళా మందిర్ సంస్థల చిత్రాలు అక్టోబర్‌లో ప్రారంభం కానున్నాయి.

### రాఘవేంద్రరావు దర్శకత్వంలో కృష్ణ, జయసుధ

"డిసెంబర్ 11న షూటింగ్ ముహూర్తం," అన్నారు ఎ. గోపాలకృష్ణ. ఈయన "ఊరుకి మొనగాడు" అనంతరం నిర్మించే గోపీ మూవీస్ ద్వితీయ చిత్రంలో కృష్ణ, జయసుధ, రాధ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య ఆదిగాగల వారుంటారు. సత్యానంద్ రచన, చక్రవర్తి సంగీతం, భాస్కరరాజు శిల్పం, కె. ఎస్. ప్రకాష్ ఛాయతో కె. రాఘవేంద్రరావు దర్శకుడు.

## ఇరుగు - పొరుగు

★ మనదేశంలో తయారైన చిత్రాలలో ఎక్కువ ప్రింట్లు తీయబడిన చిత్రం "షోలే" బొంబాయి ఫిలిమ్ సెంటర్‌లో 500 ప్రింట్లకు పైగా తీయబడ్డాయి ఇదొక రికార్డు [70 ఎం ఎం ప్రింట్లు యు కెలో ప్రాసెస్ చేయబడ్డాయి]

★ "తీసరి ఆంఖ్" చిత్రంలో ధర్మేంద్రకు తన పాత్ర ఎంత బాగా నచ్చిందంటే, మరో సన్నివేశాన్ని చేర్చమనీ, అందుకయ్యే ఖర్చునంతా తానే భరిస్తాననీ నిర్మాతను కోరాడట కాని, విడుదల తేదీ దగ్గరపడినందువల్ల అందుకు వీలుకాకపోయింది

★ "మదరాస్సిలే మోన్" అనే మలయాళ చిత్రాన్ని దర్శక నిర్మాత శశికుమార్ తయారు చేశాడు ఆ చిత్రాన్ని చూసిన పంపిణీదారులు అది గొప్ప హిట్ అవుతుందని విడుదల చేయడానికి త్వరపడ్డారు కాని, 'తిరువల్ల మర్డర్ కేస్'లోని నిందితుడొకడు ఆ చిత్రం విడుదలవకుండా కేరళ హైకోర్టులో రిట్ వేశాడు అది యధార్థ ఖూనీకేసు ఆధారంగా నిర్మింపబడిన చిత్రం గనుక, అది విడుదలైతే – దర్యాప్తును అవకతవకలు పెట్టించగలదంటూ, అసలు సెన్సార్ సర్టిఫికేట్ కూడా ఇవ్వకుండా నిలుపుదల చేయాలని విజ్ఞప్తి చేశాడట ఈ కేసు ఎప్పుడు పరిష్కారమౌతుందో, ఈ చిత్రం ఎప్పుడు విడుదలవుతుందో మరి

★ "టిక్ టిక్ టిక్" చిత్రాన్ని హిందీలో భారతీరాజా దర్శకత్వంలోనే కమలహాసన్ హీరోగా రీనారాయ్ సోదరి బర్ఖారాయ్ నిర్మించబోతోంది

★ ఎనిమిదిసార్లు పెళ్ళిళ్ళు, ఎనిమిదిసార్లు విడాకులు పుచ్చుకున్న సుప్రసిద్ధ పాకిస్థాన్ గాయని నూర్జహాన్ మనదేశంలోనే శేష జీవితాన్ని గడపదలచిందట త్వరలోనే ఔరంగాబాద్‌కు చెందిన వాజిత్ అనే పారిశ్రామికవేత్తను 9వ పెళ్ళి చేసుకోబోతోంది ఈమె కూతురు దేవానంద్ చిత్రంలో నటించబోతోందట

★ వివాహాలు, వివాహ రద్దులు మామూలైపోయిన ఎలిజబెత్ టేలర్ మళ్ళీ తన పాత పెనిమిటి రిచర్డ్ బర్టన్‌తో కలిసి ఓ ఆంగ్ల చిత్రంలో నటించబోతోంది ఆ చిత్రాన్ని నిర్మించేది మెక్ జూనియర్ ఈమె మరో పాత భర్త పుత్రుడు!

★ ఋషికపూర్ భార్య నీతుసింగ్ మళ్ళీ గర్భవతి పుత్రోదయమవ్వాలని రాజ్‌కపూర్ కుటుంబంలోని వారంతా వెయ్యి దేవుళ్ళకు మొక్కుకున్నారట పాపం – రాజ్‌కపూర్‌కు ఇంతవరకు మనమడు కలగలేదు రణధీర్‌కపూర్ పిల్లలిద్దరూ బాలికలే ఋషికపూర్ తొలి సంతానం కూడా ఆడపిల్లే

# సినిమా

## శ్రీ కామాక్షి చిత్ర

''మొదటి షెడ్యూల్ పుత్తూరు ప్రాంతాలలో పదిరోజులపాటు జరిగింది,'' అన్నారు పి శేఖర్ ఈయన కథ, దర్శకత్వంలో వానపల్లి బ్రహ్మాజీ నిర్మించే సైసంస్థ చిత్రంలో మురళీమోహన్, కొత్త నాయిక రంజని, నూతన్‌ప్రసాద్, ప్రసాద్ బాబు, ఈశ్వరరావు, రమణమూర్తి, సాక్షిరంగారావు, జీవా, రమాప్రభ, నిర్మల వగైరా నటవర్గం భరత్ మాటలు, వాసు సంగీతం, హరనాథ్ రెడ్డి ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, గురుస్వామి సహదర్శకత్వం, వి రామసుందర్ నిర్వహణలో ఈ చిత్రాన్ని పట్నాల రత్నం సమర్పిస్తారు




'పరిశ్రమలో ఉన్నవాళ్లకే వేషాలు దొరక్క, ఛస్తుంటే, మీరు ఇలా ప్రకటించడం ఏం బాగోలేదుసార్ !'

## కొన్ని చిత్రాల పేర్లు

ఎ ఎన్ ఆర్ ద్విపాత్రాభినయంతో సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో జాగర్లమూడి రాధా కృష్ణమూర్తి, స్వర్ణ వెంకటనరసింహారావు నిర్మించే విష్ణుప్రియా సినీ కంబైన్స్ ''ప్రతిబింబాలు'' చిత్రం తొలి షెడ్యూల్ 6 నుంచి 20 వరకు అన్నపూర్ణ స్టూడియోస్‌లో జరుగుతుంది

చిరంజీవి, రాధిక జంటగా ఎస్ ఎ చంద్ర శేఖర్ దర్శకత్వంలో మిద్దె రామారావు నిర్మాతగా దామిశెట్టి నళినీ నిరంజనరావు సమర్పించే రాజలక్ష్మి ఆర్ట్ మూవీస్ ''చట్టం ఎవరికోసం'' చిత్రం తొలి షెడ్యూల్ సెప్టెంబర్ 16 నుంచి 22 వరకు జరుగుతుంది 

చిత్రకల్పన ఫిలింస్

# కృష్ణావతారం

బాపు



# అమితాబ్ బచ్చన్-కొన్ని కొత్త విషయాలు!

*చాలా కాలం క్రితం జరిగిన సంఘటన....*

ప్రముఖ రచయిత, దర్శక నిర్మాత కె ఎ అబ్బాస్ ఒక చిత్రంలో ఏడుగురు యువకులను పరిచయం చేయ సంకల్పించాడు జాతి కుల మతాలు వేరైనా, భారతీయులంతా ఒక్కటే — అని చాటే చిత్రమది అంచేత వివిధ భాషలు మాట్లాడేవారిని ఎన్నుకోదలిచాడు ఆరుగురిని ఇట్టే నిశ్చయించాడు ఏడవ యువకుని పాత్ర కోసం ఎందర్నో చూశాడు ఎవరూ నచ్చలేదు చివరికొక రోజున ఓ యువకుని ఫోటోను చూపించాడో మిత్రుడు కుర్తా, పైజామా, జవహర్ జాకెట్‌లో పొడుగ్గా ఉన్నాడా యువకుడు స్ఫురద్రూపి చూపులు తీక్షణంగా ఉన్నాయి ఆ యువకుడ్ని అబ్బాస్ పిలిపించాడు "ఎంతవరకు చదివావ్ ?" అని అడిగాడు

"ఢిల్లీ యూనివర్శిటీలో డిగ్రీ హోల్డర్‌ను," అన్నాడా యువకుడు ఖంగున మోగే కంచు కంఠంతో

"ఉద్యోగమేదైనా చేస్తున్నావా ?"

"కలకత్తాలో ఒక ప్రైవేట్ కంపెనీలో పని చేస్తుండేవాడిని"

"అంటే, ఇప్పుడు పని చేయడంలేదా ?"

"అన్న మాటే కదా ?"

"జీతమెంత వచ్చేది ?"

"పద్నాలుగు వందలు ఉండడానికి క్వార్టర్సు తిరగడానికి కారు కూడా ఇచ్చారు"

"అంతటి ఉద్యోగం వదులుకోవడం అవివేకం కదూ ? అందులో సగం పారితోషికమైనా నేనివ్వలేనే ?"

"ఫరవాలేదు నాకు నటించడానికి అవకాశం దొరికితే చాలు"

"నటనానుభవం ఏమైనా ఉందా ?"

"నాటకానుభవం ఉంది ఒకరిద్దరు నిర్మాతలు మేకప్ టెస్టులు చేశారుకూడా"

"అలాంటి టెస్టుల మీద నాకు నమ్మకం లేదు నటుడ్ని చూడడం, మాట్లాడించడం, నిర్ణయం తీసుకోవడం — నా పద్ధతి"

"ఐతే, నేను ఉండొచ్చా ? వెళ్లిపోవాలా ?"

"ఏమంత తొందర ? ఇంతకీ, నీ పేరు ?"

"అమితాబ్ బచ్చన్"

"సుప్రసిద్ధ హిందీ, ఆంగ్ల లేఖకుడు, బోధకుడు, విద్వాంసుడు డాక్టర్ హర్బాన్స్‌భాయ్ బచ్చన్ నీకేమైనా అవుతారా ?"

"ఆయన మా తండ్రిగారు"

"అలాగా ! అయితే, ఆయనతో సంప్రదించనిదే నిన్ను బుక్ చేసుకోలేను"

"మీ ఇష్టం," అన్నాడు అమితాబ్ నిరాశతో

అబ్బాస్ ఉత్తరం రాస్తే, డాక్టర్ బచ్చన్ "నా కొడుకు మీ శిష్యుడవడంకన్నా నేను కోరుకునేది ఇంకేముంటుంది ?" అని ప్రత్యుత్తరమిచ్చాడు

అబ్బాస్ వెంటనే అమితాబ్‌ను బుక్ చేశాడు

* * *



ఆ చిత్రం తర్వాత అమితాబ్‌కు "పర్వానా" చిత్రంలో చిన్న వేషం దొరికింది తొలినాటి షూటింగ్‌లో అమితాబ్‌తోపాటు సుప్రసిద్ధ కేరెక్టర్ ఆక్టర్ ఓంప్రకాశ్ నటిస్తున్నాడు అమితాబ్ సంభాషణోచ్ఛరణకు ఓంప్రకాశ్ చకితుడవుతూ తన డైలాగ్స్‌ను మరచిపోయి తడబడసాగాడు ఆ మర్నాడు ఈ విషయాన్ని ఓంప్రకాశ్ మరో సెట్‌లో దిలీప్‌కుమార్‌తో "ఉషార్ ! నీకు పోటీగా ఒక కొత్త యువకుడు తయారవుతున్నాడు," అని హెచ్చరికగా చెప్పాడు ఆయన జోస్యం ఫలించింది "జంజీర్" చిత్రంతో "యాంగ్రీ యంగ్‌మేన్"గా వాసికెక్కిన అమితాబ్ "దీవార్" వగైరా చిత్రాలతో సూపర్‌స్టార్ అయిపోయాడు దిలీప్‌తో కలిసి "శక్తి" చిత్రంలో నటించాడు కూడా

* * *

## తెరమీద విచిత్రమైన 'స్లైడ్'!

చిదంబరంలోని "తిల్లై" థియేటర్‌లో ఆ మధ్య ఓ అపురూపమైన 'స్లైడ్'ను చూపించారు అందులో — చిదంబరంలో తప్పకుండా ఈ ఏడు (1982) తాత్కాలికంగానైనా డిగ్రీ కోర్సుకు కొత్త కాలేజ్‌ను ఏర్పాటు చేయిస్తాం అలా చేయలేని పక్షంలో మా ఎం ఎల్ ఎ పదవికి రాజీనామా ఇస్తాం

ఇట్లు,

**కె. ఆర్. గణపతి,** ఎం ఎల్ ఎ

**వి వి. స్వామివాధవ్,** ఎం ఎల్ ఎ

అమితాబ్‌చే అభిమానులే కాక ఆదాయపు పన్ను శాఖవారు కూడా విశేషంగా ఆకర్షింపబడ్డారు అతని చిత్రాలు విడుదలయ్యే రోజున ఆ యా చిత్ర నిర్మాణ కార్యాలయాలపై ఆదాయపు పన్ను శాఖవారు దాడి చేయడం పరిపాటైపోయింది "సుహాగ్" నుంచి "దేశ్‌ప్రేమీ" చిత్రం వరకు ఇలాగే విధిగా జరిగింది "ఖాలియా" చిత్రం నిర్మించిన బాబీ ఎంటర్‌ప్రైసెస్ కార్యాలయంపై రెండుసార్లు దాడి చేయడం కూడా జరిగింది

ఆదాయపు పన్ను చెల్లించడంలో కూడా అమితాబ్ 'సూపర్‌స్టార్' అనిపించుకున్నాడు 1981–82 సం॥కి అడ్వాన్స్ టాక్స్‌గా రూ 17,74,800 చెల్లించాడు 1980–81కి పన్నెండున్నర లక్షలు పన్నుగా కట్టాడని అతని ఛార్టర్డ్ అక్కౌంటెంట్స్ ఎస్ వి వాలే కంపెనీకి చెందిన ఓ ప్రతినిధి తెలియజేశారు

* * *

బెంగళూరులో మన్‌మోహన్ దేశాయ్ చిత్రం "కూలీ" షూటింగ్ హిందీ చిత్రాలకు వ్యతిరేకంగా ఉద్యమం సాగించిన కన్నడ భాషాభిమానులు సైతం ఆ షూటింగ్ చూడ్డానికి హాజరయ్యారు ముఖ్యంగా కన్నడ హీరో డాక్టర్ రాజ్‌కుమార్ పలుకుబడివల్లే బెంగళూరు రైల్వే స్టేషన్‌లో 27 రోజులపాటు నిరాటంకంగా షూటింగ్ జరగడానికి వీలయింది డాక్టర్ రాజ్‌కుమార్ స్వయంగా ఒకసారి ఆ స్టేషన్‌కు వెళ్లి అన్ని సదుపాయాలూ సక్రమంగా లభిస్తున్నాయో — లేవో పర్యవేక్షించి వచ్చారట [ఆ చిత్రం షూటింగ్ సందర్భంలో సహకరించిన బెంగళూరు నగరవాసులకు, హీరో డాక్టర్ రాజ్‌కుమార్‌కు, కర్నాటక రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ గుండూరావుకు, రైల్వే శాఖాధికారులకూ కృతజ్ఞతలర్పిస్తూ నిర్మాత మన్‌మోహన్ దేశాయ్ కొన్ని కన్నడ దినపత్రికల్లో ఫుల్‌పేజ్ అడ్వర్టయిజ్‌మెంట్లు ఇచ్చారు ]

అమితాబ్ యశస్సును చూసి ఏ దుష్టశక్తి ఓర్వలేకపోయింది జూలై 24న బెంగళూరులో ప్రమాదవశాత్తు గాయపడినప్పట్నుంచీ అతని గురించి ఎందరో ఆందోళన చెందారు ధర్మేంద్ర, రాజేష్‌ఖన్నా, శశికపూర్ లాంటి తోటి హీరోలు కూడా తమ బాధను వ్యక్తం చేశారు

బొంబాయిలో ఇరవై రోజుల్లో మూడుసార్లు శస్త్ర చికిత్సలు జరిగిన అనంతరం ఆ సూపర్‌స్టార్ క్రమక్రమంగా కోలుకోగలిగాడు

"ఖుద్దార్" తర్వాత అమితాబ్ పూర్తిచేసిన "శక్తి" చిత్రం అక్టోబర్ 1న విడుదలవుతుంది. "నాస్తిక్" చిత్రంలో కొన్ని సన్నివేశాలకు అతను డబ్బింగ్ చెప్పాలి "కూలీ, మహాన్, అంధాకానూన్" చిత్రాలు పూర్తికావలసి ఉన్నాయి

*[జి. వి. జి.]*




సంగీతం
చక్రవర్తి

ఫొటోగ్రఫీ
ఎస్.వెంకటరత్నం

నిర్మాతలు:
యస్.వెంకటరత్నం, కె.దేవీవరప్రసాద్

దర్శకత్వం:
కె.బాపయ్య

సీరియల్

# ధర్మో రక్షతి రక్షితః

ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ

3

(గత సంచిక తరువాయి)

ఎనిమిది రోజులుగా రోజా ఉపన్యాసాలు కొనసాగుతునే ఉన్నాయి ఆలయంలో. గౌతమ్... కృష్ణానందులతోపాటు కారులో రావటం పోవటం తప్పించి మరేం మాట్లాడటంలేదు.

శ్రీరామ్, పరమేశ్వరుడు, మీనాక్షి వరుసగా గౌతమ్‌ని పలకరించడానికి చేసిన ప్రయత్నాలు వ్యర్థమయ్యేయి. గౌతమ్ గురించి మరికొన్ని వివరాలు సేకరించగలిగేడు. రెండు సంవత్సరాలుగా కృష్ణానందుల్ని సేవిస్తున్నాడని, మొదట్లో వేదాంత చర్చలు వింటూ... పాల్గొంటూ ఉండేవాడిని... తర్వాత పూర్తిగా మాట్లాడటం మానేశాడని, గ్రంథపఠనం... అవధూతల సేవలు చేయటమే అతని కార్యక్రమమని... ఏడాదిగా 'శివోహం' అనే మాట తప్పించి మరేమాట ఉచ్చరించటంలేదని శిష్యులు చెప్పేరు.

వివరాలు వెళ్ళినవాళ్ళ ద్వారా తెలుస్తున్నాయి కాని, లలితాంబ ఆందోళన మాత్రం రోజు రోజుకి ఎక్కువవుతోంది.

"నీ రాయబారాలు ఎంతవరకు సఫలీకృతం అయ్యేయి" అడిగేరు దీక్షితులుగారు.

లలితాంబ కళ్ళనీళ్ళు పెట్టుకుని "ఇన్నేళ్ళుగా మిమ్మల్ని ఏదీ అడగలేదు. మీ మాటకు ఎదురు చెప్పనూలేదు. అగ్నిపరీక్షలకు తట్టుకోగల శక్తి నిత్యాగ్నిహోత్రులు గనుక మీకుండచ్చు, నాకు లేదు. వాణ్ణొకసారి చూడాలని ఉంది. మీరనుమతిస్తే వాణ్ణి దేవాలయాని కెళ్ళి చూసొస్తాను."

దీక్షితులుగారు కొన్ని నిమిషాలు మాట్లాడలేదు. తర్వాత నెమ్మదిగా అన్నారు ఓదార్పుగా,

"లలితా... పుత్రవాత్సల్యం నీకేకాదు నాకూ వుంది. ఏమంటున్నాడు వాడూ."

భర్త ఓదార్పుతో మాతృ హృదయంలో దుఃఖం కట్టలు తెంచుకుంది.

"ఏమనటం ఏమిటండీ! వాడు సన్యాసుల్లో కల్సిపోయేడండి. అన్నలు వెళ్ళేరు. అక్క వెళ్ళింది. ఎవరు వెళ్ళి పలకరించినా పలకటం లేదుట. ఏడాదిగా 'శివోహం' అనే మాట తప్పించి మరేమాట మాట్లాడటం లేదుట."

దీక్షితులుగారు ఆశ్చర్యంగా "ఏమిటినువ్వనేదీ?" అన్నారు.

"అవునండి"

ఆయన కొన్ని నిమిషాలు ఆగి "నువ్వు చెప్పేది వింటుంటే ... వాడు గొప్ప అదృష్టవంతుడన్న మాట" అన్నారు.

"అంతేకాని కొడుకు విరాగి అయిపోతున్నాడనే చింత మీకున్నట్లులేదు."

"మానవ జన్మకు చరితార్థం ఈశ్వర పద సాన్నిధ్యం చెందటం... వాడు మానసికంగా ఈనాడే ఇంత చిన్న వయసులో ఆ మెట్టు ఎక్కగలిగినందుకు మనం గర్వించాలి. ఏ రక్త సంబంధం... కదిలించలేనంత నిగ్రహాన్ని సంపాదించగలగటం పూర్వజన్మ సుకృతం వాడి జాతక ప్రకారం... వాడు ప్రసిద్ధుడు కావాలి... ఈ రకంగా ప్రసిద్ధుడవుతాడేమో"

"మీ సహధర్మచారిణినైనా మీ అంతటి నిగ్రహ శక్తి నాకు లేదు. మీరొకసారి వెళ్ళి అబ్బాయిని కల్సి ఇంటికి రమ్మనండి. మీ మాట కాదనడు. ముందు ఎంతో జీవితముంది. సన్యాసాశ్రమం స్వీకరించడానికి సమయము ఉంది" అందామె వేడుకోలుగా.

"లలితా... ధర్మం ఆలోచిస్తే వెళ్ళటం ధర్మవిరుద్ధం. ఈశ్వర చింతలో ఉన్నవాణ్ణి... ప్రాపంచిక విషయాలపైకి మళ్ళించటం పాపం. అయితే ఇన్నేళ్ళుగా ఏమి కోరని నీ మాట కాదనలేకపోతున్నాను."

"నాకోసమైనా వెళ్ళండి. మీతోపాటు నేను వస్తాను."

"ఒక్క విషయం లలితా..."

"ఏమిటదీ?"

"వాణ్ణి నేను పలకరిస్తాను. వాడు సమాధానం ఇవ్వటానికే ఇష్టపడనప్పుడు, నేనింక బలవంతం చేయను."

ఆమె తలూపింది.

"పద" లేచేరాయన,

శాలువా తెచ్చి అందించింది లలితాంబ.

"పండిత శాలువాకు, పుట్టగోచికి ఒకటే విలువ. అక్కర్లేదు. పద. భుజాలమీద భారం అంతే" అన్నారాయన.

చాలా ఏళ్ళ తర్వాత రోడ్డుమీద కొచ్చిన ఆ దంపతుల్ని ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయేరు జనం.

అపర శివమూర్తిలా ఉన్న దీక్షితులుగార్ని... పార్వతిదేవిలా ఉన్న లలితాంబను పక్కపక్కల నడుస్తుండగా చూసి ఆవేశం ఆపుకోలేని ఒకామె వచ్చి పాదాభివందనం చేసింది.

కొన్ని సంవత్సరాల క్రితం అంతగా జనం ఆశ్చర్యపోయేవారు కాదు కాని ఇప్పుడాశ్చర్యంగానే చూశారు.

వేణుగోపాలస్వామి దర్శనం చేసుకుని మాధవాచార్యులు స్వయంగా ఇచ్చిన తీర్థ ప్రసాదాలు స్వీకరించి మండపంకేసి నడిచేరు దంపతులు.

వేదిక దగ్గరున్న శేషాద్రి చూసి కంగారుగా వచ్చేడు. జన సమ్మర్దం హెచ్చుగావుంది. శేషాద్రి వస్తూనే—

"రండి దీక్షితులుగారు. మా మీద దయ ఉంచేరు. అవధూతలు, అబ్బాయిగారు వచ్చే కాలమయింది" అన్నాడు నమస్కరించి.

దీక్షితులుగారు ప్రతి నమస్కారంచేసి కూర్చోబోయారు.

"మీరిలా ముందుకురండి"

"ఇక్కడ కూర్చుంటాం"

"అలాకాదు తమరు ముందుకు దయచేయాలి" అంటూ బలవంతంగా... దంపతుల్ని వేదిక దగ్గర ఆసీనుల్ని చేశాడు శేషాద్రి.

**జరిగిన కథ — 8** యజ్ఞన్న దీక్షితులు సనాతనుడు. ఆయన భార్య లలితాంబ. వారి సంతానం పరమేశ్వరశాస్త్రి, శ్రీరాముడు, గౌతమ శాస్త్రి, మీనాక్షిలు. పరమేశ్వరశాస్త్రి తండ్రివద్దనే వేదాధ్యయనం చేస్తుంటాడు. శ్రీరాముడు అమలాపురంలో చదువుకొంటానంటాడు. దీక్షితులు పెద్దకుమారుడు పరమేశ్వరశాస్త్రికి, ధూళిపాళ సోమయాజులు ప్రథమ పుత్రిక సుబ్బలక్ష్మికి బాల్య వివాహం జరిపిస్తారు. గృహప్రవేశం అనంతరం పనిలో పనిగా గౌతమ శాస్త్రికి ఉపనయనం కూడా జరిపించేస్తారు దీక్షితులుగారు. సోమిదేవమ్మ మరణంతో ఓ తరం మారిపోతుంది. శ్రీరామ్ ఎస్. ఎస్. ఎల్. సి పాసవడంతో పాలిటెక్నిక్ చదువుతానంటాడు. దీక్షితులుగార్కి ఇష్టం లేకపోయినా లలిత నచ్చ చెప్పడంతో అంగీకరిస్తారు. తన చదువు అయ్యేవరకూ పెళ్లి చేసుకోనని తండ్రితో ఖచ్చితంగా చెప్పేస్తాడు శ్రీరామ్. తన కూతురి పెళ్లి కోసం అప్పు కోసం ఆనందరావ్ దగ్గరకు వెళ్లిన దీక్షితులు ఎన్నడూ ఊహించని విధంగా అవమానం పాలౌతాడు. శ్రీరామ్ చదువు పూర్తయినా రికమెండేషన్, డబ్బూ లేకపోవడంతో పాటు కులం పెద్దదవడంవలన వుద్యోగం రాదు. హరిజనుడయిన ఏడుకొండలుకు ఉద్యోగం వస్తుంది. అదే ఉద్యోగం కోసం అప్లైచేసిన, అన్నింటిలో అతనికంటే ఆధిక్యతలో వున్న శ్రీరామ్‌కు మాత్రం కులం కారణంగా రాదు. కృష్ణశాస్త్రి కూతురు వివాహ విషయమై దీక్షితులు తమ ఇంటిని భైరవమూర్తికి స్వాధీనపు తనఖా ఇచ్చి శర్మగారింట్లో అద్దెకుంటుంటారు. గౌతమశాస్త్రి కృష్ణానందులవారి శిష్య బృందంలో చేరతాడు. గౌతమ్‌ని తీసుకురావడానికి వెళ్తాడు శ్రీరామ్.

కృష్ణానందులువారు వచ్చేరనే వర్తమానం విని శేషాద్రి హడావిడిగా బయటకెళ్ళేడు.

అంతా లేచి నిలబడ్డారు గౌరవపూర్వకంగా. ముందు కృష్ణానందులు వెనుకగా గౌతమ్‌శాస్త్రి వస్తున్నారు. జనం కొంతమంది లేచి కృష్ణానందులకు...వెనుకగా వస్తున్న గౌతముడికి పాదాభివందనం చేయటం మొదలు పెట్టేరు. వారిని చూసి మరి కొంతమంది లేచేరు.

"అయ్యా ఉపన్యాసం పూర్తయిన తర్వాత... అమ్మా... తర్వాత..." వారించేడు శేషాద్రి.

దీక్షితులుగారు, లలితాంబ చూస్తూ నిలబడి పోయేరు.



కృష్ణానందులు తమ ఆసనాన్ని అలంకరించేరు. కుడివక్క దిగువగా పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు గౌతమ్. దీక్షితులుగారు వేదికకు ఎడమవక్క కూర్చుని ఉన్నారు. ఆయన గౌతమ్‌కేసే చూస్తూ ఉండిపోయేరు.

శేషాద్రి మెల్లిగా ఏదో కృష్ణానందులవారితో మాట్లాడి, మైకు ముందుకొచ్చి—

"భక్తకోటికి నమస్కారములు... ఈనాటి కృష్ణానందుల మహోపన్యాసానికి ముందుగా... ప్రఖ్యాత వేదపండితులు, అపర శివమూర్తులు... మన గ్రామవాసులు, కృష్ణానందుల ప్రియశిష్యులైన గౌతమ్‌గారి జనకులు అయినటువంటి శ్రీ బులుసు యజ్ఞన్న దీక్షితులుగారి వేదపఠనం జరుగుతుంది" అన్నాడు.

కరతాళధ్వనులు మిన్నుముట్టేయి.

దీక్షితులుగారు ఇబ్బందిగా చూశారు శేషాద్రి వైపు.

శేషాద్రి లేచిరమ్మని పిలిచేడు.

కృష్ణానందులు దీక్షితులుగారికేసి తిరిగి "మేం గుర్తు ఉన్నామా దీక్షితులుగారు" పలకరించేరు.

దీక్షితులుగారు వినయంగా లేచినిలబడి నమస్కరించేరు. "చిత్తం, ఎంత మాట సెలవిచ్చేరు."

"ఎంతో కాలమయింది మీ వేదపఠనం విని. పైగా గౌతమ్ జనకులు మీరేనని నా కింతవరకు తెలియదు. శుభం. ఇక మీ వేదపఠనంతో సభా ప్రారంభం చేయమని కోరుతున్నాం."

"తమరు కోరడమా ? మీ ముందు నా అల్ప ప్రతిభను ప్రదర్శించే అవకాశం కల్గించినందుకు ధన్యవాదములు" అంటూ దీక్షితులుగారు గొంతు సవరించుకుని వేద పఠనం ప్రారంభించేరు.

లలితాంబ చూపులన్నీ గౌతమ్ మీదనే ఉన్నాయి. అతను తండ్రి నిలబడగానే తలతిప్పి... వాళ్ళకేసి చూశాడు. కాని అతనిలో ఏ భావ సంచలనాన్ని ఆమె గమనించలేక పోయింది.

'వీడికేం వెర్రి పట్టలేదు కదా ... మమ్మల్ని అసలు గుర్తు పట్టేడా ?' అనుకోకుండా ఉండలేక పోయిందామె.

వేదపఠనం పూర్తయింది.

సభకు, కృష్ణానందులుకు నమస్కరించి దీక్షితులుగారు కూర్చున్నారు.

"దీక్షితులుగారి నోటివెంట వెలువడిన వేద సుధలో మన మందరం ఇంతదనుక ఈదులాడేం... వారికి సభ తరుపున... సత్కారం..." అంటూ కృష్ణానందులు సాభిప్రాయంగా శేషాద్రికేసిచూశారు.







నూట పదహార్లు తాంబూలంలో ఉంచి దీక్షితులుగారికిచ్చేడు శేషాద్రి

దీక్షితులుగారు తాంబూలం భార్యచేతికిచ్చి అందులో ఉన్న నోట్లను అందుకుని—

''కృష్ణానందులువారు నా చిన్న కోరికను మన్నించమని వేడుకుంటున్నాను'' అన్నారు

''మనవి చేయండి''

''నేనిక్కడకు తమ దర్శనార్థం వచ్చేను తమరి మాట కాదనలేక తమముందు నాలుగు ముక్కలు పలుక సాహసించేను గనుక ఈ ధనాన్ని తమరు నిర్వహించే వేదపారశాల నిమిత్తం ఖర్చు చేయాల్సిందిగా కోరుతున్నాను'' డబ్బు వేదిక దగ్గరుంచేరు దీక్షితులుగారు

ఉపన్యాసం పూర్తయిన తర్వాత కృష్ణానందులు వారు లేచేరు భక్తులు ముందుకొచ్చి వారికి, మరికొందరు గౌతమ్‌కి, కొద్దిమంది దీక్షితులుగారి దంపతులకు పాదాభివందనం చేశారు

కృష్ణానందులు బయటకు నడిచేరు గౌతమ్ నిర్వికారంగా అనుసరిస్తున్నాడు

''గౌతమా '' ఉద్వేగాన్ని అణచలేని లలితమ్మ పిల్చింది అతను వెనక్కి తిరగలేదు

కృష్ణానందులు మాత్రం వెనక్కి తిరిగేరు ''గౌతమా మీ మాతృదేవులు పిలుస్తున్నారు ఒక గడియ ఆగి రా '' అన్నారు

గౌతమ్ ఏం మాట్లాడలేదు అంతా వీళ్ళకేసే చూస్తున్నారు గౌతమ్ ఆగిపోయేడు

కృష్ణానందులు వెళ్ళిపోయేరు వారితో చాలామంది బయటకు నడిచేరు కొద్దిమంది గోనెలు మడతపెడుతున్నారు, మైకులు సర్దుతున్నారు

కొద్దిసేపు మౌనంగా ముగ్గురూ నిలబడ్డారు గౌతమ్ చూపులు ఆలయ శిఖరాన్ని చూస్తున్నాయి

సద్దుమణిగిన తర్వాత దీక్షితులుగారు మెల్లిగా అన్నారు ''అమ్మ నీతో మాట్లాడాలని వచ్చింది ''

లలితాంబ కొడుకు చేతిని అందుకుని ''ఏరా ? ఏమిటిదీ '' అంది

గౌతమ్ ముందు కడుగేశాడు

''గౌతమా ''

''గౌతమశాస్త్రీ ''

''ఒరేయి''

అతని నోటివెంట ఏ మాట వెలువడలేదు అతను వెళ్ళిపోతూనే ఉన్నాడు సగం వెలుతురు,

# ధర్మో రక్షతి రక్షితః

సగం చీకటి ఉన్న మంటపంలో నిలబడిపోయేరా దంపతులు

## 4

పరమేశ్వరశాస్త్రి ఇంటికొస్తూనే ''అమ్మా ! కృష్ణానందులువారితో తమ్ముడు వెళ్ళిపోలేదుటే'' అన్నాడు

''నిజంగా ?'' ఆశ్చర్యంగా అడిగింది లలితాంబ

''అవునమ్మా ! కారులో అంతా బయల్దేరేరుట ఊరి చివర జడలమర్రి దగ్గరకు రాగానే 'శివోహం' అన్నాడట తమ్ముడు కారు ఆగిందిట కారులోంచి దిగి మర్రిచెట్టు క్రింద కూర్చుండిపోయేడట అంతా రమ్మని అడిగితే 'శివోహం' అని మాత్రం ప్రత్యుత్తరమిచ్చేడట కృష్ణానందులు కాస్సేపు చూసి తమ్ముణ్ణి వదిలి ముందుకు సాగిపోయేరట వాడు 'శివోహం' అంటూ అక్కడే కూర్చుని జపం చేస్తున్నాడట ఊరంతా కధలు కధలుగా చెప్పుకుంటున్నారే ''

కొడుకు ఊరు దాటిపోనందుకు ఆనందించాలో, ఇంటికి రానందుకు విచారించాలో తెలియక లలితమ్మ నిట్టూర్చింది

పరమేశ్వరుడు అక్కడనించి వంటింటికేసి నడిచేడు సుబ్బలక్ష్మి చేటలో మూడు గుప్పెళ్ళ బియ్యం ఉంచుకుని ఏరుతోంది

''ఇది విన్నావుటే''

''విన్నాను ఇప్పుడే రత్నం చెప్పింది అదిసరే ఇంతకీ మీరెళ్ళిన పని ఏమయిందీ ?''

''కాలేదు షావుకారు కొట్లో లేదు వాడి కొడుకున్నాడు వాడివ్వడు అయినా అరువు అడగటానికి ముందు మనం సగం చావాలి'' చిరాకుగా అన్నాడు పరమేశ్వరుడు

''ఈ బియ్యం పసిబిడ్డలకైనా చాలవే ''

పరమేశ్వరుడు అశక్తుడిలా తలవాల్చుకుని ''నేనేం చేయనే నా కేడుపొస్తోంది నా పాటి ముక్కరాని ప్రతివాడు ఘనాపాటిలా ధబాయించి, యజమానులకు అడుగులకు మడుగులొత్తుతూనైనా ఒక కుటుంబాన్నేం ఖర్మ రెండేసి కుటుంబాల్ని ఈడుస్తున్నాడు ముక్కరాని వాళ్ళు కుక్కదానమైన పట్టి కుటుంబ పోషణ చేసుకోవాలన్న సూక్తి నిజం చేస్తున్నారు నిన్న రత్నం మొగుడు కామశాస్త్రి తద్దినానికి వెళ్ళేడుట జీవపితృడు వెళ్ళకూడదన్నది ఆచారం లేకుంటే నేనూ భోక్తగా వెళ్ళయినా నా కుటుంబాన్ని పోషించుకుందును ''

భర్త మాటలకు కరిగిపోయింది సుబ్బలక్ష్మి కాని ఆమెకేం గత్యంతరం తోచలేదు

''ఒక పని చేయండి ''

''ఏమిటదీ ?''

''తిట్టరు కదా''

''చెప్పు ఏంటే ?''

''సుమంగళినైన, నేనీ మాట అనకూడదు కాని ఆడదాన్నయి ఉండి చూస్తూ చూస్తూ వృధాప్యంలో ఉన్న అత్త మామల్ని, పసిపిల్లల్ని ఆకలితో ఉంచలేను ''

''ఏమిటి నువ్వనేదీ ?''

''దీంట్లో ఒక సూత్రం తీసికెళ్ళి ఎక్కడైనా తాకట్టు పెట్టండి ఇంతకన్నా గత్యంతరం లేదు'' అంది మంగళ సూత్రాలు పమిటలోంచి తీస్తూ సుబ్బలక్ష్మి

## పనిమత్తు !

కొందరు సారాయి, ఇతర మత్తు మందులకు దాసులౌతున్నట్లు మరికొందరు అధిక శ్రమకు బానిసలౌతున్నారని హనోవర్ లోని ప్రముఖ మానసిక శాస్త్రవేత్త ప్రొఫెసరు హెర్మన్ డీజ్ తెలియచేశారు వీరిని ''వర్క్‌హాలిక్స్'' అని పిలుస్తూ, పనిమత్తు వలన ఏర్పడే విపరీతాలను ఆయన ఒక వ్యాసంలో వివరించారు మొదట్లో ఈ పని మత్తు నిరపాయకారంగానే వుంటుంది అధిక శ్రమ కోర్చడం, పట్టుదల, చేపట్టిన పనిలో విజయం సాధించడం, కొంతమేరకు అత్యాశ వీరి సాధారణ లక్షణాలు చివరకు కుటుంబ, వ్యక్తిగత అభిరుచులను, ఆసక్తిని నిర్లక్ష్యం చేశామనే భావన వీరిలో ఏర్పడుతుంది అయితే దీనిని ససేమిరా వారు అంగీకరించరు వీరిలో ఆత్మస్థైర్యము ఎక్కువ కానీ శారీరకంగా బలహీనులౌతుంటారు దీనికి చికిత్స లేకపోలేదు అయితే యిది వీరు డాక్టరుతో సహకరించే తీరుపై ఆధారపడి ఉంటుంది

దెబ్బ తిన్నట్లు చూశాడు పరమేశ్వరుడు తర్వాత కోపంగా చూసి "భార్య మంగళసూత్రాలమ్మి తినమనా నువ్వు నాకు చెప్పేది" అంటూ వినవిసా నడుస్తూ వీధిలోకి నడిచేడు

పరమేశ్వరుడు కోపంగా వీధిలో కొచ్చేడే కాని అతనికేం చేయాలో తోచలేదు తనకెంత లేదన్నా కొన్ని పౌరోహిత్యాలున్నాయి అందులో ఎవరైనా అప్పో దానమో అడిగితే! కార్యక్రమాలు లేనప్పుడు తనెప్పుడు ఎవర్ని ఏమి అడగలేదు ఈవాళెలా అడగటం తీరా అడిగిన తర్వాత వాళ్ళిస్తారో ఇవ్వరో తండ్రి కిచ్చిన తాంబూలం మళ్ళా కృష్ణానందుల వేద పాఠశాల కివ్వకుండా ఉండి ఉంటే బాగుండునేమో

ఒకళ్ళిద్దరు నమస్కరించేరు ప్రతినమస్కారం చేస్తూ నడుస్తున్నాడు 'వచ్చే మాసం కాని లగ్నసరి ప్రారంభం కాదు ' అనుకుంటూ నడుస్తున్నాడు

గుడిశల ముందు కార్లు ఆగి ఉన్నాయి క్రైస్తవ మత ప్రచారకులు కారు దిగివెళ్ళి తెలుగు ఇంగ్లీషు కలగలిపి మత విస్తరణ కోసం ప్రయత్నం చేస్తున్నారు వాళ్ళకేసి చూస్తూ నిలబడ్డాడు పరమేశ్వరుడు

"ఏం పంతులూ వాళ్ళలో చేరిపో బోలెడు డబ్బిస్తారు ఇందులో అయిపోయిందిగా ఇక అందులో మతగురువై మళ్ళా డబ్బు లాగేయచ్చు"

పరమేశ్వరుడు టక్కున వెనక్కి చూశాడు ఎవరో కుర్రాడు గుంపులో కల్సిపోయేడు పదిమంది కుర్రాళ్ళున్నారక్కడ, అంతా నవ్వేరు

పరమేశ్వరుడేం మాట్లాడలేదు

మతమంటే ఎంత అవహేళన బ్రాహ్మణుడంటే ఎంత చిన్నచూపు? ఆ మాట అన్నవాడెవడో వాళ్ళింట్లో శుభ కార్యానికి, అశుభకార్యానికి బ్రాహ్మణ్ణి పిలవకుండా జరపడే మరెందుకంత వేళాకోళం?

వీళ్ళు బాధపడేది చిత్రమైన మానసిక సంఘర్షణతో నమ్మకాల్ని, ఆచారాల్ని పూర్తిగా విశ్వసించనూలేరు అలా అని త్రోసిరాజనే ధైర్యమూలేదు అందుకే చిత్రం చెప్పాలమీద భక్తి దేవునిమీద ఉంచే ప్రయత్నం అటు చెప్పాలు ఇటు భక్తి రెండూ చంక నాకి పోతున్నాయి ఈ బ్రాహ్మడే లేకుంటే మనో నిబ్బరాన్ని తెచ్చుకోగలమనే ప్రయత్నం కాబోలు కులాలు పోవాలి నిజమే కులాల అడ్డుగోడలు నిర్మించుకుని తన పరిధిని మరీ ఇరుకు చేసుకుంటున్నాడు మానవుడు కులాలు నశించాలి బ్రాహ్మణ కులం నశించాలి

'బ్రాహ్మల లొకాలిటీలో ఇల్లు చూడవోయ్'

'మా యింట్లో వచ్చేళ్ళు బ్రాహ్మల్లాగే పెట్టుకుంటాం'

'మా యింట్లో మడీ ఆచారం బ్రాహ్మల్లాగే నండోయ్'

ఈ మాటలన్నీ తను వినేవే బ్రాహ్మణ, బ్రాహ్మణ అనే వాళ్ళందరికీ బ్రాహ్మణకులం పట్ల మక్కువా కాదే బ్రాహ్మణుల్ని అసహ్యించుకునే వాళ్ళుకూడా ఈ మాట వాడుతుంటారు అంటే బ్రాహ్మణ అనేది వాళ్ళ పద ప్రయోగం మంచి, ఆరోగ్యమైన ఆచారం ఇవన్ని దృష్టిలో ఉంచుకొని పలికిన మాటలే కదా

బ్రాహ్మణత్వం అంటే మంచి, ఆరోగ్యమైన,

## ధర్మో రక్షతి రక్షితః

ఆచారమైన, సహనమైన, ఉత్తమమైన, ఇలా ఎన్నో సుగుణాలు మూర్తీభవించిన మానవుడు కదా బ్రాహ్మణుడు దీనికి బ్రాహ్మణ కులం అని పిలవబడుతున్న తావులో పుట్టిన వాణ్ణే బ్రాహ్మడనక్కర్లేదు

బ్రాహ్మణుడనేమాట ఉత్తమ లక్షణాలు మూర్తీభవించిన మానవుడికి పర్యాయ పదం సర్వమానవులు బ్రాహ్మణులు కావాలని ఉపనిషత్తులు చెపుతున్నాయి

భాగవతంలో వంశవృక్షం చెబుతూ ఫలానా రాజుకి ఫలానా రాజు పుట్టేడని ఆ ఫలానా రాజుకి పుట్టినవాడు బ్రాహ్మణుడయ్యేడని ఉంది కదా

అంటే క్షత్రియ కులంలో పుట్టి ప్రజలనే బ్రాహ్మణ కులంలో కల్సిపోతాడు దాన్నిబట్టే అర్థం అవుతోంది అందుకే బ్రాహ్మణ కులం నశించాలి బ్రాహ్మణుడు బ్రతకాలి, బ్రాహ్మణత్వం వర్థిల్లాలి

ఏపిటీ ఆలోచనా ప్రవాహం? తనకు కావాల్సింది అప్పు! అంతేకాని మానసిక చర్చలు కావే నడక వేగం పెంచేడు గమ్యనిర్దేశం లేదతనికి

"పరమేశ్వరశాస్త్రిగారూ" వెనకనించి పిలుపు వినిపించింది

పరమేశ్వరుడు ఆగి వెనక్కి చూశాడు

తొందరగా నడుచుకుంటూ వచ్చి కల్సేడు శేషాద్రి

"మీరొకసారి ఆలయానికి రండి వేణుగోపాలస్వామికి అర్చన చేయించాలి అమ్మాయి, అల్లుడు వచ్చేరు మీరు దగ్గరుండి జరిపించాలి ఎవరు చేయించినా మీరుగాని మీ తండ్రిగారుకాని చేయించిన తృప్తి నాకుండదు"

"అలాగే ఎప్పుడూ"

"ఇప్పుడే ఇంటినించి వస్తున్నాను మీరు బజారుకెళ్ళేరని చెప్పేరు"

"మీ అభిమానం పదండి" అన్నాడు పరమేశ్వరుడు

'ఈశ్వరానుగ్రహం అంటే ఇదే' మనసులో సర్వేశ్వరుడికి నమస్కరించేడు పరమేశ్వరుడు

(ఇంకా వుంది)

# ఓ సీతాపతి కథ - బేహరా వెంకట సుబ్బారావు

సీతామహాలక్ష్మి భరించలేని శిరోవేదనతో బాధ పడ్తోందన్న వార్త తెల్లవారేసరికి ఆ వాడంతా వ్యాపించింది ఆ వార్త విన్న తరుణీమణులందరూ తల్లడిల్లిపోయారు వెంటనే వెళ్లి ఆమెను చూడాలని, చూసి పలకరించాలనీ, పలకరించి తమ ఆవేదనను వ్యక్తం చేయాలనీ అనుకొన్నారు పనుల్లో మునిగి వున్న పడతులు తమ గృహకృత్యాలు చేసుకోలేక కాలు చేయీ ఆడక విలవిల్లాడిపోయారు

గవర్నమెంటు డాక్టరుగారి సతీమణి గౌరీదేవి తెల్లవారేసరికి భర్తను నిద్రలేపింది అర్థాంగి అభ్యర్థన విని ఆపై ఆమె పోరు పడలేక గాడ్రెజ్ ఆల్మరా తెరిచారు అత్యంత పవరుగల మాత్రలను తీసి యిచ్చారు టాబ్లెట్ లోనికి వెళ్లి తలనొప్పిని బయటకు విసిరివేస్తుందని గ్యారంటీ ఇచ్చారు ఫారెస్టు రేంజరుగారి భార్య పార్వతి బంట్రోతు లబుడిగాణ్ణి పిల్చింది కావడితో నీళ్లు తెస్తున్న వాణ్ణి ఆ పని ఆపమంది అర్జంటుగా అడవిలోకి వెళ్లమంది పర్నాది ఆకులు తెమ్మని ఆజ్ఞాపించింది ఆ ఆకు పసరు నాలుగు చెంచాలు తీసుకొంటే తలనొప్పి మరు క్షణంలో మాయమౌతుంది అయిదు నిముషాల్లో తేవాలని ఆజ్ఞాపించింది హైస్కూలు హెడ్మాష్టరు గారి భార్య అమృతాంజనం సీసాకోసం కాళ్లు పడి పోయేలా వెతికి విసిగినా తన ప్రయత్నం మానలేదు చివరికి ఆఖరబ్బాయి బాబిగాడి బట్టల పెట్టెలోంచి బయటకు తీసి సీతామహాలక్ష్మి ఇంటికి వెళ్లింది మొట్టమొదటి విజిటర్‌గా హెడ్మాష్టరుగారి సతీమణి హైమవతి

సీతామహాలక్ష్మి మినిష్టరుకాదు మినిష్టర్ గారి భార్య అంతకన్నాకాదు ఆఫీసరు అసలే కాదు మామూలు ప్రభుత్వోద్యోగి, ఒక ఎకౌంటెంట్ భార్య మాత్రమే శిరోవేదనతో బాధపడ్తోంది

* * *

విశాఖపట్నం జిల్లాలో అదొక ఏజన్సీ గ్రామం చుట్టుపక్కల వున్న పాతిక ముప్పై గ్రామాలకు అది కేంద్రం బస్సు మార్గంలో వుంది ఆ గిరిజన గ్రామం గిరిజనాభివృద్ధి కోసమూ, అటవీ సంపద పరిరక్షణకోసమూ, భూసార పరిరక్షణకొరకూ, మలేరియా నిర్మూలనకొరకూ ఇంకా అనేకానేక కార్యాలయాలను ఆ గ్రామంలో నెలకొల్పింది ప్రభుత్వం ప్రభుత్వ ఆసుపత్రి, వ్యవసాయ డిప్యూటీ డైరెక్టరుగారి ఆఫీసు, స్టేట్ బ్యాంక్, పోస్టాఫీసు మొదలైన ఆఫీసులున్నాయ్ అది తాలూకా కేంద్రం కూడా ఆ గ్రామాన్ని కాలనీ అని పిలుస్తారు కూడా చిన్నా పెద్దా మొత్తం రెండువందలమంది వరకూ ప్రభుత్వోద్యోగులుంటా రక్కడ

గిరిజన ప్రాంతంలో వున్నా ఆ కాలనీలోని జనాభాలో ఎక్కువ శాతం గిరిజనేతరులే ! ఉదయం ఎనిమిదిగంటలు అయితేగాని సూర్యోదయంకాదు సాయంత్రం అయిదుగంటలకల్లా చీకటి పడుతుంది అక్కడవారికి ఎంటర్‌టైన్‌మెంటులేదు ఓ సినిమా హాలు అయినా లేదు ముప్పైమైళ్ల ప్రయాణం చేసి కొండ దిగితే సినిమాహాలు వుంది అందుకే అక్కడి వుద్యోగస్తులందరూ కల్సి ఒక రిక్రియేషన్ క్లబ్ ఏర్పాటు చేసుకొన్నారు సాయంత్రం అయిదు నుంచి ఏడూ, ఎనిమిది గంటల వరకూ అక్కడ కాలక్షేపం చేసి యిళ్లు చేరుకొంటారు

మరి మహిళల సంగతి ? భోజనాలుపెట్టి పది గంటలకల్లా భర్తలను ఆఫీసులకి సాగనంపుతారు పిల్లలను స్కూళ్లకు పంపుతారు లన్నీ సర్దుకొనే సరికి పదకొండు గంటలు దాటుతుంది ఆ తర్వాత ఖాళీ కొంతమంది పుస్తకాలతోనూ, రేడియోతోనూ కాలక్షేపం చేస్తారు కొంతమంది మహిళలు మధ్యాహ్నంపూట ఒకరింట సమావేశం అవుతారు పిచ్చాపాటి కబుర్లు దొర్లుతాయ్ అలా సమావేశం అయే యిల్లే సీతామహాలక్ష్మి యిల్లు వారి కబుర్లు పనిమనిషి పాపమ్మ నుంచి మొదలుపెట్టి గెజిటెడ్ ఆఫీసర్ల ట్రాన్స్‌ఫర్ల దగ్గర గెంతువేసి, ఫారెస్టాఫీసర్ లంచగొండితనం వరకూ పరుగెత్తి ప్రధానమంత్రి విదేశ పర్యటనవరకు ఎగురుతాయ్

ఇంకా — పెళ్లయి పదేళ్లయినా కడుపు పండని సద్దు బ్రహ్మచారి ఫారెస్టరు పాపారావు యింట్లో పనికి కుదిరిన నెల రోజులకే నెల తప్పిందనీ — సరస్వతి మొగుడు మలేరియా యినస్పెక్టర్ చెంద్రరావ్ రోజూ రాత్రి బాగా తాగొచ్చి పెళ్లాన్ని చితకబాదుతాడనీ — ఇద్దరు పెళ్లాల మొగుడు హాస్టలు వార్డెన్ హైస్కూలుకి కొత్తగా వచ్చిన హిందీ పంతులమ్మతో సరసాలు మొదలుపెట్టాడనీ— భర్త వేసక్టమీ ఆపరేషన్ చేయించుకొన్నా వనజమ్మ మళ్లీ నెలతప్పిందనీ, సంక్రాంతి శలవులకి విశాఖపట్నం వెళ్తున్నానని అందరితో చెప్పినా కడుపు తీయించు కొందుకే వెళ్తోందనీ — హెడ్మాష్టరుగారి అల్లుడు పండక్కి రాకపోవడం హైదరాబాద్ ట్రైనింగ్‌కి వెళ్లడం కాదనీ, అతను కోరిన టూ—ఇన్ వన్ కొనకపోవడమే కారణమనీ — ఫారెస్టు రేంజరుగారి భార్య పార్వతీబాయి కంచిలో కొన్న పట్టుచీర మంచి రకం కాదనీ, ఆరు వందలు పెట్టి కొన్నామనీ అంటున్నా మూడొందలు దాటదనీ — జానకమ్మ చేయించుకొన్న పుస్తెలతాడు తులంబావే అయినా రెండు తులాలని చెప్పకొంటోందనీ

ఇత్యాది ఆశక్తికరమైన విషయాలు ఆయా పడతుల పరోక్షంలో చెప్పి చాకచక్యంగా అక్కడకు చేరిన అతివలను ఆకట్టుకొంటుంది సీతామహాలక్ష్మి అంతే కాదు —

ఎవరి మొగుడు ప్రావిడెంటు ఫండునుంచి ఎంతెంత ఎడ్వాన్సు తీసుకొన్నదీ, ఎలా ఖర్చు చేసిందీ, ఫారెస్టు కంట్రాక్టర్ ఆఫీసరుకు ఎంత మామూలు చెల్లించిందీ, డాక్టరుగార్కి, డెప్యూటీ డైరక్టర్ గార్కి మధ్య వున్న అభిప్రాయ బేధాలు ఎంతవరకు వెళ్లిందీ, తన దారికి అడ్డు వస్తున్నాడని యూడీసీ అప్పారావుని తాసిల్దారే ట్రాన్స్‌ఫర్ చేయించాడనీ, సెండాఫ్ పార్టీలో అతన్ని పొగుడ్తూ అన్న మాటలు అన్నీ నటనకే అనీ — ఫారెస్టు రేంజరు శలవులో వుండటం కాదు సస్పెన్షన్‌లో వున్నాడనీ

ఇత్యాది ఆఫీసు విషయాలూ ఆమె కెన్నో తెల్సు ! ఆ విషయాలు ఆమెకెలా తెల్సాయో తెలియని తరుణులు ఆనందాశ్చర్యాల్లో మునిగితేలూ వుంటారు వింటారు ! వినోదిస్తారు !!

ఒక్కోప్పుడు చిన్న చిన్న తగవులూ తంటాలూ వస్తువుంటాయి అయినా చాకచక్యంగా తప్పు కొంటుంది, యితరులను తప్పిస్తుంది అది ఆ సీతా మహాలక్ష్మిలోవున్న మహిమే అనండి ప్రత్యేకతే అనండి

* * *

సీతామహాలక్ష్మి మొగుడు ఒక ఆఫీసులో యూడీ ఎకౌంటెంట్ ! పేరు సీతాపతిరావు ! ''సీతాపతి'' అని పిల్చినా పలుకుతాడు అతిసౌమ్యుడు ఏ చెడు అలవాట్లులేని మనిషి ! కనీసం చెక్క ముక్కయినా వేసుకోడు ఆఫీసు అయాక అయిదు గంటలకి రిక్రియేషన్ క్లబ్‌కిపోతాడు ! పేపరు చూస్తాడు పార్ట్నర్ వుంటే కొంతసేపు చదరంగం ఆడ్తాడు అందరికన్నా ముందు ఆరున్నర అయే సరికి యిల్లు చేరుకొంటాడు సీతాపతిరావు పనిచేసే ఆఫీసులోనే ఆఫీసు సూపర్నెంటు శశిభూషణరావు అంటే శశికళగారి భర్త ఆ క్లబ్‌కి శక్రటరీ ! శక్రటరీ కాబట్టి అతను యిల్లు చేరేసరికి ఎనిమిది గంటలు దాటుతుంది అందరితోనూ కల్సికట్టుగా సరదాగా ఉంటాడు శశిభూషణరావు ఆయనకు నలుగురు సంతానం పెద్దబ్బాయి బి టెక్, రెండో అబ్బాయి మెడిసిన్ సెకండియర్, మూడోవాడు ఇంటర్ ఫస్టియర్ వాల్తేరులో చదువుతున్నారు ఆఖరున అమ్మాయి హైస్కూల్లో పదోక్లాసు చదువుతోంది భర్తపోయిన చెల్లెల్ని విశాఖపట్నంలో పిల్లల దగ్గర వుంచి చదువు చెప్పిస్తున్నారు మేనల్లుడ్నిగూడా ఇంటర్ చదివిస్తున్నారు జీతం తప్పించి వేరే ఆస్తిపాస్తులులేవు అన్యాయపు ఆర్జనకు ఆమడ దూరంలో వుంటారు అందుకే ఆయనంటే అందరికీ గౌరవం

ఆ రోజు రాత్రి భర్తను అడిగింది శశికళ ''ఏవండి క్రిందటి నెల్లో రెండువేలు ప్రావిడెంట్ ఫండ్ లోన్ తీసుకున్నార్ట !'' అని నాతో చెప్పారు కాదేం ? అన్న ప్రశ్న ధ్వనించింది ఆ కంఠంలో

ముప్పయ్ సంవత్సరాల క్రితం కాపరానికి వచ్చినా ఏనాడూ అటువంటి విషయాలు అడగని భార్య ఆ క్షణం అలా అడిగినందుకు ఆశ్చర్యపోయాడు

''తీసుకొన్నారా ?'' మరలా అడిగింది శశికళ

''నీ కెవరు చెప్పారు ?'' అడిగాడు ఆశ్చర్యాన్నుంచి తేరుకొని శశిభూషణరావు

''ఎవరు చెప్పిందీ తర్వాత చెబుతాకానీ తీసుకొన్నారా లేదా ?'' నిగ్గదీసి అడిగింది మరోసారి

ఆనాటి భార్య ధోరణికి విస్మయం చెందాడు శశిభూషణరావు

"మన పిల్లలకి ఆస్తిపాస్తుల్ని ఎలాగూ సమకూర్చిపెట్టలేం! బాగా చదివించండి! పెద్ద వుద్యోగాలొస్తాయ్! తండ్రిలా గుమాస్తాల్లా ఆఫీసులకి అంకితం కాకూడదు! వారి భవిష్యత్తు బాగుపడే మార్గంలో వాళ్లని పెట్టండి! ఎంత ఖర్చయినా ఫర్వాలేదు అంటే అప్పులు చేయమని కాదు! మనం తాత్కాలికంగా యిబ్బందులు పడినా ఫర్వాలేదు! నాకు నగలమీద మోజులేదు! వున్న నగలు యిమ్మన్నా యిస్తా! వాళ్లు ప్రయోజకులు కావాలి! మీ సంపాదనెంత? ఎంత మిగులుస్తున్నారు అని నేనెప్పుడూ అడగను! మిగిల్చినా పది పదిహేను వేలు ప్రావిడెంటు ఫండు మిగల్చగలరు! అంతా అయిపోయాక ఆ పదిహేనువేలూ మన పిల్లల్ని ప్రయోజకుల్ని చేయలేవు!" అంటూ వుండే శశికళేనా యీనాడిలా ప్రశ్నిస్తోంది?

గత సంవత్సరం పిల్లల్ని యూనివర్సిటీలోనూ, కాలేజీల్లోనూ చేర్పించడానికి డబ్బు లేకపోతే భార్యతో సంప్రదించాడు ఇన్స్యూరెన్సు పాలసీనుంచి రెండు వేలు అప్పుతెస్తానన్నాడు

"ఇన్స్యూరెన్సు పాలసీనుంచి తెచ్చినా ప్రావిడెంటు ఫండునుంచి తెచ్చినా నాతో చెప్పనవసరం లేదండీ! మీ మీద నాకు నమ్మకం వుంది డబ్బుని దుర్వినియోగం చేయరని! పిల్లలు ప్రయోజకులు కావడమే మన ధ్యేయం! వాళ్లే మన ఆస్తి! ఆడపిల్ల పెళ్లీడు కొచ్చేసరికి పెద్దవాళ్లిద్దరూ అందొస్తారు! ఆపైన మీ రిటైర్మెంటు డబ్బు వస్తుంది! అనవసరంగా డబ్బు ఖర్చుచేస్తారని నేనెప్పుడూ అనుకోను! నన్నడగక్కర్లేదు! మీకెలా తోస్తే అలాచేయండి! ఇలాంటి విషయాల్లో నన్ను సంప్రదించనవసరం లేదు! జమా ఖర్చులు నేనెప్పుడూ అడగను" అన్న శశికళేనా యిలా నిలదీసి అడుగుతోంది? ఆశ్చర్యంగా భార్యనూ చూస్తూ వుండిపోయాడు

"చెప్పండి! లోను తీసుకొన్నారా?" మరలా అడిగింది వుద్రేకపడుతూ

"అవును! తీసుకొన్నా!" అన్నాడు

"ముందుగా నాతో చెబితే ఏం పోయిందండి!" ఆవేశాన్ని అణుచుకొంటూ నెమ్మదిగా అడిగింది

"పిల్లల ఫీజులకీ, హాస్టలు బిల్లులకీ, పుస్తకాలకీ తీసుకొన్నా!" అన్నాడు నెమ్మదిగా తప్పు చేసినవానిలా

"ఎందుకు తెచ్చారు? ఏం చేసారు? అని అడగడంలేదండి! తెచ్చినట్టు నాతో చెబితే ఎంత బావుణ్ను!"

భార్య పదే పదే అదే మాటంటూ వుంటే చీకాకు వేసిందతనికి

"మనపిల్లలు నాలాగే గుమాస్తాలు కాకూడదని అన్నావా లేదా?" అడిగారు వుద్రేక పడకుండా

"అవును"

"నగలూ చీరలూ వద్దు, తెలివైనవాళ్లు కాబట్టి పిల్లలకి పెద్ద చదువులు చెప్పించమని అనేదానివి కదా?"

"అవునండీ! ఇప్పటికీ నా ధ్యేయం అదేనండి! మన పిల్లలు ప్రయోజకులు కావాలండి!"

"నా జీతం ఎంతో నీకు తెల్సు! పిల్లలకి యింజనీరింగూ, మెడిసనూ చెప్పించాలంటే ఎంత ఖర్చు? ప్రావిడెంటుఫండులోనో మరెలాగో అప్పు చేసి కిందా మీదా పెట్టి సర్దుకొంటున్నాను పిల్లల భవిష్యత్తు కోసం డబ్బు ఖర్చు చేస్తే ఆఖరి దశలో అవస్థలు పడతామని భయపడుతున్నావా? లేక డబ్బుని ఎవరికైనా యిస్తున్నాననిగానీ, దుర్వ్యసనాలకి ఖర్చు చేస్తున్నాననిగాని అనుమానపడుతున్నావా? చెప్పు శశీ! చెప్పు!"

ఆవేశపడ్డాడు శశిభూషణరావు

భర్త మాటలకి విలవిల్లాడింది శశికళ నయనాలు అశ్రుపూరితాలయాయ్ గద్గదస్వరంలో అంది —

"మీరు డబ్బుని పాడుచేస్తున్నారని కాదండీ నా ఆవేదన! భార్యకు చెప్పకుండా వేలకు వేలు ఖర్చుచేసే మనిషని వారంతా అనుకొంటూవుంటే విని భరించలేకపోయా"

అర్ధాంగి ఆవేదనను అర్ధంచేసుకున్నాడు శశిభూషణరావు తన వుద్రేకానికి వుచ్చు బిగించాడు

"సరే! ఇకముందు చెబుతాలే!" అన్నాడు ఆమెను ఊరడించాలని

"జమా ఖర్చులు చెప్పమని మిమ్మల్ని ఆదేశించడంలేదండి! ఇంత తెచ్చాను యిలా చేస్తున్నాను అని అంటే చాలు! నా అనుమతి తీసుకోనవసరం లేదండి! ఈ విషయం నాకు ముందుగా తెల్సి వుంటే " అని ఆగింది గుక్క తిప్పుకొందుకు

"తెల్సివుంటే?" రెట్టించాడతను

"అవునండి! మా పిల్లలు పెద్ద చదువులు చదువుతున్నారు! డబ్బు చాలా అవసరం! పైచోట అప్పుచేసి వడ్డీల వుచ్చులో చిక్కుకోవడం ఇష్టంలేక యిలా చేస్తున్నారు! నా పిల్లలు ఒకరు యింజనీరూ ఒకరు డాక్టరు కాబోతున్నారు అని సగర్వంగా వాళ్లతో చెప్పి వాళ్లనోళ్లు మూయించేదాన్ని! వాళ్లు




కుళ్లి కుళ్లి యేడ్చేవాళ్లు"

ఆనందాశ్రువులొస్తూ తన వైపు చూస్తూంటే కన్నీటిని తుడిచాడు

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరించబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకు ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥

# ఓ సీతాపతి కధ

"సీతామహాలక్ష్మిగారింటి కెళ్లావా ?" లాలనగా అడిగాడు

"డాక్టరుగారబ్బాయి పుట్టినరోజు పేరంటానికి వెళ్లా దారిలో తన యింటికి రమ్మని సీతామహాలక్ష్మి బలవంతం చేస్తే వెళ్లా అప్పుడు అక్కడ అమ్మలక్కలమధ్య ఈ ప్రస్తావన వచ్చింది "

"నువ్వేం అన్నావ్ ?" అడిగాడు కుతూహలంగా

"డబ్బు విషయంలో మా వారిని నేనేమీ అడగనండి! వారు చెప్పబోయినా ఆ విషయాల్లో నాకు నిమిత్తం లేనట్లుగా వుంటాను పిల్లల చదువులకి బోలెడు డబ్బు కావాలి! మాకేం ఆస్తిపాస్తుల్లేవు! ఏదోవిధంగా సర్దుకోవాలి గదా! అన్నా!"

భార్య సమయస్ఫూర్తిని అభినందించాడు శశిభూషణరావు

"బాగా చెప్పావ్! ఇంకెప్పుడూ మన విషయాలు ఎత్తరు!"

"నా దగ్గర అనరండి! ఎవరిమీదనో ఒకరిమీద చెప్పుకొని ఆ పూటకి ఆనందించడం వారి కలవాటైపోయింది! అది నాకు నచ్చదు అందుకే ఎంతో అవసరం అయితేగానీ ఎక్కడకీ వెళ్లను! అస్తమాటూ అక్కడకు వెళ్లనని వాళ్లకి అక్కసు!"

ఆ క్షణంలో సీతాపతిరావుమీద చెప్పరాని కోపం వచ్చిందతనికి వెంటనే యింటికి వెళ్లి అడగాలనిపించింది కోపాన్ని అతికష్టంమీద అణచుకొన్నాడు మర్నాడు ఆఫీసులో అందరి ముందూ అడిగి అవమానపర్చాలనుకొన్నాడు

* * *

మర్నాడాఫీసులో అడుగుపెట్టిన దగ్గరనుంచీ సీతాపతిరావుని గట్టిగా దులిపేయడం కోసం సమయం కోసం వేచియున్నాడు ఆఫీసు సూపర్నెంటు శశిభూషణరావు నలుగురిలోనూ అడిగితే చిన్నబుచ్చుకొంటాడని ఏకాంతంలో అడగడానికి నిశ్చయించుకొన్నాడు సాయంత్రం అయిదుగంటలయింది ఒక్కొక్క గుమాస్తా తనతో చెప్పి బయటకు వెళ్తున్నారు ఆఖరున సీతాపతిరావుకూడా వచ్చాడు "వస్తాన్సార్!" అంటూ కదలబోయాడు మామూలుగా

"మీరుండండి సీతాపతిరావుగారూ! మీతో కొంచెం పనుంది!" అనడంతో ఎదురుగా కుర్చీలో కూలబడ్డాడు సీతాపతిరావు న్యూస్‌పేపర్ చూస్తూ కూర్చున్నాడు ఆఫీసు తలుపులన్నీవేసి ఎదురుగా నిలబడ్డాడు చౌకీదారు అప్పలస్వామి వాళిద్దరూ కూడా వెళ్తే ఆఫీసు తలుపులు తాళాలువేసి తనూ పోవచ్చునని వాడి ఉద్దేశం అప్పలస్వామి ఎదురుగా ఎందుకు నిలబడ్డాడో గ్రహించాడు శశిభూషణరావు వాడిని కొంతసేపు బయటకు పంపాలి

"గడ్డపారలు బ్రహ్మనికిచ్చి వారంరోజులైంది తయారుచేసాడేమో కనుక్కొనిరా!" పని పురమాయించి, బయటకు పంపాడు ఇక ఆఫీసులో యిద్దరే మిగిలారు

"చెప్పండి సార్! ఏమైన పనుందా ?" లేచి నిలబడి అడిగాడు సీతాపతిరావు

శశిభూషణంరావు మొహం జేవురించింది

"చూడండి సీతాపతిరావుగారూ! ఎన్నాళ్లనుంచో మీకో విషయం చెప్పాలనుకొంటున్నా! కానీ సమయమూ సందర్భమూ కల్సిరాలేదు!" అని ఆగాడు

"చెప్పండి సార్!" అన్నాడు సీతాపతిరావు వినయంగా

"మన ఆఫీసరుగార్కి అసిస్టెంటుగా మనం ఆఫీసులో వ్యవహారిస్తూ వుంటున్నాం! ఆఫీసు పని నిర్వహణలో మనకెన్నో విషయాలు తెలుస్తూ వుంటాయ్! ఎవరికి మెమో ఆఫ్ చార్జెస్ యివ్వబడబోతోందో, ఎవరిమీద ఎంక్వయిరీ ఆర్డరు పడిందో, ఎవరికి ట్రాన్సఫర్ కాబోతోందో, ఎవరికి లోను సాంక్షను అయిందో, లేక రిజక్టు అయిందో, ఏ కాంట్రాక్టర్ ఎస్టిమేట్ ఎప్రూవ్ కాబడుతోందో, మొదలైన ఇంకా ఎన్నో విషయాలు తెలుస్తాయ్, వాటిని ముందుగానే బయటపెట్టకూడదు వాటంతట అవే బయటపడ్తాయ్ బయటపడ్డాకయినా కొన్నింటిమీద మనం కామెంట్ చేయకూడదు ఏమంటారు ?" అని ఆగాడు శశిభూషణరావు

అతని వుపోద్ఘాతం దేనిగురించో అర్థం చేసుకొన్నాడు సీతాపతిరావు

"ఎస్సార్!" అన్నాడు మొహం దించుకొని

"మరి మీరు చేసిన పనేమిటి ? నేను అడ్వాన్సు తీసుకొన్నానని కాలనీ అంతా ఎలా తెల్సింది ? మీకూ నాకూ ఆఫీసరుగార్కి తప్ప యితరులకు తెలియడానికి ఆస్కారం లేదు '

సీతాపతిరావు తలెత్తలేకపోయాడు

"అయాం ఎక్స్‌ట్రీమ్లీ సారీ సర్! మీవాళ్లు పట్టుచీర కొనుక్కోవాలని చాలా రోజులునుంచీ అనుకొంటున్నార్ట! బహుశ ఈ అడ్వాన్సులో కొనుక్కొంటారేమోనని మాటవరసకి మావాళ్లతో అన్నాను!" నీళ్లు నమిలాడు

శశిభూషణరావు కోపం తారాస్థాయికి అందుకొంది

"ఇలాంటి విషయాలు ఆడవాళ్లతో చెబితే ఎన్నో అనర్థాలకి దారితీస్తాయ్! కాపురాలు కూలొచ్చు! తొందరపాటుతో కొందరు ప్రాణాలు తీసుకోవచ్చు! మీ అలవాటు మంచిది కాదండి! నా విషయం తెల్సినందువల్ల నాకేం కష్టంగానీ నష్టంగానీ వాటిల్లలేదు! ఇది మంచి పద్ధతికాదు! దీనికి స్వస్తి చెప్పాలి! అయాం సారీ!"

అంతలో చౌకీదారు రావడంతో వారిమధ్య సంభాషణ ఆగిపోయింది ఆ క్షణంలో అప్పలస్వామి సీతాపతిరావుకి ఆపద్బాంధవునిలా కన్పించాడు

"ఇక మీరు వెళ్లండి!" అనడంతో మరుక్షణంలో ఆఫీసునుంచి బయట పడ్డాడు సీతాపతిరావు ఆ రోజు క్లబ్‌కి పోలేదు తిన్నగా యింటికిపోయాడు

* * *

మర్నాడు తెల్లవారే సరికి సీతామహాలక్ష్మి భరించలేని శిరోవేదనతో బాధపడ్తోందన్న వార్త ఆ కాలనీ అంతా ప్రాకిపోయింది

ఎన్నిమందులు మింగినా, ఎన్ని అమృతాంజనం సీసాలు మర్దనా చేసినా, ఎంత పసరు తాగినా తగ్గలేదు అన్నిప్రయత్నాలు వృధా అయ్యాయ్ తరుణీ మణులెల్లరూ తల్లడిల్లిపోయారు ●

# తాజాదనాన్ని అనుభవించండి






నిదర్శనాన్ని చూడండి.



## సులభమైన ఈ పరీక్ష చేయండి.

నీళ్ల మీద బొగ్గుపొడిని చల్లండి. దాని మధ్య ఒక చుక్క బినాకా టాప్ ద్రవాన్ని చల్లండి. బినాకా టాప్ ఎంత త్వరగా అన్ని వైపులకీ వ్యాపించి నీళ్లలోని మురికినంతా పక్కపక్కకి నెట్టుతూ నీటిని స్వచ్ఛంగా, తేటగా ఎలా చేస్తుందో మీరే చూడండి.

మీ నోటిలో కూడా బినాకా టాప్ సరిగ్గా ఇలాగే పని చేస్తుంది. దానిలోని చెదిరి వ్యాప్తిచెందే ప్రత్యేకమైన పదార్థం నోటిలో నలుమూలలా ఇట్టే వ్యాపించి దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మ క్రిములను నిర్మూలిస్తుంది. నోటినుండి దుర్వాసన రాకుండా కాపాడి, మీకు తాజాదనపు హాయిని ఇస్తుంది.

**బినాకా టాప్ టూత్‌పేస్ట్—**
**మీకు సంపూర్ణ నోటి రక్షణనిస్తుంది**

ARMS-CBT-1-140-TL-82




"ఏవండీ నాకేవిటో భయంగా ఉందండీ"

ఉరుము లేని పిడుగులా వచ్చిన ఆండాళమ్మ భయంగా, బేలగా భర్త ముఖంలోకి చూస్తూ చెప్పారు

పేపరు పఠనంలో మునిగిపోయిన సింహాచలంకి మొదటగా ఈ వాక్యాలకు అర్థం సరిగా బోధపడకపోయినా అర్థమైన మరుక్షణంలో ఆకాశమంత ఆశ్చర్యంతో, తెరిచిన నోరు మూయడం కూడా మరిచిపోయారు

"హే విం టీ ? నీకు భయంగా ఉందా ?" ఆయనగారు అనుభవించే అనంతమైన ఆశ్చర్యానికి అర్థం లేకపోలేదు —

ఆయనగారి ఇన్నేళ్ళ సంసార జీవితంలోనూ భార్య మరొకళ్ళను భయపెట్టడమే కానీ ఆమె స్వయంగా భయపడటం అనే విషయం ఆయన ఎరగరు

"నిజమేనండీ తలుచుకున్నకొద్దీ నాకేవిటో భయంగా వుంది" ఈసారి సింహాచలంగారు ఫెళ్ళున నవ్వారు తలుచుకుని తలుచుకుని

"ఏవిటీ ? నీకు నీకు భయమా ?"

"ఏం మీకు అంత నవ్వులాటగా వుందేం ?" ముక్కుపుటాలు ఎగరేస్తూ ఉరిమారు ఆండాళమ్మగారు

సింహాచలంగారు మిగిలిన నవ్వును మింగేసి, "బుద్ధిమంతుడైన భర్తగా" మారిపోయారు

"ఆండాళ్ళూ ఎందుకూ భయం ?" లోపలినుండి తన్నుకువస్తున్న నవ్వును బలవంతంగా మింగేస్తూ తాపీగా భార్యామణి యోగక్షేమాలు విచారించారు సింహాచలంగారు

"నిజమేనండీ తలుచుకున్నకొద్దీ నాకేదో భయంగా ఉందండీ"

ఆండాళమ్మగారు తడిలేని పొడికళ్ళను పదే పదే ఒత్తుకున్నారు భార్య కంటతడి పెట్టడం చూసిన సింహాచలంగారు "మంచి భర్త"లా వెంటనే కరిగిపోయారు

"ఏవిటి ఆండాళ్ళూ ? భయం ఏమిటీ ? తలుచుకోడవేమిటీ ?" దగ్గరగా కూర్చున్న భార్యామణి భుజంమీద చెయ్యి వేస్తూ లాలనగా అడిగారు

ఈసారి ఆండాళమ్మగారు మరింత గట్టిగా ముక్కు చీదేశారే తప్ప విషయం చెప్పలేదు

"చెప్పు ఆండాళ్ళూ భయం ఎందుకూ ?"

"ఏవిటోనండీ, ఎంత సర్ది చెప్పుకున్నా నాకు భయం తగ్గడంలేదు"

మొహానికి చెంగు అడ్డం పెట్టుకున్నారు ఆండాళమ్మగారు

ఇక తన కిష్టమైనప్పుడు తనంత తానుగా చెప్పడం తప్పించి అడిగినకొద్దీ "జీడీల పాకం"లా మరింత బిగుసుకుంటుందని తెలిసిన సింహాచలంగారు తానూ "విషాద ముద్ర" అభినయిస్తూ ఉండిపోయారు

"మీరెందుకూ అలా ఉన్నార్రూ ?" ఐదు నిముషాల తరువాత ముఖానవున్న చెంగును తొలగించి, భర్త ముఖంలోకి చూస్తూ అడిగారు ఆండాళమ్మగారు

"నాకు మాత్రం బాధగా ఉండదా ఆండాళ్ళూ ?"

"ఏవిటి మీకూ తెలుసా ?"

"ఏవిటి ?"

"ఖర్మ ఖర్మ విషయం తెలీకుండానే ఏడుపు ముఖం పెట్టుకు కూర్చున్నారన్నమాట ఇంత తెలివితక్కువ మొగుణ్ని నా మెడకు కట్టి మా నాన్న నా గొంతు కోశాడు దేవుడోయ్ చచ్చి ఏ లోకాన ఉన్నాడో దేవుడోయ్" ముక్కు చీదేస్తూ చచ్చిపోయిన తండ్రిని తలుచుకుని శోకాలుపెట్టారు ఆండాళమ్మగారు

గాలి, దుమ్మూ, ఉరుములూ, మెరుపులూ అన్నీ ఒకేసారి వచ్చి ఊపిరాడనట్లు ఉక్కిరి బిక్కిరి అయ్యారు సింహాచలంగారు మాటా పలుకూ లేకుండా అర్థాంగి వైపు చూస్తుండిపోయారు

"మన చంటిని చూస్తుంటే భయం వేస్తుందండీ" అంతలోనే గొంతు తగ్గిస్తూ అంది

"ఏవయిందే చంటికి ?" సింహాచలంగారి పితృ హృదయం కంగారుపడింది

"ఏవిటోనండీ, మధ్యాన్నంనుండీ దాని వాలకం అదోలా ఉంది"

"ఏం జరిగిందీ ?" అని అడిగితే భార్య చెప్పదుగాక చెప్పదని అనుభవాల పాఠాలు నేర్చుకున్న సింహాచలంగారు మౌనమే మందులా భార్య వంక చూశారే తప్ప అడగలేదు

"మధ్యాహ్నం ఏం జరిగిందో తెలుసా ?"

ఏం జరిగిందీ అని అడగలేదు సింహాచలంగారు ఆండాళమ్మగారు, భర్త ఏం జరిగిందీ ? అని అడుగుతారేమో అని ఎదురుచూసి అతను అడగకపోవడంతో తానే తిరిగి మొదలుపెట్టింది

"ఇవ్వాళ ఎలాగూ శనివారం, చంటికి కూడా ఇష్టం కదాని కాస్త పప్పు నానవేశానా చంటి దాని మొగుడు వ్రాసిన ఉత్తరం చదువుకొంటుంది గదిలో మంచంమీద పడుకుని నేనేమో వంట గదిలో పప్పు రుబ్బుతున్నానా"

తరువాత ఏమయిందన్నట్లుగా కుతూహలంగా వింటున్నారు సింహాచలంగారు మౌనముద్రతో

"నేను పప్పు రుబ్బి బయటికి వచ్చేప్పటికి చంటి గది తలుపులు బిగించుకుని లోపల కూర్చుందండీ

"రావే అమ్మాయ్ రెండు గారెముక్కలు తిందువుగాని" అని పదిసార్లు పిలిస్తేగాని బయటికి

రాలేదంటే నమ్మండీ వచ్చేప్పుడు జాగ్రత్తగా గది తలుపులు గొళ్ళెం పెట్టుకుని మరీ వచ్చింది

"అమ్మా, నేను గదిలో కూర్చుని తింటానే" అంటూ వేసిన రెండు వాయల గారెలూ "పాతిక" పైచిలుకే ఉంటాయి ప్లేట్లో సర్దుకుని వెళ్ళిపోయింది పాతిక పైచిలుకే అంటే నమ్మండి ఆశేగానీ దీని ముఖం ఇన్ని తింటుందా అనుకున్నానుసుమండీ కాసేపటిలో ఖాళీ ప్లేటు పట్టుకొచ్చిందండీ, "మరి కాసిని ఉన్నాయే అమ్మా " అంటా అప్పటినుండీ దాన్ని చూస్తుంటే నాకు భయంగా వుందండీ అన్ని గారెలు తిన్నదంటే దాన్నేమీ పట్టలేదు కదా అసలే ఆషాఢ మాసం మొగుడు కూడా దూరంగా వున్నాడాయిరి " ముక్కు చీదేశారు ఆండాళమ్మగారు

"నీ ముఖం " అనబోయి నాలుక్కరుచుకుని, "ఉప్పే దాందేముంది ఆండాళ్ళూ, గారెలు రుచిగా వున్నాయేమో! తిని వుంటుందిలే దానికే ఇంతగా భయపడితే ఎలా ? నీ వంటకం రుచి నాకు తెలేదూ అబ్బో అబ్బో " సింహాచలంగారు ఉప్పేయడానికి ప్రయత్నించారు

మరోసారి, మరోసారి లయితే "ఛాల్లెండి సంబడం" అంటూ ముక్కూ మూతీ మూప్పై వంకర్లుతిప్పుతూ విసురుకునేవారు ఆండాళమ్మగారు కానీ ఇప్పుడేమీ పట్టనట్లుగా,

"అది కాదండీ, గారెలు తిన్నందుకే అయితే ఇంత భయం ఎందుకూ ? సాయంత్రం స్నానానికి వెడుతూ జాగ్రత్తగా గదికి తాళం వేసుకుని తాళాలు తీసుకుని మరీ వెళ్ళిందండీ తలారా స్నానంచేసి తెల్లచీర, తెల్ల జాకెట్టూ, బుట్టెడు పువ్వులూ, ఇంత బొట్టూ పెట్టుకుందండీ తిరిగి గదిలోకి వెళ్ళి 'ధన్'మంటూ తలుపులు వేసిందండీ దాన్ని చూస్తే నాకు భయంగా ఉందండీ "

"నీ దంతా ఒట్టి భ్రమ ఆండాళ్ళూ! గదిలో ఏం వుంటుందీ ? నీ పిచ్చికాకపోతే ? అమ్మాయికి బుద్ధి పుట్టి వుంటుంది, కట్టుకుని వుంటుంది దానికేనా ఇంత భయం "

"అంతే ననుకుంటున్నారా ?"

"ఇంకా ఏవిటీ?" అనలేదు సింహాచలంగారు

ఆయన సాంసారిక జీవితం సర్వీసు ఇరవై ఏళ్ళు నిజ భార్యామణితో ఎప్పుడు ఎలా వ్యవహరించాలో ఆయనకు కొట్టినపిండి

"ఇందాక గ్లాసుతో పాలు ఇద్దామని గది ముందుకు వెడుదునుగదా గదిలోనుండి చిట్టి పకపకా నవ్వుతుంది నాకు చెమటలు పట్టాయంటే నమ్మండీ ఇదేదో గాలి చేష్టకాకపోతే అమ్మాయి ఒక్కతే గదిలో కూర్చుని పిచ్చి పట్టినట్లు ఒక్కతే ఎందుకు నవ్వుకుంటుందీ ?"

"నువ్వు సరిగ్గా విన్నావా ?" అనుమానంగా అడిగారు సింహాచలంగారు

"అయ్యో ఖర్మ నా రెండు చెవులారా విన్నాను తలుపులు తట్టి పిలుద్దునా, తలుపుల మధ్య తలకాయ పెట్టి "ఏవిటీ ?" అంది పాలగ్లాసు అందించి, "ఏవిటే ఒక్కదానివీ కూర్చుని నవ్వుకుంటున్నావూ " అంటే "నేనెప్పుడు నవ్వానూ ? దయ్యం నవ్విందేమో " అందండీ మళ్ళా గట్టిగా నవ్వుతూ "ఒక్కదానివీ లోపల ఎందుకూ ? బయట కూర్చుందాం రారాదూ ?" అంటే ఏమందో తెలుసాండీ ?"

"ఏవందీ ?" ఈసారి అడక్కుండా వుండలేకపోయారు సింహచలంగారు

ఆండాళమ్మగారు కూడా ఇప్పుడు భర్తను తికమకపెట్టే మూడ్‌లో లేదు

"నా దేవుడు లోపలుంటే నేను బయటెలా వుంటానూ ?" అందండీ

"దేవుడెవరే ?"

"అదేనండీ ఇందాకట్నించీ నేను చెప్పడంలా? దేవుడంటే దయ్యం కామోసు నేను చెప్పడంలా ఇదంతా గాలి చేష్టే అమ్మాయిని బయటికి పిలిచి దగ్గర కూర్చోబెట్టుకుని ఆంజనేయ దండకం అన్నా చదవండీ రేపు గురువారం ఫకీరును పిలిచి అంత్రం కట్టిస్తాను '

సింహాచలంగారికీ తికమకగా ఉంది భార్య ఇన్ని గుర్తులు చెబుతూంటే "కాదూ" అని కొట్టివేయలేకపోయారు

"ఆండాళ్ళూ, అమ్మాయిని ఒకసారి ఇలా పిలువు అసలు విషయం ఏమిటో కనుక్కుందాం " ఏదో ఆలోచిస్తూ అన్నారు సింహాచలంగారు

"అమ్మబాబోయ్ దాని గది గుమ్మం దగ్గరికి వెళ్ళాలంటేనే నాకు కాళ్ళూ చేతులూ గజగజలాడుతున్నాయండీ "

భార్యను అంతగా భయపెడుతున్న ఆ దయ్యం పట్ల ఓ క్షణకాలం గొప్ప గౌరవ భావంతో నమస్కరించారు సింహాచలంగారు మనస్సులోనే

"నేనూ వస్తాను పద అమ్మాయిని చూద్దాం "

"పదండి " అనుసరించింది ఇల్లాలు

సింహాచలంగారూ,ఆండాళమ్మగారూ అడుగులో అడుగు వేసుకుంటూ చంటి గది గుమ్మం ముందుకు వచ్చారు

గది తలుపులు వేసి వున్నాయి

గదిలో లైటు వేలగడం లేదు

కాసేపు తలుపులకు చెవులు ఆనించి మరీ విన్నారు లోపలినుండి ఏ శబ్దమూ వినిపించలేదు

"ఏముందీ ? నీ పిచ్చిగాని అమ్మాయి పడుకుని వుంటుంది" అన్నట్లు చూశారు సింహాచలంగారు భార్యవంక

ఇంతలోనే ఉన్నట్లుండి గదిలోనుండి, చంటి నవ్వు పక పక మంటూ వినబడింది

"నేను చెప్పానా ?" అన్నట్లు చూశారు ఆండాళమ్మగారు ఈసారి చంటి గొంతు మగ గొంతులా, "అహా అహా " లాడటంతో గది బయటనించున్న ఆండాళమ్మగారూ, సింహచలంగారూ ఉలిక్కిపడి నిటారుగా అయ్యారు

మాయాబజారు సినిమాలోని మాయా శశిరేఖ గుర్తుకు వచ్చింది ఇద్దరికీ ఒకేసారి

ఈసారి ఆండాళమ్మగారు సింహాచలంగారికి దగ్గరిగా జరిగి భయంగా అతని చెయ్యి పట్టుకుంది

పెళ్ళయిన తొలి దినాల్లో ఎప్పుడో ఆమె అలా బేలగా ప్రవర్తించిన సంఘటనలు ఒకటి రెండున్నాయి తప్పితే, ఈ మధ్యకాలంలో అందరూ ఆమెను చూస్తేనే జంకుతారు తప్ప ఆమెను భయపెట్టే ప్రాణి ఈ భూప్రపంచంలో పుట్టలేదు ఇక ముందు పుట్టబోదని కూడా సింహాచలంగారి గాఢ నమ్మకం అతని ప్రగాఢమైన నమ్మకాని వమ్ము చేస్తూ ఈ నాటికీ దయ్యం అవతరించింది

గది గుమ్మం ముందు దంపతులు తలుపుకు చెవి ఆనించి మరీ వింటున్నారు






ఈసారి చంటి నవ్వు "ఏక అహ అహ ఏక అహ "గా వినిపించి మరీ బెంబేలెత్తిపోయారు దంపతులు

"హుష్ అబ్బ ఊ ఏక ఏక అహ అహ " గదిలో ఎవరైనా ఉన్నారా ?

ఒక్క క్షణం సింహాచలంగారి గుండె దడదడ లాడింది ఆ మరుక్షణంలోనే తన కలాంటి పాపిష్టి ఆలోచన వచ్చినందుకు తనను తాను తిట్టుకున్నారు

ఛీ ఛీ తన చంటి అలాంటిది కాదు నా తల్లి దగ్గర అలాంటి పాపిష్టి లక్షణాలు లేవు మరి ? లోపల ఎవరితో మాట్లాడుతుంది ?

"చంటీ చంటీ " దబదబా తలుపులు బాదారు సింహాచలంగారు

"ఏవిటి నాన్నా ?" అందే కానీ లోపల ఉన్న చంటి వచ్చి తలుపు తియ్యలేదు

"చంటీ తలుపు తియ్యమ్మా "

"ఏవిటి నాన్నా ! నాకు నిద్రొస్తుంది " లోపల చంటి గారాలు పోయింది

"పని ఉంది ఒక్కసారి తలుపు తియ్యమ్మా "

"అబ్బ ఉండు నాన్నా " చంటి వచ్చి తలుపు తీసి తలుపుకు అడ్డంగా నిలబడింది

ఆండాళమ్మగారూ, సింహాచలంగారూ సగం తెరుచుకున్న తలుపులోనుండి లోపలికి తొంగి చూశారు

"ఏవిటి నాన్నా, చూస్తున్నారూ ?"

"ఏంలేదమ్మా గదిలో ఎక్కడయినా కురుస్తుందేమో చూద్దామనీ "

చంటి పకపకలాడింది

చూశారా చూశారా అన్నట్లుగా చూశారు ఆండాళమ్మగారు

"ఇప్పుడు వర్షం రావడంలేదు కదు నాన్నా గదిలో ఎక్కడ కురిసేదీ ఎలా తెలుస్తుందీ ?"

ఈలోపుగా ఆండాళమ్మగారూ, సింహాచలం గారూ, కూతురు అడ్డుగా నిలబడే ఉన్నా ఎలాగో చొరవ, చోటు చేసుకుని లోపలికి వచ్చారు

"మీ నాన్నదంతా చోద్యమే అమ్మాయీ ! అమ్మాయి పడుకుంటుందీ ఇప్పుడేం చూస్తారూ అంటే 'గదిగోడ ఎక్కడో క్రాక్ ఇచ్చిందీ, అది వర్షాలు ఎక్కువ కాకముందే బాగుచేయించాలి, రేపు పనివాళ్ళను పిలుస్తానూ ' అంటూ నిలవకుండా వచ్చారు "

ఈలోపు సింహాచలంగారు మరో ద్వారం లేని గదిగోడలూ, బీరువాలూ, ఇంటికప్పూ, గది కడిగితే నీళ్ళు పోయే తూములూ, వగైరా వగైరాలు కళ్ళతోనే వెదికి ఏమీలేదన్నట్లు కళ్ళతోనే భార్యకు సైగచేశారు

"నేను చెప్పలా ఇది గాలిచేష్ట" అన్నట్లు భర్తవంక సాభిప్రాయంగా చూసింది భార్య

"అమ్మాయ్ ఇందాక నీ గదిలోనుండి ఎవరివో మాటలు వినిపిస్తున్నాయెవరివి ?"

"నావేనమ్మా " అంది నవ్వుతూ చంటి

"ఎవరిదో మగగొంతు కూడా వినిపించిందీ ." సందిగ్ధంగా అడిగారు సింహాచలంగారు

"అదా నాన్నా అది అది "సిగ్గుతో మెలికలు తిరిగిపోతూ చెప్పలేకపోతున్న కూతురి వంక

ఆయోమయంగా చూస్తుండిపోయారు దంపతులు

సింహాచలంగారికి బాధ్యత గల తండ్రిగా బి పి పెరిగితే ఆండాళమ్మగారికి గాలిచేష్ట గుర్తుకువచ్చి గుండెపోటు హెచ్చింది

"ఎవరే చంటీ " ఆండాళమ్మగారే తేరుకున్నారు ముందుగా

"మరీ మరీ "

"మరి " కూతురికి మరో "మరి" అందించి ఆమె చెప్పే జవాబు కోసం ఆతృతగా చూస్తున్నారు

"అదీ మీ అల్లుడుగారూ, నేనూ మాట్లాడుకుంటుండగా టేప్‌చేసి పెట్టుకున్నా నమ్మా ఇప్పుడదే పెట్టుకుని వింటున్నాను" చంటి సిగ్గుల మొగ్గ అవుతూ తల వంచుకుంది

కూతురికి అల్లుడిమీద వున్న ప్రేమకు మురిసిపోయి, మురిపెంగా ముసిముసి నవ్వులు నవ్వారు మొగుడివేపు చూస్తూ ఆండాళమ్మ

పెద్ద బరువు దించుకున్నట్లుగా తేలికగా నిట్టూర్చారు సింహాచలంగారు

"నేను చెప్పలేదుటండీ ఏమీ ఉండదని మీ కంగారూ మీరూ పదండి పదండి అమ్మాయి పడుకుంటుందో ఏమో పడుకోమ్మా చంటీ మీ నాన్నకు అన్నింటికీ కంగారే "

తెల్లబోయి చూడలేదు సింహాచలంగారు మామూలు భర్తలా, ఆయన ఇరవై ఏళ్ళ సర్వీసులోనూ భార్య ఎప్పుడెలా మాట్లాడుతుందో ఆయనకు సుపరిచితమైన విషయమే అందుకే జ్ఞానిలా చిరునవ్వు నవ్వుతూ గడప దాటారు వెనకనే తలుపులు మూసుకుంది చంటి

* * *

"చంటీ "

"ఊ అబ్బ ఇప్పుడేకదండీ నిద్రపోయింది '

గారాలుపోతూ మూలిగింది చంటి భర్తకు దగ్గరగా జరుగుతూ

"దానిక్కాదులే "

"దేనికీ ?"

"చంటీ, నేను 'బాత్‌రూం'కి వెళ్ళాలి "

చంటి పూర్తిగా కళ్ళు తెరిచింది

"ఎలాగండీ బయట గుమ్మంలో అమ్మా – నాన్నా పడుకున్నారు అమ్మ చూస్తే కొంప మునుగుతుంది "

"ఎలా చంటీ, నేను అర్జంటుగా 'బాత్‌రూం'కు వెళ్ళాలి "

భర్త అవస్థ అర్థం అయింది చంటికి ఎప్పుడో సాయంత్రం అనగా వచ్చినవాడు ఇంత వరకూ ప్రకృతి ధర్మాలు తీర్చుకోకుండా ఎలా ?

కానీ ఏం చెయ్యడానికీ ఆమెకు పాలుపోడంలేదు ఇద్దరూ ఇలా దొంగబతుకు బతకవలసి వచ్చినందుకూ, దానికి కారణమైన ఆషాఢ మాసాన్నీ, ఆషాఢ మాసంలో అత్తా – కొత్తల్లుడూ గడప దాటరాదంటూ ఆచారాలు పెట్టిన పెద్దలనూ, వాళ్ళ బాబులను కూడా సింగిల్‌గానూ, కంబైన్డ్‌గానూ కాసేపు తిట్టుకున్నారు

తిట్టుకుంటూ కూర్చున్నా "అవసరం" తీరలేదు సరిగదా, బాత్‌రూం అవసరం క్షణక్షణానికీ ఎక్కువవుతూ వచ్చింది

"ఏవండీ, అమ్మా వాళ్ళు పడుకున్నట్లున్నారు జాగ్రత్తగా వెళ్ళి వస్తారా ?"

"సరే " అన్నట్లుగా తల ఊపాడు సుబ్బారావు

చంటి వెళ్ళి గది తలుపులు తెరచి బయటికి తొంగి చూసింది బయట వరండాలో తల్లీ–తండ్రీ నిద్రలో వున్నారు ఇక వెళ్ళమన్నట్లుగా భర్తవంక చూసింది

డిమ్‌గా వున్న బెడ్‌లైట్ల కాంతిలో ఏదీ కనిపించడంలేదు సుబ్బారావు అడుగులో అడుగు వేస్తూ గుమ్మం వరకూ వచ్చాడు బెడ్‌లైట్ కాంతి మందగించడంతో అక్కడంతా చీకటిగావుంది మంచంమీద మావగారూ, మంచం ప్రక్కనే చాప మీద అత్తగారూ పడుకున్నారు

అత్తగారు వెల్లకిలా పడుకుని చిన్నగా గురక పెడుతున్నారు అత్తగార్ని చూడగానే చిన్నప్పుడెప్పుడో బొమ్మల పుస్తకంలో చూసిన "పూతన" గుర్తుకు వచ్చింది సుబ్బారావుకు అంతే కాళ్ళు గజగజ వణికాయి

అతని కాళ్ళు వణకడమేమిటీ, వణికిన ఆ కాలు అత్తగారి చేతిమీద ఎడటమేమిటీ, ఆ వెంటనే అత్తగారు "అయ్యబాబోయ్ దొంగ వచ్చినాడు దొంగ వచ్చినాడు" అంటూ కేకలు పెడుతూ లేచి తల క్రింద పెట్టుకున్న దుడ్డుకర్రతో దొంగగారి కాళ్ళమీద బలంగా ఒక్కటి వేయడమేమిటీ "చచ్చానోయ్ దేవుడోయ్ " అంటూ సుబ్బారావు "చావుకేక" పెట్టడమేమిటీ – అన్నీ క్షణాలమీద జరిగిపోయాయి

"అయ్యో అయ్యో " అంటూ చంటి గదిలోనుండి పరుగెత్తుకు రావడమూ, నిద్ర మత్తులో ఉన్న సింహాచలంగారు కంగారుగా లేచి లైటు వేయడమూ మరుక్షణంలో జరిగాయి దొంగగార్ని మరో దెబ్బ వేసేందుకు సిద్ధంగా కర్ర పట్టుకుని, "మహిషాసుర మర్దినిలా" ఉన్న ఆండాళమ్మగారు నేలమీద పడి ఉన్న దొంగగార్ని చూసి నోట మాట రాక కర్రవదిలేసి నిలువు గుడ్లేసుకుని నిలబడిపోయింది

చంటి సుబ్బారావు కాళ్ళదగ్గర కూర్చుని ఏడుస్తోంది దొంగగారి గొడవకు చుట్టూ చేరిన నలుగురూ నేలమీద పడివున్న ఆండాళమ్మగారి అల్లుడ్ని చూస్తూ విషయం అర్థంకాక తెల్లబోయారు

సుబ్బారావు నేలమీద నుండి లేవడానికి ప్రయత్నిస్తూ విలవిల లాడిపోయాడు బాధతో

సుబ్బారావు బాధ చూస్తున్న నలుగురూ కాలు ఎముక విరిగి వుంటుంది–ఆండాళమ్మగారి దెబ్బంటే సామాన్యమా ? అనుకున్నారు సానుభూతిగా

నీటి తూములతోసహా అన్నీ వెదికిన తను మంచంక్రింద వెదకడం మరిచిపోయిన విషయం జ్ఞాపకం వచ్చి తన పొరపాటుకు నొచ్చుకున్నారు సింహాచలంగారు ఆండాళమ్మగారు అల్లుణ్ణి దొంగ అనుకుని కొట్టిందని గ్రహించిన ఇరుగూ పొరుగూ, "అయ్యో పాపం ఇది ఆషాఢమాసం కదూ " అనుకున్నారు సానుభూతిగా 

# ఘాటాక్షుని డైరీ



## లిప్ స్టిక్ !

స్త్రీ అందచందాల వర్ణనలలో అధరానికేమీ తక్కువ స్థానం లేదు. ఇటువంటి పెదిమలకూ మేకప్ అనేది వున్నది ఈ పరికరం పేరే లిప్‌స్టిక్. పెదిమల రంగు కూడా వస్త్రధారణకు, పరిసరాలకు, పరిస్థితులకూ, శరీర ఛాయకూ సరిపడేట్టుండేందుకు లిప్‌స్టిక్కులు సుమారు ఇరవై రంగులలో తయారవుతూన్నాయి ఏది ఏమైనా లిప్‌స్టిక్ పెదాలకు పూసుకున్న వారు ఎంత నోరు మూసుక్కూర్చున్నా మరీ పెదాలు కలుపుకు కూర్చుంటే ఆ రెండు పెదిమలూ అంటుకుపోయే ప్రమాదం వుందట అందువల్ల యీ లేపనాన్ని పూసుకున్న వారు — అతికష్టంమీద నోర్మూసుకు కూర్చున్నా పెదిమలు మూసుక్కూర్చోకుండావుండడం ప్రాక్టీసు చేస్తూంటారట — అవ్వా బువ్వా కూడా కావాలంటే...

## మూఢ నమ్మకాలు !

మూఢనమ్మకాలనేవి మనిషి బలహీనతల మీద ఎదుగుతాయి. మనిషి ఏ దేశంవాడయినా, ఏ కాలం వాడయినా మనిషి మనిషే గనుక యీ మూఢనమ్మకాలు ఏనాడూ వున్నాయి ఉత్తర భారత దేశంలోని కొన్ని ప్రాంతాలలో వో వింత నమ్మిక వున్నదట ఆరుగురు యువకులు అర్ధరాత్రి వేళ దిగంబరులై తిరిగితే వారు తిరిగిన ఆ గ్రామంలో కలరా వంటి వ్యాధులురావనీ, ఆ దిగంబర యువకులు నాగలితో వో కొండ్రవేస్తే యిహ వూరికి ఏ మహమ్మారీ రాదనీ మూఢనమ్మక మున్నదట. మనం మన జాతీయ పక్షి అని మురిసిపోయే నెమలి శకునం చాలా చెడ్డదనీ, నెమలిని పెంచేవారి యిళ్ళలో కలతలూ, ఆర్థిక యిబ్బందులు, మానసిక రుగ్మతలూ వుంటాయని ఆ యింట్లోని గర్భవతులకు పుట్టే సంతానం అంగవిహీనంగా, - అవయవ లోపాలతో పుడ్తుందనీ పర్షియా జాతి వారు నమ్ముతారట గుడ్డివారు తయారుచేసిన వస్తువులు వాడితే చాలా అదృష్టవంతులవుతారావాడిన వారనే మూఢ నమ్మిక ఇంగ్లండు దేశీయుల కున్నదట. అలనాడు విక్టోరియా మహారాణి తన మనుమరాలి వుయ్యాలను వో అంధునిచేత తయారు చేయించిందట — అంతేల! పెళ్లిళ్లలో మనవారు మాంగల్యాన్ని భోగం వారిచేత ముట్టించరూ ! వారు నిత్య సుమంగుళులన్న నమ్మకంతోనే కదా యీ పన్నేసేది—

## సినిమా కెళ్తే శిక్ష !

సినిమాలు, వినోదాలూ పనికి రావని ఇస్లాం నివరించింది. ఎటువంటి వినోదాన్నయినా ఇస్లాం అంగీకరించదు పాకిస్తాన్‌లో ఇపుడు జియా ఉల్ హక్ ఇస్లాం సిద్ధాంతాలను యధాతథంగా ప్రవేశపెట్టి శిక్షాశాస్త్రాన్ని ఆ విధంగా అమలు జరుప చూస్తున్నారు ఇది మహమ్మదీయుల మతం. వారెక్కడున్నా చెందుతుంది అనేది మన భారత దేశంలోని కొన్ని ప్రాంతాలలో జరిగిన సంఘటనలు స్పష్టం చేస్తాయి. 1982 ఫిబ్రవరి 14 వ తేదీన మహారాష్ట్రకు చెందిన జిల్లాప్‌లో సలీమ్ షేక్ అనే ఆతనూ, అతని భార్య రెహనా కలసి "మేరీ ఆవాజు సునో" అనే హిందీ సినిమాకు వెళ్లి తిరిగి వచ్చేసరికి వో ముగ్గురు ముస్లిములు వారి మీద పడి, సినిమాకు ఎందుకు వెళ్లారని నిలదీసి, బాధించారట మహారాష్ట్రలో వో కమిటీ వుందట ఆ కమిటీ సినిమాలకు వెళ్ళే ముస్లిములను హర్షించదట ఎవరైనా సినిమాక్కు వెళ్తున్నారా అనిచూడ్డానికి కొందరు వాలంటీర్లున్నారట. సినిమాకు వెళ్లిన ముస్లిమ్‌లను యీ కమిటీ యదాస్థితి దండిస్తోందట

## స్వీడన్‌లో చట్టాల పరంపర !

స్వీడన్‌లో అదేపనిగా చట్టాలను కోకొల్లలగా అక్కడి అధికారులు పుట్టిస్తూంటారుట. గత పది సంవత్సరాలలో పదకొండు వేల చట్టాలను తెచ్చారట. ఒక్క 1981 వ సంవత్సరంలోనే ప్రతి ఎనిమిది గంటలకో చట్టం లెక్కన చట్టాలను అక్కడి ఎం. పి. లు పుట్టించేశారట.

## అప్పు తీర్చేందుకు అప్పు !

విశ్వమంతా అప్పే! మనిషి చేసినా, సంస్థచేసినా, రాష్ట్రం చేసినా, దేశం చేసినా తమ పురోభివృద్ధికి చేయడం జరుగు తూంటుంది. విజయవాడ విజయ కృష్ణా సూపర్ బజార్ స్టేట్ బ్యాంకు నుంచి వడ్డీ మీద అప్పుగా నాలుగు లక్షలు తెచ్చి, వ్యాపారం చేసి యీనాడు ఆ నాలుగు లక్షలకు ఇరవై నాలుగు లక్షలు వడ్డీ అయి, అదీ, ఇదీ కట్టలేక బొప్పురు మన్నదట ఈ సంస్థ ఛైర్మన్ తమకు మరో పది లక్షలిస్తే అదీ ఇదీ కలిపి అంతా తీర్చేస్తామన్నారట — అవిఘ్నమస్తు.

## సిగరెట్స్ తాగే స్త్రీలకు రోగిష్టి పిల్లలు !

గర్భిణి స్త్రీలు సిగరెట్లు కాల్చరాదనీ, రోజుకు పదిసిగరెట్లు కాల్చే గర్భిణిస్త్రీలకు పుట్టే పిల్లలు పుట్టు అనారోగ్యంతోనూ, కొండొకచో అంగవైకల్యంతోనూపుట్టారని పశ్చిమ జర్మనీవిజ్ఞానజ్ఞానులు వెలిబుచ్చారట. బ్రతికియుండిన సుఖములు బడయొచ్చు అనే ముక్క రైటేగాని, బతికి వుండేది సుఖములు బడయడానికే అయినపుడా సుఖాల నొదిలి బతికేదెందుకు?

## రోడ్డు ప్రమాదంలో ఒకరి మృతి !

నిడదవోలు నుంచి కాకినాడ వెళ్తున్న బస్సొకటి జన్నున మలుపుతిరిగి తనకి దూరంగా వస్తున్న స్కూటరును చూసి వోర్చలేక ఎగిరి దాన్ని గుద్ది రక్తం కళ్ళ జూడ్డమే గాక వో ప్రాణాన్ని బలికొని స్థిరపడ్డదట ఈ ఘోరం జరిగిన స్థలం సామర్లకోట వూరుచేరే ముందు జంక్షను ప్రాంతమట ఈ ప్రమాదంలో స్కూటరు మీదొస్తున్న నాగేశ్వరరావు అక్కడికక్కడే మరణించారట పాటంసెట్టి బూరయ్య అనే ఆయన మాత్రం కాలు విరిగి —కాకినాడ జనరలాసుపత్రిలో చేరారట. ఇది 20 వ తేదీన జరిగిందట —



# మల్లెతీగ

ఉదయం ఆరుగంటలయింది. అప్పుడే సరిగ్గా పేపర్ కుర్రాడు సైకిల్ దిగి, నా చేతికందించిన పేపర్ అందుకొని, ఈజీ ఛైర్లో కూలబడ్డాను.

నెమ్మదిగా ఏదో ఆలోచిస్తూ పేపర్ తిరగేస్తున్నాను యింతలో శ్రీమతి కాఫీ కప్పుతో ప్రత్యక్షమై నా చేతికి కప్పు అందించి అలాగే నిలబడింది.

కప్పు అందుకొని శ్రీమతి వంక ప్రశ్నార్థకంగా చూశాను

నెమ్మదిగా శ్రీమతి పెదవులు విప్పింది.

"చూడండి ! మీరు ఏమీ అనుకోనంటే..." శ్రీమతి ఆగింది.

"ఊ ! అనుకోనులే విన్నవించు"అన్నాను నవ్వుతూ.

"అదే ! దొడ్లో ... మ ... ల్లె ... తీగ మరోసారి వేసి...చూద్దాం..." తడబడుతూ అంది శ్రీమతి

"అబ్బబ్బ ! యిప్పటికి నాలుగుసార్లు మల్లెతీగను తెచ్చి పాతిపెట్టాం. బ్రతికి ఏడిచిందా ? నీ పిచ్చిగాని" విసుక్కొన్నాను ముఖం చిట్లించుకొని.

"నిజమే ! అది వేసిన జాగాలో మట్టి మంచిది కాదేమోనని కొత్త మట్టి తెప్పించి వేశాం, అదేమి విడ్డూరమో ఒక్క అంటు కూడా బ్రతకలేదు" అంది శ్రీమతి నిట్టూరుస్తూ.

"మన దొడ్లో మల్లెతీగకు ఆనవాయితీ లేదేమో ?" చిరాగ్గా అన్నాను.

"దీనికి ఆనవాయితీ ఏమిటండీ ? నా మాట విని ఈ సారి బాగా వేళ్ళు తొడిగిన మల్లెతీగను తెమ్మని మన ఫ్యూన్ రంగయ్యకు పురమాయించండీ !"

"ఊ ! సరేలే యింక సరిగమ నొక్కులు ఆపుచెయ్యి చూద్దాం !"

"అదీ ! శ్రీవారంటే అలా వుండాలి. చూస్తాను ఈసారి ఎందుకు బ్రతకదో" అంటూ లోపలికి దారి తీసింది శ్రీమతి.

నేను నవ్వుకుంటూ పేపర్లోకి తల దూర్చాను.

* * *

"జనరల్ మేనేజర్" అని వున్న నా రూమ్‌లోకి ప్రవేశించి "రివాల్వింగ్ ఛైర్"లో కూర్చున్నాను

ఫైల్స్ తిరగవేస్తూ వుండగా, శ్రీమతి కోరిన కోరిక గుర్తుకు వచ్చింది.




ఓ సారి శ్రీమతి గురించి ఆలోచించాను. శ్రీమతికి మల్లెపూలంటే తగని యిష్టం. మేము కొత్తగా కట్టుకొన్న రెండస్థుల మేడ వెనుక ఖాళీ ప్రదేశంలో రకరకాల పూల మొక్కలు మేడ కట్టడం పూర్తికాకుండానే మా రంగయ్య శ్రద్ధగావేసి పెంచాడు.అయితే అందులో మల్లెతీగ లేదు దానితో శ్రీమతి గొడవ మొదలైంది. గృహప్రవేశం కాగానే శ్రీమతి మల్లెతీగను తెచ్చి పాతించింది. అయితే అది బ్రతకలేదు. ఎవరో చెబితె, కొత్త మట్టి తెప్పించి తిరిగి రెండోసారి మరో మల్లెతీగను పాతించింది. అదీ అంతే! ఇలా వరుసగా నాలుగుసార్లు జరిగింది.

శ్రీమతి కోరిక అలాగే వుండపోయింది. నాలుగు ప్రయత్నాలూ నీరుకారి పోయాయి. తిరిగి ఐదో ప్రయత్నం చేస్తున్న శ్రీమతిని చూసి జాలేసింది.

ఇంతలో రంగయ్య స్ప్రింగ్‌డోర్ తెరచుకొని లోపలికొచ్చి నిలబడటంతో, నా ఆలోచనలకు ఫుల్‌స్టాప్ పెట్టాను

రంగయ్యకు ఫైల్సు అందిస్తూ ఓసారి అతని ముఖంవంక చూశాను.

రంగయ్య తడబడుతూ, అలాగే నిలబడి పోయాడు

"చూడు రంగయ్యా! అమ్మగారి గొడవ ఎక్కువైపోయింది ఈసారి 'మలె తీగ' బాగా వ్రేళ్ళు తొడిగిన అంటుని చూసి తీసుకురా. మొన్న వేసినది చచ్చిపోయింది" అంటూ లేచి నిలబడ్డాను

"చిత్తం! రేపే వెళ్ళి తీసుకొస్తానండి బాబయా!" అంటూ ముందుకు నడిచాడు.

నేను బ్రైవ్ చూసుకొని, బయట నా "మోరిస్ మైనర్" వైపుకు దారి తీశాను.

* * *

ఆ మరునాడు మా ఫ్యూన్ రంగయ్య అన్నట్టుగానే ఓ మంచి 'మల్లెతీగ' బాగా వ్రేళు తొడిగిన దానిని తీసుకొచ్చాడు

దానికి చూడగానే శ్రీమతి ముఖం చాటంతైంది.

వెంటనే ఆ తీగ నందుకొని "చూడు రంగయ్యా! రేపు నువ్వీపాటికి నాలుగు రాటలు కూడా తీసుకురావాలి దీనికి ఆలస్యంలేకుండా పందిరి కూడా వేసేద్దాం!" అంటూ పురమాయించింది శ్రీమతి.

నేను శ్రీమతి ఆత్రుతకు నాలో వేవే నవ్వుకొన్నాను.

* * *

పనిమనిషి గౌరమ్మ సాయంతో, ఆ తీగను స్వయంగా శ్రీమతి అందుకొని, గొయ్యితీసి పాతిపెట్టడం నా కళ్ళబడింది. దానిని పాతే ముందు, శ్రీమతి ఓ కొబ్బరికాయను కొట్టి మరీ పాతడం నాకు నవ్వు తెప్పించింది

రంగయ్య తెచ్చిన రాటలతో, ఆ మరునాడు దానికి పందిరి వెయ్యడం కూడా పూర్తి అయింది.

శ్రీమతి ముఖంలో నూతనోత్సాహం పెల్లుబక పొగడం చూస్తుంటే, నా మనసు కూడా గాలిలో కేరింతలు కొట్టడం మొదలు పెట్టింది.

టైమ్ పది గంటలు కావస్తోంది. ఆఫీస్‌కి బయలుదేరుతుండగా "టెలిగ్రామ్ సార్!" అన్న కేక వినబడితే, గేట్ వైపుకు నడిచాను.

"మదర్ సీరియస్. స్టార్ట్" అది మా బావమరది రామం యిచ్చిన టెలిగ్రామ్.

సంగతి తెలుసుకొన్న శ్రీమతి ఒక్కసారి ఘొల్లుమంది.

ఓ ప్రక్క నేనూ, మరో ప్రక్క గౌరమ్మా శ్రీమతిని ఊరడించి, ప్రయాణానికి బయలు దేరతీశాం.

నేను కారు ఫ్రంట్ డోర్ తెరుస్తూ, గౌరమ్మని పిల్చి "యిల్లు జాగ్రత్త" అంటూ తాళాలందించి, శ్రీమతి ఎక్కగానే కారు స్టార్ట్ చేసి ముందుకు పరుగు తీయించాను.

* * *

అక్కడ మా మావగారింట్లో పరిస్థితి మామూలుగా మారడంతో మా అందరి మనసులూ కుదుట బడ్డాయి.

మా అత్తగారు తిరిగి కోలుకోవడం, గండం గడిచి బయట పడటం మా అందరికీ ఆనందాన్ని కలుగజేసింది.

నాలుగు రోజులు గడిచాయి.

## మల్లెతీగ

నేనూ, శ్రీమతీ అందరి దగ్గరా సెలవు తీసుకొని యింటికి బయలుదేరాం.

* * *

ఇంటికి చేరగానే, శ్రీమతి పరుగుపరుగున దొడ్లోకి వెళ్లి ఒక్కసారి కెవ్వుమని అరిచింది.

నేను గబగబా అటువైపుకు పరుగెత్తాను. శ్రీమతి గుడ్లనీళ్లు గ్రక్కుకొంటూ, ఓ చేత్తో మరో ప్రక్క చూపించసాగింది.

అక్కడ దృశ్యం చూసేసరికి నాకు మతి పోయింది.

శ్రీమతి స్వయంగా పాతిన మల్లెతీగ వాడిపోయివుంటే, దానిచుట్టూ పందిరికోసం పాతిన రాటలు చక్కగా చిగిర్చి ఆకులుతొడిగి వున్నాయి.

నాకు నోట మాట రావటం మానేసింది. నెమ్మదిగా శ్రీమతి భుజం తట్టి లోపలకు నడిపించుకొని వెళ్లాను.

* * *

"క్రొత్తమట్టి వేసినచోట, బాగా వ్రేళ్లు తొడిగిన మల్లెతీగ, శ్రద్ధగా గౌరమ్మ రోజూ నీళ్లు పోస్తున్నప్పుడు ఏందుకా విధంగా తల వాల్చేసిందో?" ఎంత నేను తల బ్రద్దలు కొట్టుకొన్నా అర్థం కాలేదు

పై అంతస్థులోని హాలులో, నిలబడి ఏదో ఆలోచిస్తున్నాను.

ఇంతలో ఓ దృశ్యం నా కంట బడింది. వెంటనే నాలుగడుగులు ముందుకు వేసి నిలబడి, దొడ్లోకి పరీక్షగా చూడసాగాను.

అక్కడ మల్లెతీగ దగ్గర గౌరమ్మకొడుకు రాజా చేస్తున్న పని ఏమిటో నా కంటబడ్డాక నా ఒళ్లు మండిపోసాగింది.

వెంటనే "రాజా" అని గట్టిగా అరిచాను. నా అరుపుకి వాడూ, వాడికి కాస్త దూరంలో వుండి దొడ్డి వూడుస్తున్న గౌరమ్మా అదిరి పడ్డారు.

"గౌరమ్మా! రాజుని పైకి పంపించు" అంటూ నేను కదం త్రొక్కసాగాను.

రాజా పైకి వచ్చాడు. నన్ను చూసి ఒణికి పోసాగాడు.

"అది కాదండి! అమ్మగారి కిష్టమైన మల్లెతీగ క్రొత్త వేళ్లు తొడిగి బ్రతికిందో లేదోనని దానిని పైకిలాగి, చూస్తున్నానండి" అడక్కుండానే సంజాయిషీ యిచ్చాడు రాజా బెదిరిపోతూ.

సంగతి అర్థమైంది. "ప్రతిసారీ వీడి వల్లనే మల్లెతీగ గంగపాలవుతోందని" ఊహించాను.

"మరోసారి దొడ్లోవున్న ఏ మొక్క మీదైనా చెయ్యి వేశావో డొక్క చీరుస్తాను చూసుకో! మొక్క బ్రతికిందీ, లేనిదీ తెలుసుకోవాలంటే దాన్ని పీకి చూస్తాడ్రటా ఏ వెధవైనా? ఫో!" అంటూ వాడిమీద కసురుకొన్నాను.

* * *

సంగతి తెల్సుకొన్న గౌరమ్మ కూడా వాడి మీద మండి పడింది. శ్రీమతి ఆ రాజాగాడు చేస్తున్నపని బోధపడగానే ఏడవాలో, నవ్వాలో అర్థం కాలేదు.

ఇది జరిగిన మరో రెండు రోజులకే మరో కొత్త మల్లెతీగ వచ్చి మా దొడ్లో వెలిసింది.

అయితే యీసారి ఆ మల్లెతీగ చక్కగా బ్రతికి, పందిరి అంతా అల్లుకొని, కొన్నాళ్లకు మొగ్గ తొడగడం మొదలు పెట్టింది.

శ్రీమతి ఆనందానికి పట్టు పగ్గాలు లేకుండా పోయింది. ★



# ప్రశ్నావళి

కె రామలక్ష్మి

ఏ ఏ. — తమ్మినపట్నం

ప్రస్తుతం అమాయిక ప్రజానీకంపై మూఢ నమ్మకాలనే వలవిసిరే బాబాలు అమ్మలపై నిష్పక్షికమైన మీ అభిప్రాయం ఏమిటి ?

మనుషుల్లో మంచి వారిని దేవుడు దేవత అనుకో వచ్చునేమో గాని మనిషినే దేవుడుగాకొలవడం— నేను సహించను నేనిప్పటిదాకా ఏ బాబానీ ఏఅమ్మనీ చూడ వెళ్లలేదు ఇక నమ్మకం—మూఢ నమ్మకం అనేవి వ్యక్తిగత వికాసాన్ని పట్టి వుంటాయే గాని 'యివి' అంటూ కచ్చితంగా చెప్పలేనివే అవి నమ్మకం ముదిరితే మూఢ నమ్మకం అవదు. నమ్మకంలో కాస్తేనా వ్యక్తిగత శక్తి వుంటుంది మూఢ నమ్మకంలో అదేం వుండదని నేను అనుకుంటాను. మూఢ నమ్మకం స్వశక్తిమీద దెబ్బ తీస్తుంది. నమ్మకం స్వశక్తికి చేయూత నిస్తుంది.

ఏస్ ఎస్ ఆర్ హరిపాలెం

స్త్రీ మగవాడితో సమాన మన్నది స్త్రీలే ఒప్పుకోడం లేదు అందుచేత స్త్రీలను చైతన్య వంతులను చెయ్యాలంటాను.

రక్తంలో జీర్ణించుకు పోయిన నమ్మకాలు మారడానికి చాలా తరాలు పడుతుంది. స్త్రీ సమానత్వ పోకడలని హేళన చేసే వారెప్పుడూ వుంటూనే వుంటారు అందుకే స్త్రీ జనాభ్యుదయం—ఒకడుగు ముందుకీ రెండడుగులు వెనక్కీ—నడుస్తూ వుంటుంది!

ఎల్ వి. — కలిదిండి

జీవితానికి సరైన నిర్వచనం చెప్పగల ధీ అయిన మనిషి ఈ ప్రపంచంలో ఎక్కడైనా ఉన్నాడా?

నిర్వచనాలెప్పుడూ స్వీయానుభవాన్ని ఆశ్రయించివుంటాయి ఎవరికి వారిది సరైనదనిపిస్తుందంతే సర్వజనామోద కరమైనదంటూ ఏదీవుండదు.

ఏన్ ఎస్. — రాయిదుర్గం

డాక్టరు కోర్సులు చదివే అమ్మాయిలు శీలానికి ప్రాధాన్యం ఇవ్వరని కొందరి వాదన

బుర్రలేని వాళ్ల వాదన అది. విజ్ఞానం, శాస్త్రీయ విజ్ఞానం—బాధ్యతలు పెంచుతుందేగాని కుంచించదు.

జి హెచ్. — రాయిదుర్గం

నువ్వు ఎక్కవలసిన రైలు ఒక జీవితకాలం లేటు. కామెంట్?

లగేజీ ఎక్కువైతేనే, రైలు మిస్సయే ప్రమాదం.

కె. ఎస్. ఆర్ — గుంటూరు

మా ఫ్రెండు ఒకాయన రెండు నెలల క్రిందట పెళ్ళి చేసుకున్నాడు ఇప్పుడామె నాకు నచ్చడం లేదు బలవంతంగా పెళ్ళి చేశారు అంటోంది. నా ఫ్రెండు పరిస్థితి?

మీరెందుకు మోశారు, ఆమె మనస్సులో మాట చెప్తే? స్నేహితులు విభేధాలు సృష్టించ కూడదు. ఉన్నా వాటిని పోగొట్టే ప్రయత్నం చేయాలి.

వెంకట్ — ఉరవకొండ

మీ దృష్టిలో స్త్రీ పునర్వివాహం శాస్త్ర సమ్మతమా?

మానవత్వంతో కూడిన దేదైనా శాస్త్రీయమే !

ఆనారా - ఖర్గపూరు

ఆరుగురు పిల్లల తండ్రి ఆలి మాటలు భరించ లేక ఆత్మహత్య చేసుకున్నాడు.

లేదు. ఆర్గురు పిల్లల తల్లిని అంబో అంటూ వదిలేసి హాయిగా బాధ్యతలు తప్పించుకున్నాడు. సమాజం మీద సాటి మనిషి మీద నిర్లజ్జగా భారం పారేసి తప్పించుకు పోయేవాళ్లే నిజమైన ద్రోహులు. స్వార్ధపరులు.

జి. పి. కె ఆర్. — హైదరాబాదు

వైద్యో నారాయణో హరి ..?

ఆ వెయ్యి డాక్టరు చీట్లు పుట్టించవచ్చు. కాని రోగానికి విరుగుడు పుట్టించ లేక పోవచ్చు . అందుకే హరీ! అనాలి.

కె. ఎస్ జె. — బైపల్లి

ఈ లోకం ఎలా ఎప్పుడు మారుతుంది?

లోకం మారదు. పోకడలు మారుతాయి.

ఇది ఏలోకం?

లేనివాళ్లకి నరకం. వున్నవాళ్లకి స్వర్గం.

వీం. ఎస్ ఆర్ — బైపల్లి

ఆమె నా ప్రాణం. నన్ను అపార్ధం చేసుకొంది.

శుభం. అపార్ధం పాలైన ప్రేమ గొప్పది. త్యాగం లాగా పేరు తెచ్చు కుంటుంది!

జి. ఏస్. ఆర్. — నూకవారిపాలెం

నేనొక అమ్మాయిని ప్రేమించాను. ఆ అమ్మాయితో చెప్పడానికి ధైర్యం లేదు. ఎల్లా?

పైగా బ్రాకెట్లో ఏమ్కావ్ అని కూడా వ్రాశావు తమ్ముడూ! అది లేక పోతే ఇదో కిండర్ గార్డెన్ ప్రేమకథ అనుకునే దాన్నే! ఆ అమ్మాయితో చెప్పడానికి ధైర్యం లేదు కాని పత్రిక్కి రాయడానికి ఫరవాలేదనిపించింది. అవునా? నీలాంటి వారినే వయసొచ్చిన పసివాళ్లు అనడం!

డి. జి. బి — రామాయంపేట

పెళ్లి చేసుకోక పోతే అయిన వాళ్లకు అశాంతి. చేసుకుంటే తన జీవితానికి అశాంతి .

ఏం కష్టం వచ్చింది. ఇదీ పెళ్లి కోసమా?! ఈ దేశంలో మీలాంటి మగపిల్లలకి పెళ్లి లాభసాటి బేరం కదా?

ఏస్ పి. ఆర్. — గుండవోలు

నేను తరచూ ఆవూరు వెడుతూ వుంటాను. ఆవిడకు నేనంటే ఇష్టం .

ప్రతి ఆడదీ తనంటే పడి చావాలని అనుకోవడం మీలాటి మగవాళ్ల తీరని కోరిక అనిపిస్తుంది, యీ ధోరణి చూస్తూంటే !

కె. డి ఏస్ కె కుప్పం

మనం చేసే ప్రతిపనికి ప్రతిఫలం లభించాలంటే ఏలా చెయ్యాలి?

ప్రతిఫలం ఆశించకుండా! నిస్వార్థ బుద్ధితో చేస్తేనే ఫలితం ఎక్కువ దక్కుతుంది.

పి. ఎమ్ ఆర్ — కాశీబుగ్గ

హృదయం సుకుమార మైనది అంటారు. ఏందుచేత?

ఇట్టే నొచ్చుకుంటుంది కనుక.

వీన్ ఎస్ డి. పంజాబ్

అగ్గి బూడిద అవుతుంది. మనసు కాలితే ? కసి పుడుతుంది.



# బాకీ

**కేంభమర్తి వెంకటేశ్వరరావు**

ఈ సారైనా గట్టిగా అడగాలనుకునే బయలుదేరాడు రాఘవరావు పంతులింటికి. ప్రతిసారి ఇలా అనుకొని బయలుదేరడం క్రొత్త కాదు. మూడునెల్నుండి చేస్తున్న ప్రయత్నమిది. ఒకలా అనుకుని అక్కడికెళ్ళేసరికి ఆ పని మరచిపోయి మరోలా తిరిగి రావడం అలవాటైంది రాఘవరావుకు. ఇంతకీ రాఘవరావు పంతులింటికి అలా అనుకుని బయలుదేరడానికి కారణం ... ఐదునెలల క్రితం పంతులు అర్జంటుగా అవసరమొచ్చి పడిందని రాఘవరావు దగ్గర వెయ్యిరూపాయలు అప్పు తీసుకున్నాడు, రెండు నెలల్లో సర్దుతానని చెప్పి

పంతులు పెట్టిన గడువు పూర్తైంది. ఈవేళో, రేపో ఇస్తాడనుకుని రోజూ వెళ్ళేవాడు రాఘవరావు. వెళ్ళిన ప్రతిసారి ఏ పని మీద వెళ్ళేవాడో అది మరచిపోయి రావడానికి కూడా కారణం ఉంది.

రాఘవరావు, పంతులు మంచి స్నేహితులు. పంతులి అసలు పేరు రామశర్మ. రాఘవరావుకు మాత్రం మొదటి నుండీ పంతులూ అని పిలవడం అలవాటు. ఆరవతరగతి చదువుతున్నప్పటి నుండి మొదలైన వారి స్నేహం జీవితాలలో స్థిరపడిన తరువాత కూడా విడువలేదు. రాఘవరావు మునిసిపల్ ఆఫీసులో క్లర్కుగా జీవితం ప్రారంభిస్తే, పంతులు చప్పిరాసి, వచ్చినా చాలీచాలని జీతంతో బడి పంతులు గిరిలో స్థిరపడ్డాడు.

వారిద్దరి స్నేహం వారసత్వానికి వచ్చింది. వాళ్ళిద్దరి భార్యా పిల్లలు కూడా కలసి మెలసి తిరిగేవారు. రాఘవరావింట్లో మంచి జరిగినా, చెడు జరిగినా అక్కడుండేవాడు పంతులు. పంతులు ఏ శుభకార్యం తలపెట్టినా ముందుండేవాడు రాఘవరావు.

మొదటి నుండీ పంతులు నీరసం మనిషి. ఈ మధ్యే బడిపంతులుగా రిటైరయి గుండె జబ్బు సంపాదించుకుని ఇంట్లో విశ్రాంతి తీసుకొంటున్నాడు. తరువాత కొద్దిరోజులకు రాఘవరావు కూడా రిటైరయ్యాడు. కసరత్తు శరీరం కావడంవలన అప్పుడప్పుడు దగ్గు, జ్వరం మొదలైనవి చిన్న చిన్నవి తప్ప పెద్ద జబ్బులేవీ వచ్చేవి కావు రాఘవరావుకు. ప్రతీరోజూ సాయంత్రం రాఘవరావు మనవడినో, మనవరాలినో తోడు తీసుకుని పంతులింటికి వెళ్ళి అక్కడ నుండి పార్కుకెళ్ళేవారు.

రాఘవరావంటె పంతులింట్లో అందరికీ అభిమానమే. వెళ్ళగానే ఆప్యాయంగా పలుకరించి కాఫీయో, మజ్జిగో ఇచ్చి కుశలమడుగుతుంది పంతులి భార్య. బాబాయ్ గారొచ్చారంటూ సంబరపడి పోతారు పిల్లలు. ఒకరోజు కనబడకపోతే 'నిన్నంతా రాలేదు మీరు. ఈ వేళ కూడా మీరు రావడం ఇంకో

అరగంట ఆలస్యమైతే నాన్నగారు మీ ఇంటి కొచ్చేసేవారే' అని చెప్పేవారు.

ఒకరిపట్ల ఒకరికి గల ప్రేమాభిమానాలు ఇంతా అంతా కాదు.

పంతులింటికి రోజూ వెళ్లడం రాఘవరావుకు అలవాటైనా ఈ మధ్య వెళ్ళే ఉద్దేశ్యంలో మార్పు వచ్చింది. అంతకు ముందు వాడెలా ఉన్నాడోనని చూడ్డానికి వెళ్లేవాడు. కానీ, పంతులు చేబదులుగ వెయ్యిరూపాయలు తీసుకున్నప్పుడు రెండు నెలల్లో ఇస్తాననడం, ఆ రెండు నెలలూ మరో మూడు నెలలు గడవడం జరిగాయి. వెళ్లిన ప్రతిసారీ ఈ రోజు పంతులిస్తాడను కునేవాడు. పంతులు డబ్బు ప్రసక్తి ఎత్తేవాడు కాదు. కొన్నిరోజులకు రాఘవరావు గట్టిగా నిర్ణయించుకున్నాడు అడిగేద్దామని. కానీ అక్కడకెళ్లేసరికి అడగలేకపోయేవాడు. ఆ యింట్లో చూపించే అభిమానానికి కట్టుబడి నోరు మెదిపేవాడు కాదు.

పంతులు పరిస్థితి అంతా తెలుసు కాబట్టి గట్టిగా అడగలేక పోతున్నాడు. పెద్దబ్బాయి చిన్న ఉద్యోగం చేస్తూ కుటుంబాన్ని నెమ్మదిగా నెట్టుకొస్తున్నాడు. రెండో కొడుకు జులాయి వెధవ. మెకానిక్ షాపులో పని చేసి సంపాదించినా నాలుగు రూపాయలూ ఇంటికి ఇవ్వడు సరికదా సినిమాలు, సిగరెట్లని ఫ్రెండ్స్‌తో తిరిగి ఖర్చు చేసేస్తాడు. అందుకే రాఘవరావు పంతులును డబ్బివ్వమని అడగలేకపోతున్నాడు. అయితే మనసులో ఒక ప్రక్క పీకేస్తోంది అసలు డబ్బు ఇస్తాడో, ఇవ్వడోనని.

డబ్బు...మనిషిని మనిషిని వేరు చేస్తుంది. మనిషిలోని మానవత్వాన్ని ముసుగులా కప్పేస్తుంది. మనిషిలోని మంచితనాన్ని మంట గలుపుతుంది. స్నేహితులిద్దరి మధ్య డబ్బు చోటు చేసుకుంటె కొన్ని కొన్ని సమయాల్లో వారి స్నేహాన్ని దూరం చేస్తుంది. పైకి మామూలుగా మాట్లాడుతున్నా మనసులో ముద్రించుకుపోయిన డబ్బు సమస్య మనస్ఫూర్తిగా మాట్లాడనివ్వదు.

అలాగే అయింది రాఘవరావు పరిస్థితి.

ఆ రోజు రాఘవరావు మామూలుగా పంతులింటికి బయలుదేరాడు.

గుమ్మం దగ్గర కెళ్లిన రాఘవరావుకు లోపలనుండి వినబడుతున్న పంతుల మాటల్లో తన పేరు ప్రస్తావన రావడంతో ఆగిపోయాడు.

"మాధవా ... రాఘవ బాబాయ్ దగ్గర వెయ్యిరూపాయలు అప్పు తీసుకొని ఐదు నెలలైంది. ఇంకా ఇవ్వలేకపోతున్నాను. వాడు నాకు ప్రాణం ఇమ్మన్నా ఇస్తాడు. అయినా వెయ్యిరూపాయలంటే మాటలా! వాడికీ అవసరముంటుంది. నువ్వెలాగైనా ఈ నెలలో సర్దెయ్యి. ప్రతిసారీ నా రాఘవ వచ్చినప్పుడు ముఖం చూపించలేకపోతున్నాను. రాఘవ గట్టిగా అడగలేడు. వాడికసలు నా కిచ్చిన డబ్బు మాటే గుర్తుండదు. అంత ప్రేమ నే వంటె"

పంతులు మాటలవి.

"నాన్నగారూ ... నాకు మాత్రం తెలియదా? రాఘవ బాబాయ్ గారికి ఎప్పటి కప్పుడు డబ్బిద్దామనుకుంటె ఏదో ఖర్చు తగులుతోంది. ఈ సారి ఆఫీసులో లోను పెట్టి బాబాయ్ గారికిచ్చేద్దాం" కొడుకు తండ్రిని ఓదారుసు న్నాడు.

"మాధవా ... ముందు మీ నాన్నగారికి డాక్టరుగారు వ్రాసిచ్చిన మందులు తీసుకురా. సమయానికి చేతిలో డబ్బు లేకుండాపోయింది. ప్రక్కింటి వనజమ్మ నడిగితే వందరూపాయ లిచ్చింది. ముందివితీసుకొని బజారుకెళ్ళిరా."

పంతులు భార్య వెక్కిళ్లమధ్య మాట్లాడు తోంది.

## తిండి ఎక్కువైతే జబ్బులు!

జర్మను ప్రజల ఆహారపు టల వాట్లలో మార్పు కన్పిస్తున్నది. శాకాహారులు నాల్గింట మూడొంతులు ఎక్కువ ఆహారాన్ని తీసుకుంటున్నారు. మాంసాహారులు, వంద సంవత్సరాల నాటి ఆహారపు టలవాట్లతో పోల్చి చూస్తే, నాలుగురెట్లు ఆహారాన్ని ఎక్కువగా తీసుకుంటున్నారు. ప్రజలు ఎక్కువ ఆహారం తీసుకొనడం దేశ సౌభాగ్యానికి గుర్తు. అయితే దీనివలన గుండె జబ్బులు, కాన్సరు, చక్కెర వ్యాధి ఎక్కువగా ప్రబలుతున్నాయి. ప్రజలు ఆహారం తక్కువగా తీసుకున్న రోజుల్లో ఈ వ్యాధులు చాలా తక్కువగా ఉండేవని న్యూ ఉల్మ్‌లో జరిగిన సమావేశాలో తెలియచేశారు.

మరిక నిలబడలేకపోయాడు రాఘవరావు. గబ గబ లోపలకెళ్ళాడు.

పంతులు మంచం చుట్టూ భార్యా పిల్లలున్నారు.

"పంతులూ...ఏంటయిందిరా"

గాభరాగా అడిగాడు.

రాఘవరావుని చూసి చిన్నగా నవ్వేడు పంతులు.

"ఒరేయ్ రాఘవా ... మధ్యాహ్నం మళ్లీ గుండెనొప్పి వచ్చిందిరా. పిల్లలు ఖంగారు పడుతున్నారు. నేను చచ్చిపోయినా నా కుటుంబాన్ని ఒక కంట కనిపెట్టడానికి నువ్వున్నావు. అదేరా నా ధైర్యం. అందుకే చావడానికి కూడా భయపడడంలేదు."

పంతులు మాటలకు రాఘవరావు కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

ఏం మాట్లాడాలో అర్థం కాలేదు రాఘవరావుకు.

రాఘవరావు సూటిగా పంతులు వైపు చూడలేకపోయాడు.

"ఒరేయ్.. నన్ను క్షమించరా ... వెయ్యి రూపాయలు కోసం ఈ ఐదు నెలలూ స్వార్థంతో నీ దగ్గరకు వచ్చేవాడినే కాని మనస్ఫూర్తిగా రాలేకపోయాను. నీతో మాట్లాడిన ఈ ఐదు నెలలూ నీ మాటల్లో డబ్బు ప్రస్తావన వస్తుందేమోనని ఎదురు చూసానేగానీ నీ బాధలను అర్థం చేసుకోలేక పోయాను. ఇందాక నువ్వన్న మాటలకు నేను అర్హుడిని కానురా ... నీవు నాకు మాటకి మారుపాళ్ళు స్నేహ మాధుర్యాన్ని అందించావు. నేను మాత్రం వెయ్యిరూపాయలు కోసం ఇన్నాళ్ళ మన స్నేహ అమృత కలశంలో ఒక్క స్వార్థం బిందువు కలిపి కలుషితం చేసాను. నువ్వు నాకు వెయ్యి రూపాయలే బాకీ. కాని నేను అమూల్యమైన స్నేహాన్ని అందివ్వడంలో నీకు చాలా బాకీ పడి పోయాను. ఈ బాకీ ఎలా తీర్చగలనురా నేను."

అనుకున్నాడు రాఘవరావు మనసులో బాధగా.

అంతే...

మాధవను బయటకు తీసుకొచ్చి ఇంటికెళ్ళి రెండొందల రూపాయలు జేబులో వేసుకుని మందులషాపు కెళ్ళాడు రాఘవరావు ... పంతులుకు మందులు కొనడానికి ❖

# వారఫలం

**1-10-1982 శుక్రవారం మొదలు 7-10-1982 గురువారం వరకు**

★మేషం : భారీ వ్యాపారమైనా, యంత్ర సంబంధమైనా, మైకా సంబంధమైనా, లోహ సంబంధ వ్యాపారమయినా బాగా పైకి రాగల అవకాశం గల వారం ఉద్యోగంలో శ్రమకరమైనా మేలు కలిగేవారం. స్త్రీలకు : సాహితీరంగప్రసిద్ధులకు వారమంతా మేలే

★వృషభం . అయిన వారి సంబంధానికై చాల మంది ప్రాకులాడుతారు. వృధా శ్రమయే. దైవ దర్శనార్థం ప్రయత్నించే వారికి సర్వానుకూలత చేకూరనున్నది. పూరితో పెత్తనం సాగించే వారికి సర్వానుకూలమే. స్త్రీలకు: ఎంతటి శ్రమకరమైన వ్యవహారమయినా యిట్టే జరిగి పోతుంది.

★మిథునం ఆదాయం ఉన్నది, దానికి తగిన ఖర్చు ఉన్నది రాజకీయంగా సర్వానుకూలవారం వస్తు సేకరణకు, స్థిరాస్థి వ్యవహార పరిష్కారానికి అనుకూల సమయమే స్త్రీలకు · సుఖశాంతులు, ఉద్యోగానుకూలం కళారంగానుకూల్యత గలవారం

★కర్కాటకం : సాహిత్య కళారంగాలలో మీకు సదవకాశాలు లభిస్తాయి కొందరకు నూతన వస్తు సేకరణలో అనుకూలత కనిపిస్తున్నది కొందరకు అనుకోకుండా ప్రయాణాలు తగిలే అవకాశమున్నది చాలమందికి అప్రయత్నంగా చేతికి నాలుగు రూకలు చేరే వారం. స్త్రీలకు: సర్వత్రా విజయవంతమైన వారమే.

★సింహం : ఆరోగ్య విషయంలో చాల మందికి లోపం ఏర్పడుతుంది. చాలమంది విశ్రాంతి తీసికోవలసిన పరిస్థితులుంటాయి కొందరకు రాజకీయంగా శ్రమకరమైన వారమే. చాలమందికి అప్రయత్నంగా ప్రయాణాలు తగులుతాయి. స్త్రీలకు : ఆదాయంలో అభివృద్ధి, ఉద్యోగంలో పెంపు చెప్పదగిన వారం.

★కన్య : అనుకూలతకు, క్రయవిక్రయాలకు, సర్వానుకూలతకు, ఉద్యోగస్తులకు పెంపుకు, రాజకీయవాదులకు చికాకులకు అనుకూలత గలదు. అందుచేత ఏ రంగానికి సంబంధించిన వారైనా జాగ్రత్తపడాలి. స్త్రీలకు : సొమ్ములు, వస్తు వాహనాలు కొనుగోలు చేయుగల వారం. అధిక విద్యాప్రయత్నాలకు సుకరమైన వారం.

★తుల . ధనలబ్ధికి పెద్దగా అవకాశం చెప్పడానికి వీలులేదు. అధిక ఖర్చులకు అవకాశం కూడా లేకపోలేదు ఏదో తలంచటం, ఏదో చెయుటంవుడా సంభవం రాజకీయంగా అనానుకూలతకు అవకాశం ఉన్నది. స్త్రీలకు : కుటుంబ భారం, ధనలోపానికి అవకాశమున్నది.

★వృశ్చికం : ఆదాయమున్నది. అధికారులవలన జరుగవలసిన పనులు సుకరంగా జరుగుతాయి. క్రయ విక్రయాలలో మీకు మేలు సంభవించే వారమే స్త్రీలకు సుఖశాంతులు, ఉన్నతవిద్యకు సదవకాశాలు, శుభకార్యానుకూలత సమకూడే వారంగా గ్రహించండి

★ధనుస్సు నూతన వ్యవహారాలలో మీకు చొరవ గలగటమేగాక ధనాదాయం కూడా చేకూరుతుంది. నూతన వస్తువులు సేకరించుటతో వారం అంతా గడుపుతారు. కుటుంబంలో సుఖ సంతోషాలకు అవకాశంగల వారం. స్త్రీలకు . బంధు సమాగమం, స్థితిలో ఎలాగో పెంపు కనిపించే అవకాశం గలవారం.

★మకరం : సాటివారిలో గౌరవాభివృద్ధి, ఖర్చులకు చాలినంత ధనం చేతికందడం, తలవని తలంపుగా కొన్ని అవకాశాలు లభించటం, చాల కాలం యింటికిరానిమిత్రులు హటాత్తు రావటం, యిలాంటి సత్ఫలితాలు గలవారం స్త్రీలకు. ధనాదాయం, వృత్తిలో పెంపు, ఉన్నతాదర్శం గల వ్యక్తులను కలిసికోవటం జరుగుతుంది

★కుంభం . మీతో యిదివరకు అన్ని విషయాలలో సహకరించిన వ్యక్తులు, దూరంగా పోయే సమయం మాటలకు విలువ అధికమయ్యేవారం ఎలాగో అవసరాలు తీరేటంత ధనాదాయం చేకూర గల వారం. స్త్రీలకు . ప్రయత్నించినచో నూతన అవకాశాలు ఉద్యోగవృత్తులందు లభిస్తాయి

★మీనం : సాటివారి పోటీ హెచ్చుతుంది నలుగురిలో ప్రసిద్ధికై ప్రాకులాడతారు, తలవని తలంపుగా సభా గౌరవం కూడా సంభవం వ్యాపారం యధాతథం. స్త్రీలకు — బంధువుల రాక, శుభ వ్యవహారాలను గూర్చిన ప్రస్తావనలు, కించిత్తు ఆదాయం గలవారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి *

## హైదరాబాద్ నోట్‌బుక్

### ప్రకాశం విద్యానికేతన్ :

ధైర్య సాహసాలకు, కార్యదక్షతకు, ఆరజన రక్షణకు, ధూర్తజన శిక్షణకు,మంచినిపెంచే మనస్సుకు మమతలు కురిసేమాటలకు, అంత మెరుగని అవుదార్యానికి అంతర్జాతీ సోదర్యానికి కలిమినిబానిసి కావించిన నిరాడంబరానికి ప్రజాకోటి సంతోషంతో పొంగే సంబరానికి మారుపేరు శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు. శ్రీ ప్రకాశంగారి శత జయంతిసంవత్సరంలో ఆనందనగర్ కాలనీ వాసులకొక సద్బుద్ధి పుట్టింది. తమ కాలనీలోని ఖాళీ స్థలంలో ప్రకాశంగారి పేర విద్యాలయం నెలకొల్పడం సమంజసమని కాలనీ సంక్షేమ సంఘం పెద్దలు భావించారు. తదనుగుణంగా పథకాలు సిద్ధపరచి అప్పటి నగరపాలక ప్రత్యేకాధికారి శ్రీ సి. ఎన్ శాస్త్రిని కలుసుకుని చర్చించారు. దాని ఫలితంగా ప్రకాశం విద్యా నికేతన్‌కు 1974 ఆగస్టు 23 న శ్రీ సి ఎన్. శాస్త్రి శంకుస్థాపన చేశారు. ఈ విద్యా నికేతన్ ప్రకాశం శత జయంతి సంవత్సరంలోనే బాలారిష్టా గడిచి, నాలుగుగదులు కట్టుకుంది. వాటికి అప్పటి విద్యామంత్రి శ్రీ మండలి వేంకట కృష్ణారావు ప్రారంభోత్సవం చేశారు,1974 ఆగస్టు23న. ఈ విద్యా నికేతన్ 1973—74 విద్యా సంవత్సరంలో గుర్తింపు పొందింది, అప్పటినుంచి ఒక్కొక్క సంవత్సరమూ పెరుగుతూ 1981 కి ఉన్నత పాటశాల స్థాయికి చేరుకుంది ఆసంవత్సరమేఎస్ ఎస్. సి పబ్లిక్ పరీక్షకు తొలిసారిగా వెళ్లిన వారిలో 75 శాతం ఉత్తీర్ణులు కావడమేకాక 35 శాతం ప్రథమశ్రేణిలో వచ్చారు. ఈ విద్యానికేతన్ విద్యార్థులు వివిధ నగరంలోని వివిధ సాంస్కృతిక సంస్థలు నిర్వహించిన నృత్య నాటక లలిత సంగీత వ్యాసరచనాది స్పర్థలలో ప్రథమ, ద్వితీయాది బహుమతులు సంపాదించారు. సంవత్సర సంవత్సరాభివృద్ధి నందుతున్న ఈ విద్యాలయం త్వరలో జూనియర్ కళాశాలగాను, డిగ్రీ కళాశాలగాను కావడంలో సందేహమే లేదు. మూడు పువ్వులూ, ఆరు కాయలుగా ఈ సంస్థ పెంపొందడానికి కారణ భూతులైన నిస్స్వార్థ సేవా పరాయణులు వీరు. వీరంతా ఏవో ప్రభుత్వ కార్యాలయాలలో పని చేస్తూ, తీరిక సమయంలో విద్యానికేతన్ సర్వతోముఖాభివృద్ధే వ్యసనమయిన వారు. అధ్యక్షులు— ఓ. వి నరసింహం. ఉపాధ్యక్షులు— పి. శ్రీహరి రావు. ప్రధాన కార్యదర్శి, కరస్పాండెంట్— యం. పి ఆర్. వి రాజారావు సంయుక్త కార్యదర్శి— ఎస్. పి కృష్ణమాచారి కోశాధికారి— కె రాధాకృష్ణ జనరల్ ఆడిటర్— కె వైద్య నాథన్. కార్యనిర్వాహక సభ్యులు — ఆకెళ్ల సత్యనారాయణ మూర్తి, జె ఆర్. కె శాస్త్రి. వి. మహాదేవన్ ఎస్. కె చారి. ఉపాధ్యాయునీ వర్గం శ్రీమతులు, ఎం. అన్నపూర్ణ. జి సుభద్ర, డి నాగవేణి, ఎం. సుభద్రాదేవి, సి హెచ్. భారతీ దేవి, జె. ఆర్. సుధా కుమారి, పి. శ్యామలా దేవి, ఎం సుమతి, ఎం. లతా మంగేష్, ఎం విజయరత్నం, కె లక్ష్మీ తులసి, ఆర్. వి. సరోజ, కుమారి— డి. ఎస్. గాయత్రి, కుమారి డి. లీలాకుమారి. ఉపాధ్యాయుడు— ఎం కమలాకరరావు ఎక్కౌంటెంట్ — జి ఆనందరమణారావు ఆయాలు—దుర్గమ్మ, జి. మైసమ్మ

ఈ విద్యానికేతన్ ఆగస్టు 23 న ప్రకాశం జయంతిని వైభవోపేతంగా జరుపుకొన్నది ఉత్సవానికి అధ్యక్షత వహించిన ఆనంద నగర్ కాలనీ సంక్షేమ సంఘాధ్యక్షులు శ్రీ ఓ. వి నరసింహం విద్యార్థులు శ్రీ ప్రకాశం గుణగణాలను అలవరచుకోవాలన్నారు. ముఖ్య అతిథి శ్రీ తిరుమల రామచంద్ర విద్యాలయం ప్రథమ వార్షికోత్సవ సంచికను ఆవిష్కరిస్తూ, అర్థ శతాబ్దినాటి మద్రాసు కుట్రకేసులో చిక్కుకున్నయువకులను శ్రీ ప్రకాశం ఎలా కాపాడిందీ వివరించి, లోపాలులేని మానవుడు ఉండడుగనుక విద్యార్థులు హంసవలె ప్రకాశం గుణాలను గ్రహించాలనీ కోరారు ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. పి ఆర్ వి. రాజారావు నివేదిక చదివిన పిదప ముఖ్యవక్త శ్రీ ఆకెళ్ల సత్యనారాయణ మూర్తి (రిటైర్డ్ డిప్యూటీ కలెక్టర్) ప్రసంగిస్తూ, కష్టపడి పైకి రావడం, ధైర్యంగా త్యాగం చేయడమనే రెండు గుణాలను శ్రీ ప్రకాశం నుంచి విద్యార్థులు నేర్చుకోవాలన్నారు. ప్రారంభంలో విద్యానికేతన్ ప్రధానోపాధ్యాయుని శ్రీమతి డి నాగవేణి స్వాగతం చెప్పారు. పలువురు విద్యార్థినులు, విద్యార్థులు జాతీయ గీతాలు పాడిన పిదప శ్రీమతి ఎం సుభద్రాదేవి వందన సమర్పణ చేశారు. నగరంలో పెక్కు చోట్ల ప్రకాశం జయంతి జరిగింది రాష్ట్ర ప్రభుత్వం ఈ జయంతిని గ్రామ స్వరాజ్య దినోత్సవంగా రవీంద్రభారతిలో జరిపింది. మంత్రి శ్రీ చల్లా రామభూపాల్ రెడ్డి అధ్యక్షత వహించాడు. గ్రామ స్వరాజ్యం కోసం కలలు గన్న శ్రీ ప్రకాశం ఆశయాలను ఆచరణలో పెట్టాలని ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకట్రాంకోరారు. విధానసభ ముందున్న ప్రకాశం విగ్రహాన్ని హైదరాబాద్ నగర పాలక సంఘం ప్రత్యేకాధికారి శ్రీ ఏ వి. ఎస్. రెడ్డి పూలమాలలతో అలంకరించారు.

### రామదాసు ఆత్మ నివేదనం :

దేనికైనా మనసు ఉండాలి గాని మార్గం దొరక్కపోదు. సహృదయ మిత్రులు శ్రీ ఎ. ఎస్. మూర్తికి మనసు కలిగింది. అన్నమాచార్య ప్రణాళికలాగే, రామదాసు ప్రణాళిక కూడ రూపొందించి, రామదాసు కీర్తనలతో ఒక శ్రవ్య రూపకాన్ని సహృదయా భక్తులకు అందించాలను కున్నారు మధుర గాయని శ్రీమతి సుందరమ్మ పార్థసారథి, శ్రీ కె బి. కె. మోహన్ రాజు సహకరించారు. ఇకనేం? శ్రోతలకు పెద్ద విందు లభించింది ఆగస్టు 25 వ తేదీన రవీంద్రభారతిలో ఆనాటి సాయంకాలం ఆరున్నర గంట నుంచి పది గంటలవరకు రామదాసు కీర్తనామృతపానంతో శ్రోతలు వైమరచిపోయారు. రామచంద్రాయ జనకరజామనోహరాయ అని మంగళం విన్నవారు మూడు గంటలు గడచి పోయాయని గ్రహించలేక, ఇదేమిటి? ఇంతలోనే మంగళమా? అని విస్తుపోయారు. ఈ రామదాసు సంకీర్తన పరమాన్నాన్ని దివ్య జీవన సంఘం సనత్‌నగర్‌శాఖవారు వడ్డిం



హైదరాబాద్ నగరంలో ఆనందనగర్‌కాలనీ వాస్తవ్యులు స్వయంకృషితో నిర్మించిన ప్రకాశం విద్యానికేతన్ భవనం.

## హైదరాబాద్ నోట్‌బుక్

చారు. శ్రీమతి సుందరమ్మ, శ్రీ మోహన్‌రాజు జై జానకీరమణ, చరణములే నమ్మితి, తారక మంత్రము కోరినదొరికెను, ఏమయ్య రామ, ఏతీరుగ నను, అదిగో భద్రాద్రి, రామా దయ జూడవే, తక్కువేమి మనకు, దీనదయాళో, అంతా రామ మయం, గరుడ గమన రారా, పాహిరామ ప్రభో, సీతారామస్వామీ నే చేసిన నేరంబేమి, ఇక్ష్వాకు కుల తిలక, రామచంద్రులు నాపై చలము, పలుకే బంగార మాయెనా, నను బ్రోవమని చెప్పవే, ఓ రామ నీ నామ మెంత రుచిరా, రామజోగిమందుకొనరే— అనే కీర్తనలు గొప్పగా, మనస్సు కరిగేట్టు ఆలపించారు. శ్రీ ఎ. ఎస్. మూర్తి ఆయా కీర్తనలకు సందర్భోచితంగా వ్యాఖ్యను గుదిగుచ్చారు. ముఖ్య అతిథిగా రావలసిన గిరిజన సంక్షేమశాఖా మంత్రి శ్రీ సి హెచ్. శ్యామలరావు రానందున దివ్యజీవన సంఘం ప్రధాన కార్యదర్శి ప్రముఖ న్యాయవాది శ్రీ వేణుగోపాల రెడ్డి శ్రవ్య రూపకాన్ని ప్రశంసిస్తూ, అష్టవిధ భక్తులలో చివరిదైన ఆత్మ నివేదనం అనే పేరుతో దీనిని సమర్పించడం ప్రశంసనీయ మన్నారు. కలియుగంలో హరి నామస్మరణ తప్ప మరొక శరణోపాయంలేదని ఆయన అన్నారు. దివ్యజీవన సంఘం సనత్‌నగర్ శాఖ కార్యదర్శి శ్రీ జి సిహెచ్. రామారావు స్వాగతం చెబుతూ, దివ్య జీవన సంఘం నగరవాసుల ఆధ్యాత్మికోన్నతికై చేస్తున్న సేవను వివరించారు. రామదాసు ఆత్మ సమర్పణతో సహకరించిన వాద్యకారులు వీరు — వీణ— శ్రీమతి మణిరఘునాద్. వయొలిన్— కుమారి మీనాక్షి. మృదంగం— శ్రీ నారాయణ మూర్తి. తబల— శ్రీ కె. కోటిలింగం, వేణువు— శ్రీ దత్తా. రిధిం— శ్రీ నరసింహ. సహకారగనం— కుమారి ఉషారాణి, మాస్టర్ మదన్ మోహన్. ఈ తియ్యని పరమాన్నంలో ఒకటి రెండు రాళ్ళు కనిపించాయి. వందేవాల్మీకి కోకిలం— అనేది సరైన పాటం. వాల్మీకి కవి కోకిలం అనక్కర్లేదు. అంటే, చందో భంగం కూడ. శ్రీ రామచంద్ర శ్రితపారిజాత: — సరైన పాటం. ఆశ్రిత పారిజాత: అంటే చందోభంగం. శ్రిత అన్నా ఆశ్రిత అన్నా ఒకే అర్థం. రైక్వుడు మాలకాదు. ఈలాటి రాళ్లను సులభంగా ఏరివేయవచ్చు. కపిలవాయి రామనాథశాస్త్రి పాడిన రామజోగి మందు పాటను గాయకులు వినాలని మనవి.

**ఉపశ్రుతి:**

ముఖ్యమంత్రి శ్రీ వెంకటరామ్ వినాయక నిమజ్జనోత్సవంనాడు ఫతేమైదానంలో కట్టిన వేదిక కుసిపడిపోగా పడిపోయారుట విన్నారా? — అనడిగారు వూరేగింపులోని వారొకరు నన్ను. పీడా విరుగడైంది. పతనం శని దీనితో పోయింది. ఇక ఆయనకు పతనం లేదు— అన్నారు వూరేగింపులోని మరొకరు.

—తిరుమల రామచంద్ర

## గ మ ని క

గేయాలు పంపేవారు వా టి తో తపాలా కార్డు జత పర చ వ ల సి వుంటుంది గేయాలు త్రిప్పి పంప బడవు. గేయాలు, కవితలు సాధ్యమై నంత క్లుప్తంగా వుండటం మంచిది.

సం.



# ఉ త్త రా లు

(4 వ పేజీ తరువాయి)

### సందేహం

"మార్పు" అను కథ చాల బాగా ఉన్నది. దాని రచనా తీరు వర్ణించిన వసుంధరగారికి నా ధన్య వాద ములు కాని నాదొక సందేహము. ఈ రోజుల్లో ఒక పెద్ద హోదా గల ఆఫీసర్ ఒక చిన్న ప్రయి వేట్ గుమాస్తా స్నేహమనేది చాల విచిత్రమైనది. అతను అదే కంపెనీలో ఉద్యోగంనుండి తీసివేసి తిరిగి అతనికి మూడు నెలల జీతం ఇవ్వడం సహజమే. కాని ఆ గుమాస్తా జీవితాంతము అతనికి వేరే మార్గం లేక పోవడంవల్ల దుఃఖ సాగరంలో మునిగి పోవడం అనేది ఒక సందేహం ఏ ఆధారంలేని వాళ్ళను ఉన్న పని మాన్పించడం, ఇంక వాళ్ళకు సహాయం చేశామని అనిపించుకోవడం చాలమంది రచయిత(త్రి) లకు అలవాటుగా నున్నందున పై విషయాలను గురించి శ్రద్ధ వహిస్తే చాల మంచి దని అనుకుంటున్నాను

అప్పన్నగారి "కిషన్‌రావు" (రామాయంపేట)

### కొత్త మలుపు

కొత్త సీరియల్ "ధర్మో రక్షతి రక్షిత" ఎంచక్కా ప్రారంభమై 'సప్తపది' సినిమా చూసి నంత ఆనందాన్ని ఇచ్చింది ఆకెళ్ళ వెంకట సూర్య నారాయణగార్కి, ప్రచురిస్తున్న మీకు వెలకట్టలేని అభివందనములు కథలు అన్నీ బావున్నాయి. 'కాలం కరిచాకా' సీరియల్ మరో క్రొత్త మలుపు తిరిగి ముందు ముందు ఏమి జరుగుతుందా? అనే టటువంటి ఉత్కంఠను కలుగజేస్తోంది. "డొనేషన్" మల్లిక్(క) వితరణ బావుంది

పెన్మెత్స సూరిబాబు (హైదరాబాద్)

### అమ్మగారి అనుగ్రహం కోసం

పదహారణాల తెలుగు వారయిన మన ముఖ్య మంత్రి శ్రీ భవనం గారికి తెలుగు స్వాతంత్రయోధుల పేర్లు దొరకక ఒక సాధారణ పార్లమెంటు సభ్యుని పేరే దొరికిందా? (మన నాగార్జున సాగర సమీ పంలో "సంజయవనం"గురించి ఆంధ్ర వారపత్రి కలో హైదరాబాద్‌నోటుబుక్ శీర్షికలో23 7 82) ఎప్పుడూ అమ్మ అనుగ్రహం కోసం ప్రాకులాడేదే కాని మనకు స్వతంత్ర భావాలు ఎప్పుడు అలవడు తాయో?

జె. ఎన్. అర్జునరావు (పూనె)

### ఆసక్తికరం

శ్రీ ఆకెళ్ళ వెంకటసూర్యనారాయణగారి రచన "ధర్మో రక్షఌ. రక్షిత" కొత్త సీరియల్ చాలా ఆసక్తికరంగా ఉంది సనాతన సాంప్రదాయం, వైదికం మూర్తీభవించిన యజ్ఞన్న దీక్షితులుగారి పాత్రను చాలా చక్కగా మలిచారు రచయితగారు.

ఎస్. భారతి (గద్వాల)

### రచనా శైలి

శ్రీ గుడిసేవ సుందరరామయ్యగారి "పరిష్కారం మీరే చెప్పండి" అనే కథ, ఇతివృత్తం పాతదే అయినా, కథను మలిచినతీరు బాగుంది పాఠకుడిని కథలోకి నడిపించే గొప్పతనం, కథను పూర్తిగా చదవాలనే ఉత్సుకత కలిగించే రచయిత యొక్క రచనాశైలి మెచ్చదగినది

కోసూరు గాంధి (మద్రాసు)

### కోరిక తీర్చలేదు

మా అభిమాన నటి వాణిశ్రీ ముఖ చిత్రం వెయ్యమని కోరుతూ లోగడ ఎన్నో ఉత్తరాలు రాసాం అయినా ఇంతవరకూ ఒక్కసారి కూడా మా కోరిక తీర్చలేదు. ప్రతి వారం పత్రిక చేతిలోకి రాగానే ముందుగా వాణిశ్రీ ముఖచిత్రం కోసం చూసే మాకు ప్రతి వారం నిరాశే ఎదురవుతోంది. వాణిశ్రీ పరిశ్రమ నుంచి తప్పుకున్నా ఆమె నింకా ప్రేక్షకులు మరిచిపోలేదు. ఆమె అభిమానిగా ఒక్క సారి వాణిశ్రీ ముఖ చిత్రం వెయ్యమని సంపాదక వర్గానికి సవినయంగా మనవి చేస్తున్నాను.

వేమూరి శ్రీవాణి (కరీంనగర్)

### ధర్మో రక్షతి రక్షితః

"ధర్మో రక్షతి రక్షిత." చదువుతున్నంత సేపు మా మనస్సు ఆ పాత్రల చుట్టు పర్య వేక్షిస్తున్నాయి కాలానుగుణంగా మన సంఘంలో జరుగుతున్న మార్పులు అందులో అగ్రకులము అనే ముద్ర వేసి వాళ్ళను సీత కన్ను వేసి చూస్తున్న మన ప్రభుత్వ నిర్లక్ష్యం చక్కగా తెలియజేస్తున్నారు నేడు బ్రాహ్మణ కుల జీవితం త్రిశంకు స్వర్గమయి కూర్చుంది ఈ నవల ఇటు నేటి ప్రజలకు, అటు ప్రభుత్వానికి కనువిప్పు కావాలి

గురువెళ్లి గోవిందరావు, కె. వెంకటేశ్వరరావు (ఖర్గపూర్)

* * *

"ధర్మో రక్షతి రక్షిత" చాలా ఆసక్తి దాయకంగా ఉంటోంది సనాతన బ్రాహ్మణ ధర్మాన్ని రక్షించడానికిపూనుకున్న ఓ మధ్యతరగతి కుటుంబం నేటి కుల వ్యవస్థతో ఎదుర్కొంటున్న ఇబ్బం దుల్ని రచయిత చక్కగా చిత్రించారు. కుల మతాలు లేవంటూనే—వాటిని సమూలంగా నాశనం చేయాలంటూనే—వేరొక ప్రక్క వాటికి పరో క్షంగా పట్టం కట్టి ప్రోత్సహిస్తున్న ప్రభుత్వపు ద్వంద్వ వైఖరి సామాజిక కళ్యాణానికి, సర్వ సౌభ్రాత్వానికి ఏ రకంగానూ సహాయకారి కాలేదు. ఇది పచ్చి నిజం!

వి. వి. సుబ్బారావు (ఖమ్మం)


**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3, Editor: S. Radhakrishna**